భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ వాయు పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఎ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ వాయు పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...






Sreepeetam

# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.

Ph: 27076655, M: 098490 33991


# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక





# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

| | | | |
|---|---|---|---|
| 9. | భవిష్యపురాణం | - | శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు |
| 10. | బ్రహ్మవైవర్తపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు |
| 11. | లింగపురాణం | - | శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ |
| 12. | వరాహపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ |
| 13. | స్కందపురాణం | - | శ్రీ మహావిష్ణువు కేశాలు |
| 14. | వామనపురాణం | - | శ్రీ మహావిష్ణువు చర్మం |
| 15. | కూర్మపురాణం | - | శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం |
| 16. | మత్స్యపురాణం | - | శ్రీ మహావిష్ణువు మెదడు |
| 17. | గరుడపురాణం | - | శ్రీ మహావిష్ణువు మాంససారం |
| 18. | బ్రహ్మాండపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎముకలు |

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు- అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽ స్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని - సనకాదులు నారదునికి బోధించారు.<br>ఉత్తరభాగాన్ని - వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ర్బాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽ శ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ వాయు పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో నాలుగోది వాయుపురాణం. వాయుదేవుడు వక్తగావున్న కారణంగా ఈ పురాణానికి వాయుపురాణం అన్నపేరు వచ్చింది. 'వాయుర్వ్యామోమహేశితుః' అన్న మాట ప్రకారం ఈ పురాణం శ్రీమహావిష్ణువుకి ఎడమభుజంగా కీర్తించబడింది. 'చతుర్వింశతి సాహస్రం పురాణంతదిహోచ్యతే' అనగా ఈ దివ్యపురాణంలో మొత్తం 24 శ్లోకాలున్నాయి. అయితే ప్రస్తుతం లభిస్తున్న వాయుపురాణంలో 10991 శ్లోకాలే మనకు కనిపిస్తాయి.

వాయుపురాణం 1. ప్రక్రియాపాదం 2. ఉపోద్ఘాత పాదం 3. అనుషంగ పాదం 4. ఉపసంహార పాదం అని నాలుగు పాదాలుగా విభాగించబడింది. ఈ నాలుగు పాదాలలో కలిపి మొత్తం 112 అధ్యాయాలున్నాయి. భారతదేశంలో సుప్రసిద్ధ దివ్యక్షేత్రమైన 'గయ' గురించి ఈ పురాణం విస్తృతంగా వర్ణిస్తుంది.

## వాయుపురాణంలో చెప్పిన విషయాలు

**1. ప్రక్రియాపాదం :** ఈ విభాగంలో మొత్తం ఆరు అధ్యాయాలున్నాయి. వీటిలో ద్వాదశవార్షిక అనగా 12 సంవత్సరాలు జరిపే యాగం, సృష్టివిశేషాలు, సకల ప్రపంచసృష్టి, జీవుడు, ప్రకృతి భగవంతుడి అవతారం తదితర విషయాలు ప్రధానంగా చెప్పబడ్డాయి.

**2. ఉపోద్ఘాతపాదం :** ఇందులో మొత్తం 58 అధ్యాయాలున్నాయి. వాటిలో చతురాశ్రమవిభాగం, మన్వంతరాలు, పాశుపతం, యోగవిషయాలు,

యోగం ద్వారా లభించే ఐశ్వర్యాలు, పాశుపతయోగం, శౌచాచారలక్షణాలు, యతుల ప్రాయశ్చిత్త విధానం, అరిష్టాలు, ఓంకారం లభించటానికి తగిన మార్గాలు, కల్పాల నిరూపణం, మహేశ్వరుడి అవతార యోగం, మధుకైటభుల ఉత్పత్తి వినాశనం, స్వరం ఉత్పత్తి, ఋషివంశం, అగ్నివంశం, యుగధర్మనిరూపణం, జంబూద్వీప వర్ణనం, భువనవిన్యాసం, జ్యోతిష్య ప్రచారం, నీలకంఠుడి స్తుతి, లింగోద్భవం, పితృ, యజ్ఞవర్ణనలు, ఋషి లక్షణాలు తదితర ప్రధాన విషయాలు వివరించబడ్డాయి.

3. **అనుషంగపాదం :** ఈ విభాగంలో మొత్తం 94 అధ్యాయాలున్నాయి. వీటిలో పృథివీదోహనం, పృథువంశకీర్తనం, వైవస్వత సర్గ, కాశ్యపీయసర్గ, శ్రాద్ధకల్పం, తీర్థయాత్ర, దానఫలం, బ్రాహ్మణదీక్ష, వైవస్వత మనువంశం, చంద్రవంశం, కార్తవీర్యార్జునుడి చరిత్ర, విష్ణువంశ వర్ణనం, విష్ణువు మాహాత్మ్యం తదితర విశేషాలు వివరించబడ్డాయి.

4. **ఉపసంహారపాదం :** ఇందులో మొత్తం 136 అధ్యాయాలుంటాయి. వీటిలో శివపురవర్ణన, సృష్టి వర్ణన, వ్యాస సంశయాపనోదనం, గయాక్షేత్రమాహాత్మ్యం లాంటి విశేషాలు సవివరంగా చెప్పబడ్డాయి. ఇలా ఎన్నో విశేషాలతో కూడిన వాయుమహాపురాణం వ్యాస మహర్షి చేత రచించబడింది. ఈ మహాపురాణంలోని ముఖ్యమైన అంశాలని సంక్షిప్తంగా కూర్చి, శ్రీ వాయుపురాణం అన్న ఈ గ్రంథం ద్వారా పాఠకులకి అందిస్తున్నాం.

## అనుక్రమణిక

ప్రపద్యే దేవమీశానం శాశ్వతంధ్రువ మవ్యయమ్ ।
మహాదేవం మహాత్మానం సర్వస్య జగతః పతిమ్ ॥

బ్రహ్మాణం లోక కర్తారం సర్వజ్ఞ మపరాజితమ్ ।
ప్రభుం భూతభవిష్యస్య సాంప్రతస్య సత్పతిమ్ ॥

*(శ్లో॥2, అధ్యా-1)*

శాశ్వతమైనవాడు, నిత్యం ఉండేవాడు, నాశనమనేదే లేనివాడు, అందరు దేవతలకన్నా ఎంతో గొప్పవాడు, మహాత్ముడు, జగత్తుకి ప్రభువు అయిన ఈశ్వరుణ్ణి శరణువేడుకుంటున్నాను. అలాగే లోకాన్ని సృష్టించిన బ్రహ్మ దేవుణ్ణి శరణు వేడుతున్నాను. సర్వజ్ఞుడు, అపజయమన్నదే ఎరగనివాడు, భూతభవిష్యత్ వర్తమానాలకి ప్రభువు అయిన శ్రీమహావిష్ణువుని శరణు కోరుతున్నాను.

పూర్వం మహాపరాక్రమవంతుడు, తేజస్వి, మహాత్ముడు అయిన అసీమకృష్ణుడనే మహారాజు భూమిని పాలిస్తున్న రోజుల్లో, రజోగుణం లేనివారు బాహ్యేంద్రియనిగ్రహులు అయిన ఋషులు కురుక్షేత్రంలో వున్న 'దృషద్వతీ' అనే నదీతీరంలో సత్రయాగాన్ని నిర్వహిస్తున్నారు.

ఒకనాడు వేదవ్యాసుడి శిష్యుడైన సూతమహర్షి అక్కడికి వచ్చాడు. ఆయన్ని దర్శించి అక్కడున్న మునులంతా ఎంతో సంతోషించి యథోచితంగా సత్కరించారు. తరువాత వారంతా ప్రార్థించగా ఆయన వాయుమహాపురాణాన్ని అందులో విశేషాలని వారికి సరళసుబోధకంగా ప్రవచించాడు.

పూర్వం నైమిశారణ్యంలో నివసించే మహాత్ములు మహర్షులు, మునులు కోరగా మొదటిసారి వాయుదేవుడు ఈ పురాణాన్ని వారికి ప్రబోధించాడు. తరువాత బ్రహ్మవేత్త అయిన వ్యాసమహర్షిచేత ఈ పురాణం లోకంలో ప్రాచుర్యం పొందింది.

ఈ దివ్యపురాణంలో దేవతలు, ఋషులు, నదులు, పర్వతాల ఉత్పత్తి వర్ణించబడుతుంది. అన్ని మన్వంతరాలు, కల్పాలు, కూడా వర్ణించబడతాయి. బ్రాహ్మణ క్షత్రియ రాజవంశాలవారి ఉత్పత్తి బ్రహ్మదేవుడి ఆవిర్భావం, బ్రహ్మచేసిన సృష్టి, జగత్తు స్థితి గతులు, శ్రీమహావిష్ణువు శయనించటం, భూదేవిని ఉద్ధరించటం లాంటి విషయాలు వివరించబడ్డాయి.

అన్ని శాస్త్రాల కన్నా ముందుగా బ్రహ్మదేవుడు పురాణాలని స్మరించాడు. ఆ తరువాత ఆయన ముఖం నుంచి వేదాలు ఆవిర్భవించాయి. వాటి వెంటే

వేదాంగాలు, ధర్మశాస్త్రాలు, వ్రతాలు, నియమాలు ఏర్పడ్డాయి. పశువుల ఉత్పత్తి, మానవుల ఉత్పత్తి ఎలా జరుగుతుందో ఈ పురాణం వివరిస్తుంది. వీటితోపాటు బ్రహ్మచేసిన తొమ్మిది మంది మానసపుత్రుల సృష్టి, తదితర విషయాలు కూడా వర్ణించబడ్డాయి.

భారతదేశం వాటిలో ఉన్న నదులు, పర్వతాలు, చలించే ప్రాణులు, చలనంలేని ప్రాణులు, సప్త సముద్రాలతో ఆవరించిన జంబూద్వీపం, భూమి, లోకాలోకపర్వతం వర్ణించబడింది. వీటితో పాటు సూర్యచంద్రులు, భూమి, వీటి పరిమాణం, యోజనాల వివరాలతో సహా వర్ణించబడతాయి.

రజోగుణప్రధానులైన గృహస్థులు పొందే పితృమార్గం, సత్త్వగుణ ప్రధానులైన సన్న్యాసులు పొందే ఉత్తర (దేవ)మార్గం, శ్రీమహావిష్ణువు కొలువుండే వైకుంఠధామం, సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్రాలగతి, ధ్రువుడి వల్ల ప్రజలకి కలిగే శుభాశుభాలు వివరించబడతాయి. ఈ పురాణంలో దేవతల నివాసాలు, పుణ్యాత్ములు నివసించే లోకాలు, వర్ణించబడతాయి.

యుగాలసంఖ్య వాటి పరిమాణం, కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలలో క్రమంగా ధర్మం తగ్గిపోవటం, వర్ణాశ్రమధర్మాలు, ప్రతియుగంలో మానవుల దేహప్రమాణం, ఆయుర్దాయం, అలాగే వేదాలు, వేదమంత్రాలు, వేదశాఖలు, మూడు మన్వంతరాలు, కాలజ్ఞానం, మన్వంతరాలలో ఉండే దేవతలు, మహారాజులు వర్ణించబడ్డారు.

మహాత్ములైన కశ్యపుడు, పులస్త్యుడు, అత్రి, పరాశరమహర్షి, వారి సంతానం, దేవతల తండ్రులు, మనుమలు, వారి జన్మలు, భూమివిస్తారం, సూర్యుడి విస్తారం ఆ తరువాత కుక్షి చరిత్ర, ఇక్ష్వాకువు నుంచి బృహద్బలుడి వరకు నిమిచక్రవర్తి నుంచి జుహ్నుగణాల వరకు ఉన్న చక్రవర్తుల చరిత, వీరితోపాటు యయాతి చరిత్ర, యదువంశ చరిత్ర, హైహయుడి చరిత్ర, క్రోష్టువంశ చరిత్ర, వృష్టిమహారాజు చరిత్ర వంటివి వివరించబడ్డాయి.

ఉత్తమజ్ఞాన రాశి అయిన ఈ పురాణాన్ని పూర్వం బ్రహ్మదేవుడు చెప్పాడు. ఎన్నెన్నో మహత్తర విషయాలతో నిండిన ఈ వాయుపురాణాన్ని వాయుదేవుడు మహర్షులకి బోధించాడు. ఈ పురాణంలో ఉన్న విషయాల్ని ముందు సంగ్రహంగా చెప్పి ఆ తరువాత విశేషంగా వివరించటం జరుగుతుంది. ఇది మొదటి పాదం. దీన్ని చదివితే పురాణం మొత్తం చదివిన ఫలం లభిస్తుంది.

'పురా' అపినవం పురాణమ్. పూర్వం(ఈ సృష్టికి మొదట్లో) ప్రవర్తిల్లినది కనుక పురాణం అయింది. ఈ నిర్వచనం తెలుసుకున్న వ్యక్తి అన్ని పాపాలనుంచీ విముక్తి పొందుతాడు. ఈ పురాణం అంతా మహేశ్వర స్వరూపం.

## ద్వాదశ వర్షయాగం

పూర్వం మహాతపస్సంపన్నులైన మహర్షులు లోక సృష్టికోసం నైమిశారణ్యంలో ఒక మహత్తర సత్రయాగం చేయాలనుకున్నారు. పరుగుతీస్తున్న ధర్మచక్రం భారతభూమిలో ఒక దివ్య ప్రదేశంలోకి వచ్చి ఆగింది. ఆ ధర్మచక్రం ఆగిపోయిన ప్రదేశమే కాలక్రమంలో నైమిశ క్షేత్రంగా విఖ్యాతి చెందింది. ఆ దివ్య స్థలంలోనే ఋషులందరూ కలిసి సత్రయాగాన్ని ప్రారంభించారు.

ఈ సత్రయాగానికి సూర్యుడు యజమానిగా ఉండగా, బ్రహ్మదేవుడు స్వయంగా ఆచార్యత్వాన్ని నిర్వహించాడు. భూదేవి యాగంచేసే యజమానికి పత్ని. ఆ దివ్యయాగానికి మహాతేజశ్శాలి అయిన యముడు సమిధగా ఉన్నాడు. వారంతా కలిసి వేయిసంవత్సరాలపాటు సత్రయాగాన్ని కొనసాగించారు.

**గోమతీనది :** ఆ పవిత్రనైమిశారణ్యంలో సిద్ధులచేత, చారణులచేత నిత్యం సేవించబడే గోమతీ నది ఉంది. రోహిణీదేవి అక్కడే సౌమ్యుడనే వాణ్ణి కన్నది. మహర్షి వశిష్టుడుకి 'శక్తి' అనే జ్యేష్ఠకుమారుడు అక్కడే జన్మించాడు. ఆ ప్రాంతంలోనే కల్మాషపాదుడు శపించబడ్డాడు. అరుంధతీదేవికి అక్కడే తోజోవంతులైన వందమంది పుత్రలుదయించారు. ఆ నదీతీరంలోనే వశిష్ఠ–విశ్వామిత్రులకి వైరం ప్రారంభమయ్యింది.

ఆ నైమిశ క్షేత్రంలోనే అదృశ్యంతీదేవికి పరాశరమహర్షి జన్మించాడు. అలాంటి దివ్యమైన నైమిశారణ్యంలో సత్రయాగం చేయటం వలన వారందరికీ నైమిశేయులు అన్న ఖ్యాతి లభించింది.

మహర్షులు యాగం ప్రారంభించి 12 సంవత్సరాలు గడిచింది. ఆ సమయంలో మహాపరాక్రమ వంతుడైన పురూరవుడు భూమండలాన్ని పాలిస్తున్నాడు. పురూరవుడికి రత్నాలంటే ఎంతో వ్యామోహం. ఆ రాజు సముద్రంలో ఉన్న 18 ద్వీపాలనీ వశం చేసుకున్నాడు. అయినా ఆయన రత్నాల కాంక్ష తీరలేదు. ఒకనాడు దేవహూతి చేత ప్రేరేపించబడ్డ ఊర్వశి పురూరవుణ్ణి కామించింది. పురూరవుడు కూడా ఊర్వశిని ఇష్టపడ్డాడు. అలా వారిద్దరిమధ్యా సంబంధం దృఢమైంది. ఒకరోజు నైమిశంలో జరుగుతున్న సత్రయాగం దగ్గరకి వచ్చాడు.

పూర్వం గంగాదేవి అగ్ని వల్ల గర్భాన్ని ధరించింది. ఆమె తన గర్భంలో ఉన్న తేజోమయమైన పిండాన్ని భరించలేక నైమిశ సమీపంలో ఉన్న ఒక పర్వతం మీద విడిచింది. దివ్యమైన ఆ తేజోపిండం ప్రభావంతో ఆ పర్వతమంతా బంగారుకొండగా మారిపోయింది. యాగం చేసే మహర్షులు ఆ కొండని తొలచి బంగారంతో యజ్ఞవాటికని నిర్మించారు.

బంగారంతో నిండిన ఆ యజ్ఞ వాటికని చూసి పురూరవుడు ఎంతో ఆశ్చర్యపోయాడు. అతడికి ఆశపుట్టింది. ఆ బంగారాన్నంతా తన స్వాధీనం చేసుకోవాలనుకున్నాడు. ఆ విషయం గ్రహించిన ఋషులకి ఎంతో కోపం వచ్చింది. వెంటనే అక్కడే ఉన్న దర్భలు అనే వజ్రంతో పురూరవుణ్ణి దండించారు. ఆ వజ్ర ఘాతానికి తట్టుకోలేక పురూరవుడు మరణించాడు. అప్పుడు మహర్షులందరూ కలిసి పురూరవుడికి ఊర్వశి ద్వారా జన్మించిన నహుషుణ్ణి మహారాజుగా అభిషేకించారు.

నహుషుడు రాజైనప్పటినుంచి ఎంతో ధర్మప్రవర్తనతో సాధువుల్ని మహర్షుల్ని గౌరవించేవాడు. బ్రహ్మవేత్తలైన ఆ మహర్షులు జగత్ సృష్టికోసం

జరుపుతున్న సత్రయాగానికి – వైఖానస, వాలఖిల్య, మరీచికాది మహర్షులు, సూర్యుడితో అగ్నితో సమానతేజస్సు కలిగిన ఎందరో ఋషులు, దేవతలు, పితృదేవతలు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, నాగులు, యక్షులు, చారణులు, అప్సరసలు విచ్చేశారు.

ఆవిధంగా మహర్షులందరూ తమ శక్తిని, విద్వత్తుని, కర్మ సామర్థ్యాన్ని కలబోసి సత్రయాగాన్ని 12 సంవత్సరాలు నియమనిష్ఠలతో ఆరాధించారు. వారంతా తమ యజ్ఞాన్ని పూర్తి చేసుకుని, మహానుభావుడు, అనంత స్వరూపుడైన వాయుదేవుణ్ణి పిలిచి తమకి పురాణాన్ని చెప్పమని కోరారు. అలా వారిచేత ప్రార్థించబడ్డ వాయువు ఈ పురాణాన్ని వారికి ప్రవచించాడు.

వాయుదేవుడు పరమేశ్వరుడికి శిష్యుడు. సర్వాన్నీ ప్రత్యక్షంగా చూడగలిగేవాడు. ఆయన అణిమాది అష్టసిద్ధుల్ని కలిగినవాడు. లోకంలో ఉండే పశుపక్ష్యాది సమస్త జీవుల్నీ భరించేవాడు వాయువే. ఆయన 1.అవహ 2.ప్రవహ 3.సంవహ 4.ఉద్వహ 5.నివహ 6.పరివహ 7.పరావహ అనే ఏడు స్కందాలలో ఎప్పుడూ వేగంగా సంచరిస్తుంటాడు. ఏడు రకాల మరుద్గణాలు ఆయన ఆధీనంలో ఉంటాయి. అమిత బలశాలి అయిన వాయువు ప్రాణుల శరీరానికి ప్రాణం పోసి, వారు తిన్న ఆహారాన్ని జీర్ణం చేయటంలో అగ్నికి సహకరిస్తూ ప్రాణులందర్నీ ధరిస్తున్నాడు.

ఇంద్రియ వ్యాపారాలతో ప్రేరేపించబడ్డ ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానాలనే అయిదురకాల వాయువృత్తులు ప్రాణుల శరీరధారణకి మూలంగా ఉన్నాయి. ఆకాశం నుంచి గాలిపుట్టింది. ఆ గాలినుంచి అగ్ని జన్మించింది. వాయుదేవుడు క్రియాస్వరూపుడు వ్యాకరణశాస్త్ర కోవిదుడు. సర్వకాలాలలో ఆయన వీస్తూనే ఉంటాడు. సకల పురాణాలనీ తెలిసిన ఆ వాయుదేవుడు, పవిత్రమైన ఆ మహర్షులందర్నీ సంతోషపెడుతూ, తన మధురమైన వాణితో వారికి పురాణాన్ని చెప్పటం ప్రారంభించాడు.

## మహేశ్వర యోగం

పూర్వం రుద్రుడి చేత పురాణాలలో ఐదు ప్రధాన ధర్మాలు చెప్పబడ్డాయి. ఆ అయిదుధర్మాలనీ ఆదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, అశ్వినీదేవతలు, మరుత్తులు, భృగువులు, యముడు, శుక్రుడు, పితరులు, ఇలా మరికొంతమంది ఉపాసించారు. మహేశ్వరుడి చేత చెప్పడం ఆ ఐదు ధర్మాలు– 1.ప్రాణాయామం 2.ధ్యానం 3.ప్రత్యాహారం(ఇంద్రియాలని అదుపులో ఉంచుకోవటం) 4. ధారణ 5.స్మరణ అనేవి. ఈ ఐదు ధర్మాలనే యోగధర్మాలని కూడా అంటారు. వీటిలో ప్రధానమైనది ప్రాణాయామం.

**ప్రాణాయామ లక్షణాలు :** ప్రాణం అనగా వాయువు. దాని పొడవైన నడకనే (ప్రాణ+ఆయామం) ప్రాణాయామం అంటారు. ఈ ప్రాణాయామం 1.మందం 2.మధ్యమం 3.ఉత్తమం అని మూడు విధాలుగా ఉంటుంది. ప్రాణాన్ని అనగా వాయువుని నిరోధించటాన్నే ప్రాణాయామం అని కూడా అంటారు. ప్రాణాయామం కొలత 12 మాత్రలుగా చెప్పబడింది. ఈ మూడు రకాల ప్రాణాయామాలలో, మందప్రాణాయామం 12 ఉద్ఘాతాలతో 12 మాత్రలతో ఉంటుంది. మధ్యమ ప్రాణాయామం 24 ఉద్ఘాతాలతో, 24 మాత్రలతో ఉంటుంది. అలాగే చివరిదైన ఉత్తమప్రాణాయామం 36 ఉద్ఘాతాలతో 36 మాత్రలతో కూడుకుని ఉంటుంది. ఉత్తమ ప్రాణాయామం చెమటని, కంపా(వణుకు)న్ని, విషాదాన్ని కలుగచేస్తుంది. ఈ విధంగా ప్రాణాయామం మూడు విధాలుగా ఉంటుంది.

**ప్రాణాయామ వైశిష్ట్యం :** అడవిలో సంచరించే సింహాన్నిగానీ, ఏనుగుని గానీ లేదా మరో జంతువుని కానీ పట్టుకుని దాన్ని చాలా జాగ్రత్తగా మచ్చిక చేసుకుంటే అది తన కఠిన స్వభావాన్ని వదిలి మృదుస్వభావిగా మారుతుంది. అలాగే పాపాత్ములకి వశంకాని ప్రాణం యోగం వల్ల సేవించబడుతూ, అభ్యాసం ద్వారా అది పట్టుబడుతుంది. యోగం ద్వారా వశమైన ప్రాణం, తనను వశం చేసుకున్నవాడి శరీరంలో ఉన్న పాపాలన్నిటినీ దహించి వేస్తుంది. నిత్యం ప్రాణాయామాన్ని ఆచరించేవాడికి సకలదోషాలూ హరించిపోతాయి. ఆరోగ్యం లభిస్తుంది.

ప్రాణాయామేన యుక్తస్య విప్రస్య నియతాత్మనః ।
సర్వేదోషాః ప్రణనశ్యంతి సత్త్వస్థశ్చైవ జాయతే ॥
తపాంసి యాని తప్యంతే వ్రతాని నియమాశ్చయే ।
సర్వయజ్ఞఫలంచైవ ప్రాణాయామశ్చ తత్సమః ॥

*(శ్లో॥ 85-86, అధ్యా-10)*

అన్ని రకాల తపస్సుల ఫలితాలు, సకల యజ్ఞాలు చేసిన ఫలితాలు ప్రాణాయామంతో సమానం. వందసంవత్సరాల పాటు ప్రతినెలా దర్భాగ్రం నీటి బిందువును త్రాగి, ఆ ఒక్క దర్భనే ఆహారంగా స్వీకరిస్తూ కఠినమైన ఉపవాసం చేయటంతో సమానమైనది ప్రాణాయామం.

ప్రాణాయామై ర్దహేద్దోషాన్ ధారణాభిశ్చకిల్బిషమ్ ।
ప్రత్యాహారేణ విషయాన్ ధ్యానేనానీశ్వరాన్గుణాన్ ॥
తస్మాద్యుక్తః సదాయోగీ ప్రాణాయామపరోభవేత్ ।
సర్వపాప విశుద్ధాత్మా పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥

*(శ్లో॥88-89, అధ్యా10)*

ప్రాణాయామాన్ని అభ్యసించి దానిద్వారా దోషాల్ని దగ్ధంచేయాలి. ధారణవల్ల పాపాల్ని నశింపచేసుకోవాలి. ప్రత్యాహారం ద్వారా, విషయసుఖాల వ్యామోహం నుంచి తప్పించుకోవాలి. ఇక ధ్యానం ద్వారా ఈశ్వరప్రాప్తికి అవరోధంగా నిలిచే గుణాలని దహింపచేయాలి. ఇలా చేసినవాడే నిజమైన యోగి. ఆ యోగి ప్రాణాయామ ఆచరణ ద్వారా ఆ పరబ్రహ్మాని చేరుకుంటాడు.

**ప్రాణాయామ ప్రయోజనాలు :** ఒక పూర్తి పగలు లేక పూర్తిరాత్రి లేదా పగలు రాత్రి కలిసిన ఒకరోజు, లేక పక్షం (15రోజులు) లేదా ఒకమాసం, ఒక ఆయనం (ఆరుమాసాలు) ఒక సంవత్సరంగానీ, ఒక యుగం గానీ, వేయియుగాలు కానీ ఋషులందరూ దీర్ఘతపస్సులో ఉండి తమ దివ్యచక్షువులతో ప్రాణాన్ని (వాయువుని) ఉపాసిస్తూ ఉంటారు.

ప్రాణాయామం ఆచరించటం వల్ల కలిగే ప్రధాన ప్రయోజనాలు నాలుగు 1.శాంతి 2.ప్రశాంతి 3.దీప్తి 4.ప్రసాదం అనేవి.

ప్రయోజనానిచత్వారి ప్రాణాయామస్య విద్ధివై ।

శాంతిః ప్రశాన్తిర్దీప్తిశ్చ ప్రసాదశ్చ చతుష్టయమ్ ॥ *(శ్లో॥4, అధ్యా-11)*

1. **శాంతి :** శరీరాన్ని ధరించిన జీవులు ఈ లోకంలోగానీ, పరలోకంలో గానీ స్వయంగా కాలాన్ననుసరించి కొన్ని పనులు చేస్తారు. వాటి ఫలితాల్ని అనుసరించి అవి ఘోరాలని శాంతాలని తెలుసుకోవాలి. బంధు సంబంధమైన సంకరాలవల్ల తల్లితండ్రులు దోషవంతులవుతారు. దానివల్ల వారికి జన్మించిన సంతానం కూడా దుష్టులుగా మారతారు. కషాయరంగులో అంటిన ఆ పాపాల్ని తపస్సుచేత శమింపచేయటాన్నే శాంతి అనే తపస్సు అంటారు.

2. **ప్రశాంతి :** ఇహలోక పరలోక హితంకోసం లోభంతో, మోహంతో, అభిమానంతో చేసిన పాపాలని ప్రశాంతి తపం అంటారు.

3. **దీప్తి :** జ్ఞానం, విజ్ఞానం సంపదలుగా కలిగిన ఋషులు ఎంతో గొప్పవారు. వారికి సూర్యచంద్రులు తారలు సమానంగానే కనబడతారు. జ్ఞాని అనేవాడు గతించినదాన్ని, నడుస్తున్నదాన్ని, రాబోయే దాన్ని సమానంగానే చూడగలుగుతాడు. ఎందుకంటే అతడిలో ఉండే జ్ఞాన ప్రకాశం అన్ని వస్తువులమీదా, వ్యక్తుల మీదా, కాలాలమీదా సమానంగా ప్రసరించి వాటిని ప్రత్యక్షం చేయటం వల్ల దీనినే దీప్తి అనే తపస్సు అంటారు.

4. **ప్రసాదం :** కన్ను, ముక్కు, చెవి వంటి ఇంద్రియాలు. రూపం, రసం, గంధం వంటి ఇంద్రియార్థాలు, మనస్సు, ప్రాణా అపాన, వ్యాన, ఉదాన, సమాన అనే అయిదు రకాల వాయువులు ఇవి ఉద్రేకపడకుండా వాటిని సదా ప్రసన్నంగా ఉంచే తపాన్నే ప్రసాద తపం అంటారు.

ఈ విధంగా ప్రాణాయామ ఫలం నాలుగు విధాలుగా ఉంటుంది.

**ప్రాణాయామం చేసేవిధానం :** ప్రాణాయామాన్ని ఆచరించే వాడు తన శరీర తత్త్వానికి అనుగుణంగా ఏదో ఒక ఆసనంలో ఉండాలి. చిత్తాన్ని ఏకాగ్రంగా ఉంచాలి. తరువాత ముందుగా ఓంకారాన్ని ఉచ్చరించి,

సూర్యచంద్రులకి నమస్కరించి స్వస్తికాసనం గానీ, పద్మాసనం గానీ, అర్ధాసనంగానీ వేసుకోవాలి. ఆసనంలో దృఢంగా నిటారుగా కూర్చోవాలి. తరువాత నోరు పూర్తిగా మూసుకుని తలకిందకి వంచి అర్ధనిమీలత నేత్రాలతో రొమ్ముని ముందుకి నిక్కబొడిచి, కాలిమడమలతో లింగాన్ని, వృషణాల్ని కప్పికూర్చోవాలి. అలా కూర్చున్నాక తలను మెడను కొద్దిగా పైకెత్తాలి. ఎత్తి తన ముక్కు చివర్న చూడాలి. అటు ఇటూ చూడకూడదు.

ప్రాణాయామ సాధకుడు తన తమోగుణాన్ని రజోగుణంతో కప్పి, ఆ రజోగుణాన్ని సత్త్వ గుణంతో కప్పాలి. తరువాత అదే సత్త్వగుణంతో ఉంటూ చిత్తవృత్తుల్ని నిరోధించి (ఆలోచనల్ని) సమాధి స్థితిలో ఉండాలి. ఇంద్రియాలని, మనసుని, ప్రాణాది పంచవాయువుల్ని, అంతర్ముఖంగా లాగి తిరిగి వాటిని వెనక్కి వెళ్ళేలా చేయటం ప్రారంభించాలి. క్రమంగా చిత్తాన్ని (మనసుని) ఏకాగ్రంగా లయం అయ్యేలా చేయాలి. ఆ విధంగా ఆత్మరతుడైన వాడు తన ఆత్మలోనే ఆ పరమాత్మను చూడగలడు.

ఒకసారి కనురెప్పవేసి తెరిచినంతకాలాన్ని ఒకమాత్ర అంటారు. ప్రతి ప్రాణాయామాన్ని 12 మాత్రల కాలం చేయాలి. ఇక ధారణని 12 మాత్రల పొడవైనది (ధారణ అంటే మనసుని ఒకేచోట కేంద్రీకరించటం) రెండు ధారణలు కలిస్తే ఒకయోగం అనగా 24 మాత్రల కాలం యోగం అనబడుతుంది. అలాంటి యోగంతో కూడినవాడు ఈశ్వరత్వాన్ని పొంది తనలోనే పరమాత్మని చూస్తారు. ఇలా నియమపూరితంగా ప్రాణాయామం ఆచరించేవాడికి సకలదోషాలూ నశిస్తాయి.

**ధారణ :** నాభిలో, హృదయంలో, కంఠంలో, వక్షఃస్థలంలో, ముఖంలో, నాసికపైన, అలాగే కళ్ళలో, కనుబొమల మధ్య తరువాత శిరస్సుమీద, దానికి పైనున్న పరబ్రహ్మకమలస్థానంలో ప్రాణాన్ని (వాయువుని) నిలిపి ఉంచటాన్నే 'ధారణ' అంటారు. ప్రాణాపానాల్ని చక్కగా అరికట్టి నిలపటాన్నే ప్రాణాయామం అంటారు. మనస్సుని స్థిరంగా నిలపటాన్ని ధారణ అంటారు.

**ప్రత్యాహారం :** విషయాలనుంచి మనసుని మరల్చటాన్నే ప్రత్యాహారం అంటారు. ఈ ప్రత్యాహార అభ్యాసం వల్ల ధ్యానం చేయటం చాలా సులువవుతుంది. ధ్యానంవల్ల సాధకుడికి సిద్ధి కలుగుతుంది. ఆ విధంగా ధ్యాన సిద్ధిపొందిన సాధకుడు నిరంతరం సూర్యచంద్రులలాగా తన ఆత్మను దర్శించాలి.

మనసు సత్త్వగుణంతో లేనప్పుడు ఆత్మదర్శనం కలుగదు. అలాగే సరైన ప్రదేశం, సరైన కాలంలో చేయని ధ్యానయోగంవల్ల కూడా ఆత్మని దర్శించలేరు. నిప్పు దగ్గర, అడవిలో, ఎండుటాకులకుప్ప దగ్గర, జనాలంతా సంచరించేచోట, శ్మశానం, పాడుబడ్డగోశాల, నాలుగుదారులు కలిసేచోట, బాగా శబ్దాలు వినబడే ప్రదేశంలో, భయంకలిగించే చోట, పుట్టలు పొదలు ఉన్న ప్రాంతంలో, నీళ్ళు త్రాగే బావిదగ్గర, నదిలో, బాధ కలిగే చోట ఎప్పుడూ యోగాభ్యాసం చేయకూడదు. అకలిగా ఉన్నవాడు, ఆనందంగా లేనివాడు, బాధతో నిండిన కళ్ళుగలవాడు, యోగాన్ని అభ్యసించి ధ్యానాన్ని చేయకూడదు. యోగి చాలా జాగ్రత్తగా ఈ లక్షణాలని గమనించి తాను యోగాన్ని ఆచరించాలి. ఎవడైతే ఈ దోషాల్ని పరిగణించకుండా యోగాభ్యాసాన్ని చేస్తాడో వాడి శరీరంలో దోషాలన్నీ ప్రకోపించి, యోగానికి విఘ్నాలు కలిగిస్తాయి. అంతేకాదు యోగం సరిగ్గా చేయనివాడికి, నియమాలు పాటించనివాడికి జడత్వం (చచ్చుబడిపోవటం) చెవుడు, మూగ, గ్రుడ్డితనం, జ్ఞాపకశక్తి నశించటం, జ్వరం రావటం లాంటి వ్యాధులు కలుగుతాయి. కాబట్టి అజ్ఞానంతో అహంకారంతో దోషాలుండగా యోగాన్ని చేస్తే శరీరంలో ఎన్నో దోషాలు ప్రకోపిస్తాయి. యోగి ఎప్పుడూ అప్రమత్తుడై ఉంటూ యోగాన్ని ఆచరిస్తే అతడికి ఎలాంటి దోషాలూ అంటవు. ఒకవేళ ప్రాణాయామం వల్ల అనుకోకుండా ఏవైనా బాధలు పోవటానికి కొన్ని రకాల చికిత్సా పద్ధతులు కూడా ఉన్నాయి.

**యోగచికిత్సలు :** యోగాన్ని చేయటం వల్ల వాతం ప్రకోపించి గుల్మవ్యాధి కలిగితే బాగావేడిగా యవలతో జావను కాచి దాంట్లో నేయి కలిపి త్రాగితే వ్యాధి ఉపశమిస్తుంది. గుదావర్తవ్యాధి గనుక వచ్చినట్లైతే

యవలతో చేసిన జావని పెరుగుతో కలిపి పుచ్చుకోవాలి. యోగం చేసేడప్పుడు శరీరం బాగా కంపిస్తున్నప్పుడు యవజావని పుచ్చుకుంటే ఆ కంపనం శమిస్తుంది. చెవుడు వచ్చినప్పుడు చెవులలో, బాగా దాహం వేసినప్పుడు నాలుకమీద, కళ్ళు మంటలు పుడితే కళ్ళమీద ధారణచేయాలి. క్షయ, కుష్టు, సిబ్బెములాంటి వ్యాధులు సంభవించినప్పుడు సర్వసాత్వికిని ధారణ చేయాలి. శరీరంలో ఏఏ భాగంలో బాధకలుగుతుందో ఆ ప్రదేశం మీద ధారణ చేయాలి. అలా చేస్తే వ్యాధి శమిస్తుంది. ఈ చికిత్సా విధానాలన్నీ అనుభవజ్ఞుడై యోగ గురువుల మార్గదర్శకత్వంలోనే ఆచరించాలి.

**యోగికి కలిగే దోషాలు :** యోగాభ్యాసం ద్వారా తత్త్వాన్ని దర్శించిన యోగికి వివిధరకాల దోషాలు, రోగాలు పుడతాయి. యోగాన్ని బాగా ఆచరించి యోగరోగి అయినవాడు (అనగా యోగాన్ని సరిగ్గా గురుపర్యవేక్షణ లేకుండా ఆచరించినవాడు) ఉపసృష్టుడవుతాడు. అనగా మానవ సంబంధమైన వివిధరకాల కోరికల్ని, ఋతువుల్ని, స్త్రీలని, విద్యాదాన ఫలాల్ని కోరుకుంటాడు. అలాగే అగ్ని హోత్రాన్ని, హవిస్సుని, యజ్ఞాల్ని, అలాగే యజ్ఞశాలని ధనాన్ని స్వర్గాన్ని ఆశిస్తాడు. యోగరోగి ఈ విధంగా కర్మలతో సంబంధం పెంచుకుని అవిద్యకి వశమైపోతాడు. ఇలాంటి వాడిని యోగరోగిగా గుర్తించాలి. నిత్యం బ్రహ్మచింతనతో గురూపదేశాన్ననుసరించి యోగాభ్యాసాన్ని చేసేవాడికి విఘ్నాలే రావు. అయితే నియమంగా యోగంచేసి, ప్రాణాన్ని (శ్వాసని) స్వాధీనం చేసుకున్న వాడికి కూడా సాత్త్విక, రాజస, తామస అనే రోగాలు కలుగుతుంటాయి.

**యోగసిద్ధి లక్షణాలు :** దూర శ్రవణం కలగటం, దేవతాదర్శనం లభించటం, భ్రమావర్తం అనగా ఎలాంటి భ్రమలు లేకపోవటం అనేవి యోగ సిద్ధి లక్షణాలు. యోగసిద్ధి పొందినవాడికి విద్య, కావ్యం, శిల్పం ఇలా సమస్తం అతడి వాక్కులోనే కనపడతాయి. సకలవిద్యల ప్రయోజనాలు అతడికి కలుగుతాయి. సిద్ధయోగి వందయోజనాల దూరంలో వున్న శబ్దాలనైనా, మాటలనైన వినగలడు. నిజంగా సిద్ధిపొంది సర్వజ్ఞుడైన యోగి పిచ్చివాడిలా కనిపిస్తాడు.

సర్వజ్ఞత్వం, తృప్తి, అనాది బోధనం, స్వతంత్రత, ఎప్పుడూ తగ్గిపోయేశక్తి, ఎప్పుడూ అనంతంగా ఉండేశక్తి అనే ఈ ఆరూ మహేశ్వరుడి అంగాలు.

వీటిని ఆచరించిన యోగి పరబ్రహ్మని పొందుతాడు. యోగసిద్ధిని పొందినవాడు అసమానమైన సిద్ధశక్తులు పొంది ముల్లోకాలిని కూడా కంపింపచేసే సామర్థ్యాన్ని పొందుతాడు. తన దివ్యశక్తితో ఒక శరీరాన్ని వదిలిపెట్టి మరో శరీరాన్ని పొందగలుగుతాడు. యోగులందరికీ సూర్యుడే వారి మనోద్వారం. యోగాభ్యాసం ద్వారా సూక్ష్మవర్జితుడైన యోగి ఈ ప్రకృతిని దాటుకుని సరాసరి రుద్రలోకానికి చేరుకుంటాడు.

## పాశుపత యోగం

జ్ఞానవంతుడైన యోగి రాగంతో తిరిగి కర్మల్ని ఆచరించకూడదు (ప్రతిఫలంకోరి చేసే పనులు) మానవుడు రాజస, తామస సంబంధమైన ఏ కర్మలు చేస్తే ఆ కర్మల బంధంలోనే చిక్కుకుంటాడు. పుణ్యకర్మలు చేసినవాడు స్వర్గంలో దాని ఫలితాన్నిపొందుతాడు. అక్కడ తను చేసిన పుణ్యకర్మల ఫలం క్షీణించి పోయాక తిరిగి భ్రష్టుడై మానవలోకానికి చేరతాడు. కాబట్టి నిజమైన యోగి పరబ్రహ్మను పొందాలనే కోరికనే పెంచుకోవాలి. పరబ్రహ్మ సూక్ష్మమైనవాడు శాశ్వతమైనవాడు అని చెప్పబడ్డాడు. కాబట్టి ఆయన్నే సేవించాలి. యజ్ఞయాగాలు ఆచరించినందువల్ల కూడా పుణ్యం లభిస్తుంది. తద్వారా స్వర్గాన్ని చేరినవాడు కూడా పుణ్యం క్షీణించగానే తిరిగి భూమిమీద పడుతున్నాడు. కాబట్టి మోక్షం ఒక్కటే అన్నిటికన్నా పరమసుఖమైనదని అందరూ గ్రహించాలి.

## విశ్వపురుషుడు

విశ్వరూపుడు, విశ్వమే పాదాలుగా కలవాడు, విశ్వేశుడు, సకలభావాలూ కలిగినవాడు, సమస్త గంథాలు కలిగినవాడు, సమస్త మాలలచేత అలంకరించ బడినవాడు, విశ్వం (ప్రపంచం) అనే వస్త్రాన్ని ధరించేవాడు, అందరికీ ప్రభువైన విశ్వుడనే పురుషుణ్ణి చూసి–భూమి గోవులు అనే తన కిరణాలచేత, రెక్కలు కలిగినవాడిని, మహాత్ముడైనవాడిని, గొప్ప బుద్ధి కలిగినవాడిని, కవిని (బ్రహ్మస్వరూపుడిని), పురాణుడిని, ప్రాచీనమైనవాడిని, అనుశాశనం చేసేవాడిని, సూక్ష్మంకన్నా సూక్ష్మమైన మహత్తుకన్నా మహత్తైన రూపం గలవాణ్ణి బంధించి వేస్తుంది.

ఆ విశ్వపురుషుడు నిరింద్రియుడు, బంగారంలా మెరిసిపోయే తేజోపురుషుడు, నిర్గుణుడు, నిత్యచేతనుడు. ఇలాంటి మహాపురుషుణ్ణే యోగులు నిత్యం తమ యోగం ద్వారా దర్శిస్తారు. ఆయన చర్మ చక్షువులకి కనిపించడు. ఎప్పుడూ శుచిగా, చలనం లేకుండా దివ్యకాంతితో వెలిగిపోయే ఆ పురుషుడు కేవలం యోగం ద్వారా మాత్రమే దర్శనమిస్తాడు.

విశ్వపురుషుడైన ఆ పరమాత్మ చేతులు, కళ్ళు, కడుపు, ప్రక్కలు, నాలుక ఇవేవీ లేనివాడు. ఇంద్రియాలకి అతీతుడు. పరమసూక్ష్మ స్వరూపంతో ఉంటాడు. ఆయన కళ్ళు లేకుండా చూడగలడు. చెవులు లేకుండా వినగలడు. అతడికి ప్రత్యేకంగా జ్ఞానం అనేది లేదు. అయినప్పటికీ ఆయనకి తెలీనిదేదీ లేదు. గొప్పవైన వేదాలు కూడా ఆయన్ని తెలుసుకోలేవు. కానీ ఆయనకి సర్వం తెలుసు. అలాంటి దివ్యలక్షణాలున్న విశ్వపురుషుణ్ణీ ఆది పురుషుడుగా, మహత్స్వరూపుడుగా, సచేతనుడిగా, మహా సూక్ష్మస్వరూపుడిగా యోగులు భావిస్తారు.

**ప్రకృతి:** తామాహుర్మునయః సర్వేలోకే ప్రసవధర్మిణీమ్ ।
ప్రకృతం సర్వభూతానాం యుక్తాః పశ్యంతి చేతసా ॥
సర్వతః పాణి పాదాంతం సర్వతోఽ క్షి శిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమాంల్లోకే సర్వ మావృత్యతిష్ఠతి ॥ *(శ్లో॥11-12, అధ్యా-14)*

ఇక ప్రకృతి. ఈమెయే లోకాల్ని సృష్టించేది అని సకల మునులూ చెబుతారు. యోగులు ఈ ప్రకృతినే తమ హృదయంలో సర్వభూతాత్మకమైన దానిగా దర్శిస్తారు. ఆ ప్రకృతి సృష్టి మొత్తం కాళ్ళు చేతులు చాచుకొని, అంతటా వ్యాపించిన కళ్ళు, శిరస్సు, ముఖాలు కలిగినది. ఆమెకి అంతటా వినగలిగిన చెవులున్నాయి. ఆ ప్రకృతి సర్వాన్నీ ఆవరించి ఉంటుంది. యోగయుక్తులైన మహాయోగులు, సనాతనుడైన ఈశ్వరుడు ఆమెని దర్శిస్తారు. ఆ ప్రకృతిని చిత్తంలో దర్శించిన ధ్యానయోగి ఎప్పటికీ మోహాన్ని పొందడు. అలాగే అవ్యయుడు, సనాతనుడు, విశ్వపురుషుడు అయిన ఆ పరబ్రహ్మని ధ్యానం చేసినా మోహవికారాల్ని పొందడు.

జీవుడు తాను చేసిన కర్మల ద్వారా మాత్రమే దుఃఖాన్ని గానీ, సుఖాన్ని గానీ పొందుతాడు. తను చేసిన కర్మఫలాన్ని తానే అనుభవించాలి.

ఏవంజీవసుతైః పాపైస్తవ్యమానః స్వయంకృతైః ।
ప్రాప్నుయాత్కర్మభిర్దుఃఖం శేషం వాయది చేతదమ్ ॥

ఏకైవతు గంతవ్యం సర్వమృత్యు నివేశనమ్ ।
ఏకేనైవచ భోక్తవ్యం తస్మాత్ సకృతమాచరేత్ ॥

నహ్యేనం ప్రస్థితం కశ్చిద్గచ్ఛస్తమనుగచ్ఛతి ।
యదనేనకృతం కర్మతదేవ మనుగచ్ఛాతి ॥ (శ్లో॥28-30, అధ్యా-14)

అన్నిరకాలుగా జీవుడు తానొక్కడే మృత్యుమార్గంలో వెళ్ళగలడు. అతడికి తోడెవ్వరూ రారు. తాను చేసిన కర్మఫలాన్ని తానొక్కడే అనుభవించగలడు. మరోవాడెవ్వడూ దాన్ని పంచుకోలేడు. కనుక ఎప్పుడూ పుణ్యకర్మల్నే ఆచరించాలి. ప్రాణావసాన సమయంలో జీవుడి వెంట అతడి కర్మఫలమే వస్తుంది తప్ప మరెవ్వడూరాడు. దుష్కర్మల్ని ఆచరించినవారు నిత్యం యమలోకంలో వివిధరకాల శరీరాలు ధరించి విలపిస్తుంటారు. వారు చేసిన అధర్మకార్యాలవల్ల ఎన్నో రకాల శిక్షలు అనుభవిస్తూ బాధపడుతుంటారు.

మానవుడికి పూర్వజన్మలో చేసిన పాపకర్మలు పూర్తిగా క్షయమయ్యే వరకూ తామసరూపమైన సంసారంలో చిక్కుకుంటాడు. అదెలాగంటే ముందుగా మనిషి జన్మనెత్తి తరువాత పశువుగా, మృగంగా, పక్షిగా, సర్పంగా జన్మలెత్తి చివరికి స్థావరంగా మారిపోతాడు. ఆ స్థావర భావననుంచి మేలుకోనంత వరకూ కుమ్మరి సారెలాగా అక్కడే తిరిగుతూ ఉంటాడు. ఈ విధంగా మానవుడు తన కర్మల్ని అనుసరించి మానవుడు నుంచి స్థావరం దాకా పొందే జన్మలక్రమాన్నే తామస సంసారం అని గ్రహించాలి.

ఇక పరబ్రహ్మ నుంచి పిశాచాల దాకా ప్రవర్తిల్లే దాన్ని సాత్త్విక సంసారమంటారు. పరబ్రహ్మలో కేవలం సాత్త్విక భావమే ఉంటుంది. స్థావరాల్లో కేవలం తమస్సే ఉంటుంది. ఈ పద్నాలుగు స్థానాల మధ్యలో నిలిచిందే రజోగుణం.

జీవుడు సంసారచక్రంలో చిక్కుకోకూడదు అన్న భయంతో పుణ్యకర్మల్ని చేయటం ప్రారంభించాలి. నిత్యం ఆత్మని దర్శిస్తూ ధ్యాన యోగాన్ని అవలంబించాలి. ఆ పరమాత్మని – ఇతడే పరంజ్యోతి, ఇతడే మహాత్ముడు, ఏకస్వరూపుడు, శాశ్వతమైనవాడు, ఇతడే విశ్వతోముఖుడైన అగ్నిలాగా సర్వభూతాల హృదయాలలో కొలువున్నాడు అని భావించి ఉపాసించాలి.

తరువాత యోగి తన హృదయంలో ఉన్న వైశ్వానరుణ్ణి (అగ్ని) ఉపాసించాలి. నీటిని తీసుకుని ఓం ప్రాణాయస్వాహా ఓం వ్యానాయ స్వాహా ఓం ఉదానాయ స్వాహా ఓం సమానాయ స్వాహా అని ఆచమనం చేయటం ద్వారా లోపలున్న అగ్నికి ఆహుతుల్ని సమర్పించి ఆ తరువాత భోజనం చేయాలి. భోజనానంతరం తిరిగి మరోసారి ఆచమనం చేసి హృదయాన్ని స్పృశించాలి. తరువాత–

ఓం ప్రాణానాంగంధిరస్యాత్మా రుద్రోహ్యాత్మా నిశాంతకః ।
రుద్రోహ్యాత్మనః ప్రాణా ఏవమాప్యాయయేత్స్వయమ్ ॥
త్వం దేవానమపి జ్యేష్ఠ ఉగ్రస్త్వం చతురోవృషా ।
మృత్యుఘ్నోఽసి త్వ మస్మభ్యం భద్రమేతదద్భుతం హవిః ॥ *(శ్లో॥8-9,అధ్యా-15)*

ఓంకార స్వరూపుడివైన ఓ రుద్రుడా! నీవు పంచప్రాణాలకి ఆత్మలాంటివాడివి. రుద్రుడవైన నీవే పరమాత్మవి. నీవే ఆత్మకి ప్రాణం. నీవు దేవతలందరికన్నా పెద్దవాడివి. ఉగ్రస్వరూపుడివి, చతురుడవి, వృషభరూపుడివి, మృత్యుస్వరూపుడివి. భద్రమైన హవిస్సులతో నాలో ఉన్న నీకు ఆహుతుల్ని సమర్పించాను అని చెప్పి మరోసారి హదయాన్ని తాకాలి. తరువాత క్రమంగా కుడిచేత్తో నాభిని, తిరిగి నీటిని, తనను, రెండుకళ్ళు, రెండు చెవులు, హృదయం శిరస్సు తాకాలి. ప్రాణాపానాలు రెండూ ఆత్మలుగా చెప్పబడ్డాయి. మనుషుల్లో ఉండే ప్రాణం అంతరాత్మ అయితే అపానం బాహ్యాత్మ అవుతుంది. అన్నం ప్రాణ స్వరూపం అలాగే అపానం మృత్యురూపం. అన్నాన్ని పరబ్రహ్మ స్వరూపంగా ప్రతిఒక్కరూ తెలుసుకోవాలి.

అన్నం బ్రహ్మేచ విజ్ఞేయం ప్రజానాం ప్రసవస్తథా ।
అన్నాద్భూతాని జాయంతే స్థితి రన్నేన చేష్యతే ॥
తదేవాగ్నేహుతం హ్యన్నం భుజంతే దేవదానవాః ।
గంధర్వ యక్ష రక్షాంసి పిశాచాశ్చాన్నమేవహి ॥ *(శ్లో॥13-14,అధ్యా-15)*

అన్నమే ప్రజల్ని కనటానికి కారణమైనది. అన్నం వల్లనే భూతాలు (జీవులు) పుడుతున్నాయి. అన్నం చేతనే అవి స్థిరంగా ఉంటున్నాయి. అగ్నిలో గనక అన్నాన్ని హవనం చేస్తే దాన్ని దేవదానవులు భుజిస్తారు.

## పరమాశ్రమ ధర్మం

పరబ్రహ్మను పొందాలనుకునేవాడు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రమాలని వదిలిపెట్టి పరమాశ్రయమైన భిక్షాశ్రమాన్ని పొందాలి. దీనికన్నా ఉత్తమమైనది మరేదీ లేదని గ్రహించాలి. తరువాత పరమాశ్రమాన్నిస్వీకరించిన వాడు గురువు అనుమతి పొంది లోకమంతా సంచరించాలి. అసలు తెలుసుకోదగిన ఆ పరబ్రహ్మను తెలుసుకోవటానికి తగిన జ్ఞానాన్ని సంపాదించాలి. ఇదే జ్ఞానం ఇదే జ్ఞేయం అని సంతృప్తిపడి ఊరుకుండేవాడు కల్పాంతందాకా తిరిగినా పరబ్రహ్మని పొందలేడు.

పరమాశ్రమధర్మాన్ని పాటించేవాడు సంగాన్ని వదిలిపెట్టి కోపాన్ని జయించి, ఇంద్రియాల్ని అదుపులో ఉంచుకుని, అల్పాహారాన్నే స్వీకరిస్తూ, బుద్ధిద్వారాలన్నిటినీ మూసేసి, తన మనసుని కేవలం ధ్యానం మీదనే నిలపాలి. శూన్యంగా ఉండే నిర్జన ప్రదేశాలలో, గుహల్లో, అరణ్యాలలో, నదీతీరంలోని ఇసుక తిన్నెల్లో, పరమాశ్రమయతి నివాసాన్ని ఏర్పర్చుకోవాలి.

వాగ్దండాః కర్మదండశ్చ మనోదండశ్చతే త్రయః ।
యస్యైతే నియతాదండాః సత్రిదండీవ్యవస్థితః ॥
అవస్థితో ధ్యానరతిర్జితేంద్రియః శుభాశుభేహిత్యచకర్మణీ ఉభే ।
ఇదం శరీరం ప్రవిముచ్య శాస్త్రతోనజాయతే మ్రియతే న కదాచిత్ ॥
*(శ్లో॥6-7, అధ్యా-17)*

'వాక్కు' అనే దండం, 'కర్మ' అనే దండం, 'మనస్సు' అనే దండం ఈ మూడింటినే త్రిదండాలు అంటారు. ఈ మూడు దండాలనీ ధరించే యతిని త్రిదండి అంటారు. నిశ్చలంగా వుండేవాడు, నిరంతరం ధ్యానం మీదే ఆసక్తితో ఉండేవాడు, ఇంద్రియాల్ని జయించినవాడు, శుభాశుభకర్మల్ని త్యజించేవాడు తనశరీరాన్ని విడిచిపెట్టిన తరువాత తిరిగి ఎప్పటికీ జన్మించడు. అనగా మోక్షాన్ని పొందుతాడని భావం.

## యతుల ప్రాయశ్చిత్తం

యతులైనవారు ప్రారబ్ధవశాన తెలిసి కానీ తెలియక కానీ చేసిన పాపాలకి ప్రాయశ్చిత్తాలు చెప్పబడ్డాయి. పాపాలు మూడు విధాలు. 1.మాటల వల్ల కలిగేవి 2.మనసువల్ల కలిగేవి 3.శరీరాల వల్ల కలిగేవి అని. ఈ మూడు రకాల పాపాల వల్ల రాత్రీ పగలూ ఈ లోకమంతా బాధించబడుతోంది. ఆయుర్దాయం అనేది ఎవరికీ స్థిరంగా ఉండదు. కాబట్టి చేసిన పాపాలకి ప్రాయశ్చిత్తం వెంటనే చేసుకోవాలి. లేకపోతే ఆ పాపం జన్మ జన్మాంతరాలలో వెంటాడుతుంది.

భిక్షువులైన యతులకి కొన్ని వ్రతాలు, ఉపవ్రతాలు విధించబడ్డాయి. వాటిలో ఏ ఒక్కటి పాటించకపోయినా దానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. కామంతో గనుక అతడు స్త్రీని పొందితే ప్రాణాయామాన్ని సాంతపన వ్రతాన్ని చేయాలి. అనగా మూడు రోజులు ఉదయంపూట, మూడురోజులు కేవలం రాత్రిపూట, మరో మూడు రోజులు ఎవరినీ ఏమీ అడగకుండా లభించిన పదార్థాలనే భుజించాలి. తరువాత పంచగవ్యాన్ని, కుశో(దర్భ) దకాన్ని పుచ్చుకుని ఒక రాత్రంతా ఉపవసించాలి. తరువాత ఒకరోజు సమాధిస్థితిలో ధ్యానం చేయాలి. ఈ విధంగా ప్రాయశ్చిత్తం చేసుకున్నాక తిరిగి యథావిధిగా బిక్షువుగా చరించాలి.

కిటుకుల గల మాటలు (అనగా నిందాపూర్వకమైన మాటలు, అసభ్యకరమైన మాటలు) పెద్దగా ఎవర్నీ హింసించవు. అయినప్పటికీ అలాంటి

ప్రసంగాలని యతులు ఎప్పుడూ చేయకూడదు. ఒకవేళ చేస్తే దానివల్ల వచ్చే అధర్మం ఫలం ఒకరోజుకి మించి ఉండదు. భిక్షుహింస అనేది దేవతల చేత, మునుల చేతా సృష్టించబడి వృద్ధి చెందింది. ఇక ధనం అనేది బహిరంగంగా చరించే ప్రాణంలాంటిది" అని భావించకూడదు. అలా భావిస్తే అది మానసిక పాపమవుతుంది. దీనికి ఒక సంవత్సరం పాటు చాంద్రాయణ వ్రతాన్ని ప్రాయశ్చిత్తంగా ఆచరించాలి.

భిక్షుకుడు మనసుతో, మాటతో, శరీరంతో సర్వప్రాణుల ఎడల అహింసని పాటించాలి. తెలిసిగానీ, తెలియకగానీ భిక్షువు పశువుల్ని మృగాల్ని హింసిస్తే కృచ్ఛ్రాత్రికృచ్ఛ్రవ్రతాన్నిగానీ చాంద్రాయణ వ్రతాన్ని గానీ ప్రాయశ్చిత్తంగా ఆచరించాలి. యతి స్త్రీని చూసి ఇంద్రియనిగ్రహం కోల్పోయి, వీర్య స్ఖలనం చేసినట్లైతే వెంటనే 16 ప్రాణాయామాలని ప్రాయశ్చిత్తంగా చేయాలి. పగటిపూట వీర్యస్ఖలనం చేసిన యతికి మూడు రాత్రులు ఉపవాసం, వందసార్లు ప్రాణాయామం చేయటం ప్రాయశ్చిత్తంగా విధించారు. రాత్రిపూట వీర్యస్ఖలనం చేసిన యతి వెంటనే స్నానం చేసి, శుచిగా 12 ధారణలు (మనసుని ఆత్మ మీద స్థిరంగా ఉంచటం) ప్రాయశ్చిత్తంగా చేయాలి.

యతి ప్రాణాయామాన్ని ఆచరించటం ద్వారా రజోగుణం లేని శుద్ధ సాత్వికుడిగా మారతాడు. యతులైనవారు కేవలం అన్నాన్ని, మద్యాన్ని, మాంసాన్ని, ఆమశ్రాద్ధభోజనాన్ని, ప్రత్యేకమైన లవణాన్ని (ఉప్పు) తినకూడదు. ఈ నియమాన్ని అతిక్రమించినట్లైతే ప్రాజాపత్యవ్రతం, కృచ్ఛ్రవ్రతం చేయటం ద్వారా ఆపాపాలనుంచి విముక్తి పొందుతాడు. యతులు నియమాల్ని అతిక్రమించి వాక్కు–మనసు–శరీరాలతో చేసిన పాపాలకి విషయ పరిజ్ఞానం కలిగిన పండితుల్ని సంప్రదించి వారు నిర్ణయించిన విధంగా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

యతి ఆశ్రమాన్ని స్వీకరించినవాడు విశుద్ధమైన బుద్ధితో మట్టిని, బంగారాన్ని సమానంగా చూస్తూ, నిత్యం ధ్యానాది నియమాల్ని ఆచరిస్తున్నట్లైతే అలాంటి యతి శాశ్వతమైనది. నాశనంలేనిది, స్థిరమైనది అయిన పరమపదాన్ని పొంది పునర్జన్మ రహితుడవుతాడు.

# మరణసూచక అరిష్టాలు

కొన్నిరకాల అరిష్టాలు అవి కనిపించిన వారికి త్వరలో మరణం రాబోతోందని తెలియచేస్తాయి. ఎలాంటి అరిష్టాలు కనబడితే మానవులకి ఎన్నిరోజుల్లో నెలల్లో, మృత్యువు సంభవిస్తుందో ఇక్కడ చెప్పటం జరుగుతోంది.

1. ఆకాశంలో అరుంధతీ నక్షత్రాన్ని గానీ, ధ్రువనక్షత్రాన్నిగానీ, చంద్రుడి వెలుగునికాని, రాజమార్గాన్ని కానీ చూడలేనివాడు ఒక సంవత్సరం దాటి జీవించడు.
2. సూర్యుడు కిరణాలు లేకుండా, అగ్నిని కిరణాలతో ఉన్నట్టుగా చూసేవాడు పదకొండునెలలు దాటి జీవించడు.
3. ప్రత్యక్షంగా కానీ, కలలోగానీ, మూత్రాన్ని, పిడకని, వెండిని, బంగారాన్ని వాంతి చేసుకున్నవాడు పదిమాసాలు మాత్రమే జీవిస్తాడు.
4. దుమ్ములోగానీ, బురదలోకానీ ముందువెనుక భాగాలలోగానీ తనువేసిన అడుగు తెగిపోయినట్టుగా కనిపిస్తే అలాంటివాడు ఏడునెలలు మాత్రమే జీవిస్తాడు.
5. కాకి లేక పావురంగానీ, గ్రద్దగానీ లేక మాంసం తినే మరే ఇతర పక్షికానీ తన తలలో లీనమైనట్టు చూసేవాడు ఆరుమాసాలు దాటి బ్రతకడు.
6. కాకుల వరసతో కట్టేయబడ్డవాడుగానీ, దుమ్మువానతో చుట్టబడ్డవాడు గానీ, తన నీడని చాలా వికారంగా దర్శించిన వాడుగానీ కేవలం నాలుగైదు నెలలుమాత్రమే జీవిస్తాడు.
7. దక్షిణ దిశలో మేఘాలు లేకుండా తెలుపుని గానీ, నీళ్ళలో ఇంద్రధనస్సుని గానీ, తన తలలేకుండా వున్న దృశ్యాన్ని చూసినవాడుగానీ ఒక్కనెల దాటి జీవించడు.
8. నీళ్ళలోగానీ, అద్దంలోగానీ, తనని తాను చూడలేనివాడు, ఒకవేళ చూడగలిగినా తన తలలేకుండా కేవలం ఒక్క మొండమే గనుక కనిపిస్తే ఒక్క నెలలోపే మరణిస్తాడు.

9. తన శరీరం నుంచి శవం వాసనకాని, వసాగంధం వాసనగానీ వస్తున్నట్లైతే అతడు మరణానికి చాలా చేరువలో ఉన్నాడని తెలుసుకోవాలి. అలాంటివాడు 15 రోజులు కూడా జీవించడు.

10. ఒక్కసారిగా లోపల నుంచి బైటికి వచ్చిన వాయువు తన మర్మస్థానాల్ని కత్తిరించగా ఆ బాధా నివారణ కోసం నీళ్ళు చల్లినప్పటికీ ఏ మాత్రం స్పందించనివాడు మృత్యుముఖంలో ఉన్నాడని గ్రహించాలి.

11. ఎలుగుదొడ్లతో కోతులతో లాగబడుతున్న రథంలో గానంచేస్తూ తాను దక్షిణ దిక్కుకి వెళుతున్నట్టుగా ఎవడైతే తన కలలో చూస్తాడో వాడికి మృత్యువు చాలా సమీపంలో వుందని తెలసుకోవాలి.

12. స్వప్నంలో నల్లని వస్త్రాలు ధరించిన నల్లని స్త్రీ గానం చేస్తూ దక్షిణ దిక్కుకి వెళ్తున్న దృశ్యం కనిపించినవాడు అల్పాయుష్కుడు

13. రంధ్రాలతో ఉన్న నల్లని వస్త్రాలు ధరించినవాడిని, చెవి విరిగి పోయినట్టుగా ఉన్నవాడిని కలలో చూస్తే చూసినవాడికి మరణం అతి సమీపంలో ఉంటుంది.

14. స్వప్నంలో తాను బురదసముద్రంలో నిండా మునిగినట్టు కనిపిస్తే వెంటనే మరణిస్తాడు.

15. బూడిదని, నిప్పుకణికల్ని, వెంట్రుకల్ని, ఎండుగడ్డిని, పాముల్ని కలలో చూసిన వాడు పదిరాత్రులు కూడా జీవించడు.

16. సూర్యోదయం కాగానే ప్రత్యక్షంగా నక్క కూతపెడుతూ ఎదురు వస్తే త్వరగా మరణిస్తాడు.

17. స్నానం చేసినంత మాత్రాన గుండె బాగా పిండినట్టుండి పళ్ళు ఇకిలించినవాడు మరణించినట్టే.

18. రాత్రి పగలు ఎగశ్వాస తీసుకునేవాడు, దీపగంధాన్ని వాసన చూడలేనివాడు మరణానికి దగ్గర్లో వున్నవాడు.

19. రాత్రిపూట ఇంద్రధనస్సుని, పగలు నక్షత్రమండలాన్ని ఇతరుల కళ్ళలో తనని చూసినవాడు ఎక్కువకాలం బ్రతకడు.

20. ఒక కంటి నుంచి నీరుకారినా, చెవులు తమ స్థానంనుంచి జారినా, ముక్కువంకరగా అయిపోయినా అలాంటివాడు చచ్చినట్టే

21. వెంట్రుకల్ని విరబోసుకుని, పెద్దగా నవ్వుతూ, గానంచేస్తూ, నాట్యం చేస్తూ దక్షిణదిక్కుగా వెళ్తున్నట్టు స్వప్నంలో చూసిన వాడు జీవితాన్ని చాలిస్తాడు.

22. స్వప్నంలో తాను ఎక్కిన రథాన్ని ఒంటెలు గానీ గాడిదలు గానీ కట్టబడి దక్షిణదిశకు లాక్కువెళ్తున్నట్టు కనిపిస్తే ఎక్కువ కాలం బ్రతకడు.

23. స్వప్నంలో తాను కప్పుకున్న తెల్లటి వస్త్రాన్ని, ఎర్రదానిగా, నల్లదానిగా చూసేవాడికి మరణం సమీపిస్తుంది.

ఈ విధంగా అరిష్టాలు గనుక కలలో కనబడితే ఆ మానవుడు భయపడకుండా, దుఃఖించకుండా వెంటనే నిద్రలేవాలి. లేచిన తరువాత తూర్పులేక ఉత్తరదిశకి బయలుదేరి ఒక మంచి ప్రదేశంలో ఏకాంతంగా కూర్చుని ఉత్తరం లేక తూర్పుముఖంగా ఉండి ఆచమనాన్ని చేయాలి. తరువాత భక్తిపూర్వకంగా మహేశ్వరుడికి నమస్కరించాలి. స్థిరంగా కూర్చుని ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానించాలి. తీవ్రంగా ఆయన్నే హృదయంలో ధారణ చేయాలి. తరువాత వందసార్లు గానీ, కనీసం ఎనిమిది సార్లుగానీ శిరస్సుమీద ధారణ చేయాలి. ఆ తరువాత సమాధి స్థితిలో ఉండి శరీరాన్ని ఓంకారంతో నింపాలి. అలా చేసినవాడు ఓంకారమయుడవుతాడు. అతడు ఎప్పటికీ నశించడు.

## ఓంకారం - విశేషాలు

**ఓంకార లక్షణం :** ఓంకారం మూడు మాత్రలతో ఉంటుంది. మాత్రలు అంటే అక్షరాలు అని అర్థం. వీటిలో మొదటిమాత్ర విద్యుత్సంబంధమైనది. రెండో మాత్ర 'తామసీ', మూడో మాత్ర 'నిర్గుణీ' అని చెప్పబడుతుంది. ఇది గాంధార స్వరంలో పుట్టింది. కాబట్టి దీన్ని గాంధర్వీ అని కూడా వ్యవహరిస్తారు. ఈ ఓంకారం మానవుల శిరస్సులో కనపడుతుంది. అది అక్కడి నుంచి బయలుదేరి సంచరిస్తుంది. ఓంకారాన్ని ఉపాసించే యోగి ఓంకార స్వరూపుడైనా నాశనంలేని వాడవుతాడు.

ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।
అప్రమత్తేన చేద్వంద్వం శరవత్తన్మయోభవేత్ ॥
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ గుహాయాం నిహితం పదమ్ ।
ఓమిత్యే తత్త్రయో వేదాస్త్రయో లోకాస్త్రయోగ్నయః ॥
విష్ణుక్రమాస్త్రయ స్త్వేతే ఋక్సామాని యజూంషిచ ।
మాత్రాశ్చాత్ర చతస్రస్తు విజ్ఞేయాః పరమార్థతః ॥
తత్రయుక్తశ్చ యోయోగీ తపసాలోక్యతాం వ్రజేత్ ।
అకారస్త్వక్షరో జ్ఞేయస్త్రిమాత్ర ఇతి సంజ్ఞితః ॥
మకారస్తు ప్లుతోజ్ఞేయస్త్రిమాత్ర ఇతి సంజ్ఞతః । *(శ్లో॥5-8,అధ్యా-20)*

ఓంకారం ధనుస్సు అయితే ఆత్మ బాణంలాంటిది. బ్రహ్మ ఆ బాణానికి లక్ష్యం. యోగి అయినవాడు జాగ్రత్తగా, ఏకాగ్రతతో ఓంకారం అనే ధనుస్సుని ఆత్మ అనే బాణాన్ని ఉపయోగించి పరబ్రహ్మ అనే లక్ష్యాన్ని ఛేదించాలి. ఆ రకంగా యోగి ఆత్మబ్రహ్మను చేరి బ్రహ్మమయుడై పోవాలి.

'ఓం'అనే ఒక్క అక్షరమే బ్రహ్మ పదార్థం. ఆ పదంలో గుహారూపమైన బుద్ధి ఉంచబడింది. ఓం అనేది మూడు లోకాలు, మూడు అగ్నులు, వామనావతారాన్ని ధరించిన శ్రీమహావిష్ణువు మూడు పాదాలు (అడుగులు) గా చెప్పబడింది. ఇలాంటి ఓంకారానికి నాలుగు మాత్రలుంటాయి. ఓంకారాన్ని యోగం ద్వారా ధారణ చేసిన వ్యక్తి ఓంకార స్వరూపాన్నే పొందుతాడు.

'ఓం' కారంలో ఉన్న ముడు అక్షరాలు 'అ' 'ఉ' 'మ' అనేవి. వీటిలో 'అ' అనే అక్షరం నాశనం లేని దానిగా తెలుసుకోవాలి. 'ఉ' అనే అక్షరం స్వరితంగా చెప్పబడింది. ఇలా మూడులోకాలతో కూడుకున్న ఓంకారానికి శిరస్సు స్వర్గం. అది అంతా భువనాంతం అనగా బ్రహ్మస్థానం. ఓంకారానికి మాత్రాస్థానం రుద్రలోకమైతే మాత్రలు లేనిది శివస్థానం. ఈ ఓంకారాన్ని యోగులు నిత్యం ఉపాసిస్తుంటారు. ధ్యానం మీద ఆసక్తి ఉన్నవారెవరైనా శాశ్వతపదం కావాలని కోరుకుంటే ఆ మాత్రమైన అనగా మాత్రలు లేని ఓంకారాక్షరాన్ని నిత్యం ఉపాసించాలి.

ఓంకారంలో హ్రస్వ మాత్ర మొదటిది. రెండోది దీర్ఘమాత్ర, మూడోది ప్లుతమాత్ర. ఆత్మలో ఇంద్రియాలని, మనస్సుని, బుద్ధిని ఎపుడూ నిలిపి ధ్యానం చేస్తూ ఎనిమిది మాత్రలు గలదానిగా ఓంకారాన్ని మనసులో విన్నవాడు సత్ఫలితాన్ని పొందుతాడు. ఓంకారంలో ఒక్క మాత్రని మాత్రమే ధ్యానం చేసినా చాలు అతడు వంద సంవత్సరాలు అశ్వమేధయాగం చేసిన ఫలితం పొందుతాడు.

ఇత్యేతదక్షరం బ్రహ్మమోంకార సంజ్ఞితమ్ ।
యస్తువేదయతే సమ్యక్ తథాధ్యాయతి తథాపునః ॥
సంసారసముత్సృజ్య ముక్తబంధన బంధనః ।
అచలం నిర్గుణం స్థానం శివం ప్రాప్నోత్య సంశయః ॥

*(శ్లో॥28-29, అధ్యా-20)*

ఓంకారాన్ని అక్షర పరబ్రహ్మగా తెలిసినవాడు లేదా ఓంకారాన్ని పరబ్రహ్మగా భావించి ధ్యానించినవాడు, సంసార చక్రబంధనాలనుంచి విడిపోయి నిర్గుణ స్థానమైన శివుడిని చేరుకుంటాడు.

## రుద్ర నమస్కారం

నమో లోకేశ్వరాయ సఙ్కల్ప కల్పగ్రహణాయ మహాన్తముపతిష్ఠతే ।
తద్వో హితం యద్బ్రహ్మణే నమః సర్వత్ర స్థానివే నిర్గుణాయ ॥ 1
సంభక్త యోగీశ్వరాయ చ పుష్కరపర్ణహాద్భిద్వశుద్ధమివ ।
బ్రహ్మముపతిష్ఠేత్పవిత్రం పవిత్రాణాం పవిత్రం పవిత్రేణ ॥ 2
పరిపూరితేన పవిత్రేణ హ్రస్వదీర్ఘప్లుతమితి తదేతమోఙ్కార ।
మశబ్దముస్పర్శ మ రూప మరసమగన్ధం పర్యుపాసీత అవిద్యేశా ॥ 3
వాయ నమో యోగీశ్వరాయేతి చ యేన ద్యౌరుగ్రా పృథివీ చ ।
ధృఢా యేన స్వస్తనితం యేన నాకస్తయేరన్తరిక్షమివే వరీయసో ॥ 4
దేవానాం హృదయం విశ్వరూపో న తస్య ప్రాణాపానౌ సమ్యం చాస్తి ।
ఓఙ్కారో విశ్వవిశ్వా వై యజ్ఞః యజ్ఞో వై వేదః వేదో వై ॥ 5

నమస్కారం నమస్కోరో రుద్రః నమో రుద్రాయ యోగేశ్వరాధిపతయే ।
నమః ఇతి సిద్ధి ప్రత్యుపస్థానం సాయం ప్రాతర్మధ్యాహ్నే ॥ 6
నమః ఇతి సర్వకామఫలోరుద్రః యథావృన్తాత్ ఫలం పక్వం ।
పవనేన మీరితమ్ నమస్కారేణ రుద్రస్య తథా పాపం ప్రణస్యతి ॥ 7

ఈ విధంగా యోగీశ్వరుడైన రుద్రుడికి నమస్కరించాలి. ఎందుకంటే ఆయన సర్వకాలఫలప్రదుడు కనుక. బాగా పక్వమైన పండు గాలివల్ల తొడిమ నుంచి క్రిందపడుతుంది. అలాగే రుద్రుడికి నమస్కరించినందువల్ల పాపం నశిస్తుంది. కేవలం రుద్రనమస్కారం వల్లనే సర్వధర్మాల ఫలం లభిస్తుంది. ఇతర దేవతల నమస్కారం వల్ల అలాంటి ఫలం లభించదు. కనుక యోగి అయినవాడు ఉదయం, మధ్యాహ్నం సాయంత్ర సమయాల్లో పరమేశ్వరుణ్ణి ఉపాసించాలి.

## మహేశ్వర అవతారం

కల్పాలలో ముప్పై ఒకటోకల్పాన్ని పీతవాస కల్పమంటారు. ఆ కల్పంలో మహాతేజోవంతుడైన బ్రహ్మదేవుడు పీత (పసుపు) వర్ణ శరీరాన్ని పొందాడు. ఆయనకి ఒకసారి పుత్రుడు కావాలని కోరిక కలిగింది. వెంటనే పుత్రుడికోసం ధ్యానం చేయటం ప్రారంభించాడు. కొంత సమయానికి బ్రహ్మకి పసుపు వస్త్రాలు ధరించిన కుమారుడు ఉదయించాడు. ఆ పుత్రుడు పసుపు రంగు శరీరంతో, పసుపు రంగుమాలలు, పసుపురంగు యజ్ఞోపవీతం, పసుపు తలపాగాని ధరించి మహాభుజాలతో విరాజిల్లుతున్నాడు.

ప్రభువుగా కనిపిస్తున్న ఆ లోకేశ్వరుణ్ణి చూసి బ్రహ్మదేవుడు మనసులోనే ఆ పరమేశ్వరుడికి నమస్కరించాడు. తరువాత బ్రహ్మదేవుడు తిరిగి ధ్యానం చేసాడు. అప్పుడా ధ్యానం నుంచి పరాస్వరూపిణి అయిన మహేశ్వరిని విశిష్ఠ రూపంతో ఉన్న గోవుగా దర్శించాడు. ఆ గోవుకి నాలుగు పాదాలు, నాలుగు ముఖాలు, నాలుగునోర్లు, నాలుగు కొమ్ములు, నాలుగు కోరలు, నాలుగు స్తనాలు, నాలుగు చేతులు ఉన్నాయి. ఆ మహేశ్వరి ముప్పై రెండు లోకాలతో కూడుకుని ఉంది. అందుకే ఆమె సర్వాధికారిణిగా ఈశ్వరిగా మారిపోయింది.

సకల దేవతల చేత నమస్కరించబడినవాడు గొప్ప తేజస్సుతో వెలిగిపోయేవాడు అయిన ఆ మహాదేవుడు, మహేశ్వరిగా జన్మించిన ఆ మహాదేవిని చూసి తిరిగి ఇలా అన్నాడు. దేవీ! నా దగ్గరకు రా! అని చాలా మృదువుగా పిలిచాడు. మహేశ్వరుడి పిలుపు విన్న మహేశ్వరి కూడా ఆయనకి నమస్కరించి చాలా ఎత్తుగా లేచి నిలుచుంది. ఆమె అలా లేచి విశ్వమంతా వ్యాపించి జగత్తునంతా వశం చేసుకుంది. అప్పుడు బ్రహ్మదేవుడు లోకహితం కోసం మహేశ్వరిని పిలిచి నీవు రుద్రుడికి భార్యవికా! అని అడిగాడు. ఆమె ఆనందంగా అందుకు అంగీకరించి రుద్రుణ్ణి చేరి రుద్రాణిగా విఖ్యాతి పొందింది.

మహాదేవుడైన మహేశ్వరుడు రుద్రాణిని చేపట్టిన తరువాత బ్రహ్మకోసం తిరిగి తన దివ్యయోగాన్ని స్మరించాడు. అలా స్మరించి ఐశ్వర్యాన్ని, జ్ఞానసంపదని, వైరాగ్యాన్ని ఆ బ్రహ్మకి ఇచ్చాడు. ఆ తరువాత మహేశ్వరుడు ఒక్కసారి భయంకరంగా అట్టహాసం(పెద్దగా నవ్వటం)చేసాడు. ఆయన అట్టహాసం నుంచి అన్ని వైపుల వెలుగులు వెదజల్లే కుమారులు జన్మించారు. అలా జన్మించిన వారంతా కూడా పసుపుపచ్చని మాలలు, వస్త్రాలు ధరించి, పసుపు గంధాల్ని వంటిమీద పూసుకున్నారు. వారికి పసుపురంగు తలపాగాలున్నాయి. పచ్చనిముఖం, వెంట్రుకలు కూడా పచ్చనివే. వారంతా అమిత తేజోవంతులు, యోగాత్ములు. లోక హితం కోసం శుచిగా స్నానం చేసారు.

ఆ కుమారులందరూ ధర్మబలం యోగబలం వుండి దీర్ఘసత్రయాగం చేస్తున్న ఋషుల దగ్గరకి వెళ్ళి వారికి నిజమైన యోగాన్ని ఉపదేశించి ఆ తరువాత రుద్రాత్ముడైన ఈశ్వరుడి శరీరంలోకి ప్రవేశించారు. ఆ విధంగా పసుపుపచ్చటి రంగులో ఉండే కల్పం పరిసమాప్తమైపోయింది. ఆ తరువాత వరుసగా సితకల్పం, విశ్వరూపకల్పం ఆవిర్భవించాయి. ఆయా కల్పాలలో మహేశ్వరుడు వివిధరూపాల్లో అవతరించాడు. పరమేశ్వరుడి అవతారాన్ని చూసి ఎంతో ఆనందించిన బ్రహ్మదేవుడు ఆయన్నిలా అడిగాడు.

భగవాన్ దేవదేవేశ విశ్వరూపీమహేశ్వరః ।
ఇహమాస్తవ మహాదేవ తనవోలోక వందితాః ॥

విశ్వరూపః మహాసత్త్వ కస్మిన్కాలే మహాభుజః ।
కస్యాం వాయుగసంభూత్యాం ద్రక్ష్యన్తి త్వాం ద్విజాతయః ॥
కేనవాతత్త్వయోగేన ధ్యానయోగేన కేనవా ।
తనవస్తే మహాదేవ శక్త్యాద్రష్టుం ద్విజాతిభిః ॥ *(శ్లో॥90-93 అధ్యా-23)*

ఓ భగవాన్! మహాదేవా! దేవదేవా! విశ్వరూపుడవైన ఓ మహేశ్వరా! నీ దివ్య శరీరాలన్నీ లోకవందితాలైనాయి ప్రభూ! ఓ మహాసత్త్వస్వరూపా! మహాబాహూ! ద్విజులైన వారు నిన్ను ఏ యుగసంభూతితో చూడగలరు? మానవులు ఏ తత్త్వయోగంతో, ఏ ధ్యానయోగంతో నీ దివ్యశరీరాన్ని దర్శించగలరు?

తపసావై యోగేన దానధర్మఫలేనవా ।
నతీర్థ ఫలయోగన క్రతుభిర్వా సదక్షిణైః ॥
నవేదాధ్యాపనై ర్వాపిన చిత్తేన నివేదనైః ।
శక్యోహం మానుషైర్ద్రష్టుం ఋతే ధ్యానాత్పరం నహి ॥
*(శ్లో॥93-94, అధ్యా-23)*

ప్రజాపతీ! తపస్సుచేతగానీ యోగం చేతగానీ, దానధర్మఫలంచేత గానీ, తీర్థయాత్రలు చేసినందువల్లగానీ, దక్షిణలతో కూడిన యజ్ఞయాగాలు చేసినందువల్ల గానీ వేదాలు చదివించినందువల్ల గానీ, హృదయ సమర్పణ చేసినందువల్ల గానీ నేను మనుషులకి కనపడను. కేవలం ధ్యానం వల్ల మాత్రమే వారికి దర్శనమిస్తాను అని బదులిచ్చాడు పరమేశ్వరుడు.

## 28 ద్వాపరాలు - శివుడి అవతారాలు

మహాదేవుడైన పరమేశ్వరుడు (మనువు నుంచి ప్రారంభమై కృష్ణద్వైపాయనుడి దాకా వ్యాసులు ఉదయించిన) 28 ద్వాపరాలలో 28 రకాల అవతారాల్ని ధరించాడు.

**1వ ద్వాపరం :** ఈ ద్వాపరయుగంలో మహాతేజస్సుతో ప్రకాశించి శ్రీమహావిష్ణువు కాలస్వరూపుడుగా ప్రకాశిస్తాడు. అది వరాహకల్పం. ఆ ద్వాపరంలో బ్రహ్మదేవుడికి వైవస్వతుడనే కుమారుడు జన్మించాడు. ఆయనే ఆ ద్వాపరానికి

వ్యాసుడు. ఆ కాలంలోనే పరమేశ్వరుడు 'శ్వేతుడు' అనే మునిగా అవతరించి హిమగిరి శిఖరాన్ని తన నివాసంగా చేసుకున్నాడు. ఆయనకి 1.శ్వేతుడు 2.శిఖుడు 3.శ్వేతాశ్వుడు 4.శ్వేతలోహితుడు అనే నలుగురు శిష్యులున్నారు. వారంతా వేదపారంగతులు. తమ జీవితాంతం బ్రహ్మమార్గాన్ని అనుసరించి బ్రహ్మమయులై చివరికి ఆ పరమేశ్వరుణ్ణి చేరారు.

**2వ ద్వాపరం :** రెండో ద్వాపరయుగంలో నారాయణుడు సత్యుడనే పేరుతో వ్యాసుడుగా ఆవిర్భవిస్తాడు. ఆ కాలంలోనే లోకహితం కోసం పరమేశ్వరుడు కూడా సుతారుడనే పేరుతో అవతరిస్తాడు. సురుతారుడుగా ఉన్న పరమేశ్వరుడికి 1.దుందుభి 2.శతరూపుడు 3.ఋచీకుడు, 4.క్షితుమానే అనే కుమారులు జన్మించి, వారంతా దివ్యయోగాన్ని జ్ఞానాన్ని పొంది రుద్రలోకానికి చేరుకున్నారు.

**3వ ద్వాపరం :** ఈ యుగంలో 'భార్గవుడు' వ్యాసుడుగా ఉండగా, దమనుడు అనే పేరుతో శంకరుడు ఆవిర్భవించాడు. ఈ దమనకుడికి 1.విశోకుడు 2.వికేశుడు 3.విశాపుడు 4.శాపశాసనుడు అనే నలుగురు పుత్రులు జన్మించారు. వారంతా యోగమార్గాన్ని అవలంబించి చివరికి రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**4వ ద్వాపరం :** ఈ ద్వాపరయుగంలో 'అంగిరసుడు'నే వాడు వ్యాసుడుగా ఉంటాడు. అదే కాలంలోమహేశ్వరుడు సుహోత్రుడనే పేరుతో అవతరించాడు. ఆయనకి 1.సుముఖుడు 2.దుర్ముఖుడు 3.దురతిక్రముడు 4.దుర్దముడు అనే నలుగురు జన్మించారు. వారంతా దృఢవ్రతులు, తపోధనులు, నివృత్తిమార్గాన్ని అవలంబించి చివరికి అందరూ రుద్రలోకానికి చేరుకున్నారు.

**5వ ద్వాపరం :** ఈ యుగానికి వ్యాసుడు 'సవిత' ఇదే యుగంలో మహాదేవుడైన పరమేశ్వరుడు 'కంగుడు' అనే పేరుతో అవతరించాడు. ఈ కంగుడికి తపోధనులు మహాతేజస్వులైన 1.సనుడు 2.సనందనుడు 3.సనాతనుడు 4.సనత్కుమారుడు అనేవారు జన్మించారు. వీరంతా తమ తపోదీక్షతో దివ్యప్రదేశమైన రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**6వ ద్వాపరం :** 'మృత్యువు' అనేవాడు ఈ ద్వాపరానికి వ్యాసుడుగా ఉండగా, పరమేశ్వరుడు 'లోలాక్షి' అనే పేరుతో అవతరించాడు. ఈ లోలాక్షుడికి యోగాత్ములైన, 1.సుధాముడు 2.విరజుడు 3.శంఖపాదుడు 4.రవుడు అనే పుత్రులు ఉదయించారు. వారంతా ధర్మాచరణ చేసి యోగమార్గాన్ని అవలంబించి చివరికి పవిత్రమైన రుద్రలోకానికి చేరుకున్నారు.

**7వ ద్వాపరం :**ఏడోద్వాపర యుగానికి వ్యాసుడు మహాతేజోవంతుడైన 'శతక్రతువు'. అదేయుగంలో మహేశ్వరుడు సకల యోగుల్లో శ్రేష్ఠుడైన జైగీషవ్యుడనే పేరుతో భూలోకంలో అవతరించాడు. ఆ జైగీషవ్యుడికి 1.సారస్వతుడు 2.సుమేధుడు 3.సవాహనుడు 4.సవాహనుడు అనే కుమారులు జన్మించారు. వారు నలుగురూ నివృత్తి మార్గాన్ని అనుసరించి మహాత్ములై చివరికి రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**8వ ద్వాపరం :** ఈ ద్వాపరానికి వశిష్ఠుడు వ్యాసుడుగా ఉన్నాడు. అదేకాలంలో రుద్రుడు పరమేశ్వరుడు అవతరించాడు. ఆయనకి 1.కపిలుడు 2.ఆసురి 3.పంచశిఖుడు 4.వాగ్బలి అనే నలుగురు యోగీశ్వరులు పుత్రులుగా జన్మించారు. వారంతా ధ్యాన యోగులై మహేశ్వర యోగాన్ని సిద్ధిపొంది పునరావృత్తి రహితమైన రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**9వ ద్వాపరం :** 'సారస్వతు'డనే వాడు ఈ ద్వాపరానికి వ్యాసుడు కాగా, 'ఋషభుడ'నే పేరుతో మహేశ్వరుడు ఇక్కడ అవతరించాడు. ఆ ఋషభుడికి 1.పరాశరుడు 2.గార్గ్యుడు 3.భార్గవుడు 4.అంగిరసుడు అనేవారు జన్మించారు. వారు మహా తపోధనులు నిగ్రహానుగ్రహ సమర్థులు, వారుకూడా యోగమార్గాన్ని అవలంబించి రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**10వ ద్వాపరం :** పదో ద్వాపరయుగంలో 'త్రిధాముడు' వ్యాసుడిగా జన్మించాడు. అదేకాలంలో మహేశ్వరుడు అవతరించి హిమాలయాల్లో ఉన్న భృగుశిఖరాన్ని చేరుకున్నాడు. ఆయనకి 1.బలబంధువు 2.నిరామిత్రుడు 3.కేతుశృంగుడు 4.తపోధనుడు అనే మహాతపస్సంపన్నులైన పుత్రులు జన్మించారు. వారంతా యోగమార్గాన్ని తమ జీవితాంతం అనుసరించి పాపాలన్నిటినీ నశింప చేసుకుని చివరికి రుద్రలోకాన్ని చేరారు.

**11వ ద్వాపరం :** ఈయుగానికి 'త్రివృత్' అనే మహానుభావుడు వ్యాసుడిగా ఉన్నాడు. ఇదే కాలంలో మహేశ్వరుడు గంగాద్వారం అనే ప్రాంతంలో కలర్ధ్ధరిగా అవతరించాడు. ఆయనకి 1.లంబోదరుడు 2.లంబుడు 3.లంబాక్షుడు 4.లంబకేశుడు అనే నలుగురు పుత్రులు జన్మించారు. వారంతా అమిత తేజోవంతులు. ధ్యానమార్గం ద్వారా తమ జీవితాల్ని చరితార్థం చేసుకుని చివరికి రుద్రలోకానికి వెళ్ళారు.

**12వ ద్వాపరం :** ఈ యుగంలో 'శతతేజు' డనే మహాముని వ్యాసుడిగా జన్మించాడు. ఆయన మహాకవి. సత్త్వసంభావం కలిగినవాడు. అదేకాలంలో అవిర్నాముడు అనేపేరుతో మహేశ్వరుడు అవతరించగా ఆయనకి 1.సర్వజ్ఞుడు 2.సమబుద్ధి 3.సాధ్యుడు 4.సర్వుడు అనేవారు పుత్రులుగా జన్మించారు. వారంతా నిత్యం భస్మంతో స్నానం చేసి, భస్మాన్నే ధరించి మహాయోగులై చివరికి రుద్రలోకానికి చేరుకున్నారు.

**13వ ద్వాపరం :** నారాయణుడనే 'ధర్ముడు' పదమూడో మన్వంతరానికి వ్యాసుడుగా ఉన్నాడు. అప్పుడే గంధమాదన పర్వతం మీద వాలఖిల్యాశ్రమంలో, 'వాలి' అనే మహామునిగా పరమేశ్వరుడు అవతరించాడు. అక్కడ ఆయనకి మహాతపోధనులైన 1.సుధాముడు 2.కాశ్యపుడు 3.వశిష్ఠుడు 4.విరజుడు అనేవారు పుత్రులై జన్మించారు. వారు కూడా మహాయోగబలంతో ఊర్ధ్వరేతస్కులై సరాసరి రుద్రలోకాన్ని చేరుకుంటారు.

**14వ ద్వాపరం :** ఈ యుగంలో సురక్షణుడనే మహాపురుషుడు వ్యాసుడుగా ఉన్నాడు. అపుడు మహేశ్వరుడు అంగిరసవంశం శ్రేష్ఠుడైన గౌతముడిగా అవతరించాడు. గౌతముడి పేరుమీదుగానే ఆయన జన్మించిన ప్రాంతంలో గౌతమ వనం ఏర్పడింది. ఈ గౌతముడి రూపంలో అవతరించిన శివుడికి మహర్షులైన 1.అత్రి 2.ఉగ్రతపుడు 3.శ్రావణుడు 4.ప్రవిష్టుడు అనేవారు పుత్రులుగా జన్మించారు. యోగాత్ములుగా జీవితం గడిపిన వారంతా ధ్యానమార్గాన్ని అవలంబించి రుద్రలోకానికి వెళ్ళారు.

**15వ ద్వాపరం :** 'అరుణి'అనే మహానుభావుడు పదిహేనో ద్వాపరంలో వ్యాసుడుగా జన్మించాడు. అదేకాలంలో 'వేదశిరుడు' అనే పేరుతో మహేశ్వరుడు ఆవిర్భవించాడు. ఆయన హిమాలయాల్లో సరస్వతీ తీరంలో వున్న వేదశీర్షం అనే పర్వతాన్ని నివాసంగా చేసుకున్నాడు. ఆయన పేరుమీదగానే వేదశిరోనామకాస్త్రం కూడా ఆ కాలంలో ఏర్పడింది. వేదశీర్షుడుగా అవతరించిన ఆ మహేశ్వరుడికి 1.కుణి 2.కుణి బాహువు 3.శుశరీరుడు 4.కునేత్రుడు అనేవారు పుత్రులుగా జన్మించారు. బ్రాహ్మీమూర్తులైన ఆ నలుగురూ నివృత్తిమార్గాన్ని అవలంబించి యోగధారణ చేసి రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**16వ ద్వాపరం :** ఈ ద్వాపరంలో 'సంజయుడ' నే మహాత్ముడు వ్యాసపదవిని అలంకరించాడు. ఈ కాలంలోనే పరమేశ్వరుడు 'గోకర్ణుడుగా ఒక వనంలో జన్మించాడు. ఆయన జన్మించిన కారణంగా ఆ వనానికి 'గోకర్ణవనం' అనే పేరు ఏర్పడింది. ఆ అవతారంలో ఆయనకి మహాతేజస్వులైన 1.కశ్యపుడు 2.ఉశనుడు 3.చ్యవనుడు 4.బృహస్పతి అనేవారు పుత్రులుగా జన్మించారు. వారంతా యోగమార్గం ద్వారా పరమపదమైన రుద్రలోకానికి చేరుకున్నారు.

**17వ ద్వాపరం :** దేవకృతంజయుడు అనే మహాత్ముడు పదిహేడో ద్వాపరంలో వ్యాసుడుగా జన్మించాడు. ఆ సమయంలో మహేశ్వరుడు 'గుహావాసి' అనే పేరుతో ఆవిర్భవించగా ఆయనకి 1.ఉతథ్యుడు 2.వామదేవుడు 3.మహాకాలుడు 4.మహాలయుడు అనే పుత్రులు ఉదయించారు. హిమాలయపర్వతం మీద మహాలయం అనే సిద్ధిక్షేత్రం ఉంది. ఆ సిద్ధి క్షేత్రంలో ఈ నలుగురు మహర్షులూ లక్షల మంది శిష్యులకి ధ్యానయోగ సాధన నేర్పిస్తుంటారు. వారంతా తమ హృదయంలో ధ్యానయోగం ద్వారా మహేశ్వరుణ్ణి నిలిపి చిరకాలం సమాధిస్థితిలో ఉండి మహేశ్వరుడి దివ్యధామమైన రుద్రలోకానికి చేరుకుంటారు.

**18వ ద్వాపరం :** ఈ ద్వాపరంలో 'ఋతుంజయ' డనే మహానుభావుడు వ్యాసుడుగా జన్మించగా, 'శిఖండి' అనే పేరుతో మహేశ్వరుడు అవతరించాడు. మహాసిద్ధక్షేత్రంగా దేవదానవులచేత ప్రశంసించబడ్డ పర్వతం శిఖండి పర్వతం.

హిమాలయాల్లో ఉన్న ఆ పర్వతం మీదే ఆయన నివాసమున్నాడు. శిఖండిగా అవతరించిన పరమేశ్వరుడికి మహాతపోధనులైన 1.వాచశ్రృవుడు 2.ఋచీకుడు 3.శావాసుడు 4.దృఢవ్రతుడు అనే వారు పుత్రులుగా జన్మించారు. వారు వేదవేదాంగాలు పఠించి, మహేశ్వరయోగం ద్వారా చివరికి రుద్రలోకాన్ని పొందారు.

**19వ ద్వాపరం :** భరద్వాజుడనే మహామునీశ్వరుడు ఈ ద్వాపరానికి వ్యాసుడుగా ఉన్నాడు. ఇదే కాలంలో 'జటామాలి' అనే పేరుతో మహేశ్వరుడు అవతరించాడు. రమ్యమైన హిమాలయ శిఖరాల్లో వున్న జటాయు పర్వతాన్ని ఆయన నివాసంగా చేసుకున్నాడు. యోగాత్ములు తపోధనులైన 1.హిరణ్యుడు 2.కౌశిల్యుడు 3.కాక్షీకుడు 4.కుథిముడు అనేవారు ఆయనకి పుత్రులుగా జన్మించి, తమ తపోయోగ బలంతో రుద్రలోకవాసులయ్యారు.

**20వ ద్వాపరం :** ఇరవయ్యో ద్వాపరంలో మహాయశస్వి అయిన వాచశ్శవుడు అనేవాడు వ్యాస పదవినలంకరించాడు. అప్పుడు మహేశ్వరుడు 'అట్టహాసి' అనే పేరుతో అవతరించగా, మహాబలులు, ధ్యానయోగులు అయిన 1.సుమంతుడు 2.నర్వరి 3.సుబంధువు 4.కుసికంధరుడు అనే నలుగురు ఆయనకి పుత్రులుగా జన్మించారు. అట్టహాసిగా అవతరించిన శివుడు సిద్ధులు చారణులు సంచరించే హిమాలయాన్ని నివాసంగా చేసుకోగా ఆయన పుత్రులు మహేశ్వర యోగాన్ని అవలంబించి రుద్రలోకాన్ని చేరుకున్నారు.

**21వ ద్వాపరం :** 'వాచస్పతి' అనే మహర్షి ఇరవయ్యో ద్వాపరంలో వ్యాసుడుగా జన్మించాడు. ఇదే కాలంలో మహేశ్వరుడు 'దారుకుడు' అనే పేరుతో ఒక వనంలో అవతరించాడు. ఆయన అవతరించిన కారణంగా ఆ వనానికి 'దారుకావనం' అనే పేరు వచ్చింది. దారుకుడుగా అవతరించిన శివుడికి వరుసగా 1.ప్లక్షుడు 2.దాక్షాయని 3.కేతుమాలి 4.బకుడు అనే మహర్షులు పుత్రులుగా ఉదయించారు. వారంతా నివృత్తి మార్గాన్ని అనుసరించేవారు. ఊర్ధ్వరేతస్కులు, పరమయోగాన్ని అభ్యసించి ఆ ప్రభావంతో అందరూ రుద్రలోక నివాసులయ్యారు.

**22వ ద్వాపరం :** ఈ ద్వాపరంలో 'శుక్లాయనుడు' అనే పరమపురుషుడు వ్యాసపదవినలంకరించాడు. అదేకాలంలో పరమేశ్వరుడు నాగలి ధరించిన 'భీముడి'గా అవతరించాడు. పరమధార్మికులైన 1. తుల్యార్చి 2. మధువు 3. పింగాక్షుడు 4. శ్వేతకేతువు అనే నలుగురు పుత్రులు ఆయనకి జన్మించారు. వారంతా జీవితాంతం మహేశ్వర యోగాన్ని అవలంబించి, నిరంతరం ధ్యాన పరాయణులై రజోగుణ రహితులై పరబ్రహ్మ మయమైన రుద్రలోకానికి చేరుకున్నారు.

**23వ ద్వాపరం :** 'తృణబిందువు' అనే మహాత్ముడు ఈ ద్వాపరానికి వ్యాసుడుగా వున్నాడు. అదేకాలంలో మహాబలుడైన 'శ్వేతుడు' అనే పేరుతో మహేశ్వరుడు అవతరించాడు. ఆయన హిమాలయాల్లో ఉన్న ఒక ఉత్తమమైన పర్వతం మీద నివాసముండగా తదనంతరకాలంలో ఆ పర్వతం కాలంజర పర్వతంగా ప్రసిద్ధి చెందింది. శ్వేతుడుగా అవతరించిన ఆ మహేశ్వరుడికి 1. ఉషిజుడు 2. బృహదుక్థుడు 3. దేవలుడు 4. కవి అనే మహాత్ములు పుత్రులుగా జన్మించారు. వారు కూడా ధ్యానపరాయణులై మహేశ్వర యోగాన్ని అవలంబించి రుద్రలోకవాసులయ్యారు.

**24వ ద్వాపరం :** ఈ ఇరవైనాలుగో ద్వాపరంలో 'ఋక్షుడు' అనే మహాపురుషుడు వ్యాసుడుగా జన్మిస్తాడు. అదే కాలంలో నైమిశారణ్య క్షేత్రంలో 'శూలి' అనే పేరుతో శంకరుడు అవతరించాడు. ఆ 'శూలి' కి మహాతపస్వులైన. 1. శాలిహోత్రుడు 2. అగ్నివేశ్యుడు 3. యువనేశ్వుడు 4. శరద్వసువు అనే నలుగురు పుత్రులు జన్మించారు. వారంతా మహేశ్వర యోగాన్ని శ్రద్ధగా ఆచరించి, యోగబలంలో చివరికి రుద్రలోకానికి వెళ్ళారు.

**25వ ద్వాపరం :** ఈ ద్వాపరంలో 'శక్తి' అనే మహర్షి వ్యాసపదవి నలంకరించగా, దండాన్ని ధరించి, శిరోముండనం చేసుకున్న 'శరుడు' అనే పేరుతో మహేశ్వరుడు అవతరించాడు. ఆయన 'కోటివర్షం' అనే నగరంలో నివసించగా ఊర్ధ్వరేతస్కులైన 1. ఛగలుడు 2. కుంభకర్ణాశ్యుడు 3. కుంభుడు 4. ప్రభావకుడు అనేవారు ఆయనకి పుత్రులుగా జన్మించారు. వారు కూడా నిరంతరం ధ్యానయోగాన్ని అవలంబించి, క్రమంగా రుద్రలోకానికి చేరుకున్నారు.

**26వ ద్వాపరం :** పరాశరమహర్షి ఇరవైఆరో ద్వాపరానికి వ్యాసుడిగా పదవినలంకరించాడు. ఆ సమయంలో పరమేశ్వరుడు 'సహిష్ణువు' అనే పేరుతో రుద్రవనంలో ఆవిర్భవించాడు. పరమ ధార్మికులైన 1.ఉతాకుడు 2.వైద్యుతుడు 3.సర్పకుడు 4.అశ్వలాయనుడు అనేవారు ఆయనకి పుత్రులుగా జన్మించి మహేశ్వర యోగాన్ని అవలంబించటం ద్వారా తమ పూర్వీకులలాగానే రుద్రలోకాన్ని చేరారు.

**27వ ద్వాపరం :** ఇరవైఏడో ద్వాపరంలో 'జాతకర్ణ్యుడు' అనే మహా తపస్సంపన్నుడు వ్యాసుడుగా జన్మించాడు. అదేకాలంలో మహేశ్వరుడు 'సోమశర్మ' అనే పేరుతో ప్రభాసతీర్థంలో అవతరించాడు. మహా జ్ఞానసంపన్నులు, తపోధనులు అయిన 1.అక్షపాదుడు 2.ఉతాకుడు 3.వత్సుడు 4.కణాదుడు అనేవారు ఆ సోమశర్మకి పుత్రులుగా జన్మించారు. వారంతా ఎంతో పవిత్రమైన జీవితాన్ని గడిపి మహేశ్వరయోగాన్ని అభ్యసించటం ద్వారా క్రమంగా ఒకరి తరువాత ఒకరు రుద్రలోకానికి చేరుకున్నారు.

**28వ ద్వాపరం :** ఈ ఇరవైఎనిమిదో ద్వాపరంలో పరాశర మహర్షి పుత్రుడైన కృష్ణద్వైపాయనుడు వ్యాసుడుగా పదవినలంకరించాడు. అదే కాలంలో శ్రీమన్నారాయణుడు భూలోకంలో దేవకీ వసుదేవ దంపతులకి శ్రీకృష్ణుడుగా అవతరించాడు. ఆ కాలంలోనే మహేశ్వరుడు కూడా యోగాత్ముడై ఒక బ్రహ్మచారి శరీరాన్ని ధరించాడు. బ్రహ్మచారిగా ఉన్న శివుడు 'నకులీయుడు' అనేపేరుతో ప్రసిద్ధుడై మేరు పర్వతం మీదున్న ఒక గుహలో తన నివాసాన్ని ఏర్పర్చుకున్నాడు. ఆయన నివసించిన ఆ గుహ కాయారోహణ సిద్ధి క్షేత్రంగా ప్రసిద్ధిచెందింది. ఆ అవతారంలో కూడా మహేశ్వరుడికి 1.కుశికుడు 2.గార్గ్యుడు 3.మిత్రకుడు 4.రుష్టుడు అనేవారు పుత్రులుగా జన్మించారు. వారంతా యోగయుక్తులై మహేశ్వర యోగాన్ని అవలంబించి క్రమంగా రుద్రలోకాన్ని పొందారు.

ఈ విధంగా పరమేశ్వరుడు మనువునుంచి కృష్ణ ద్వైపాయనుడి దాకా వ్యాసులున్న ద్వాపరాలలో తాను కూడా ఇరవైఎనిమిది అవతారాల్ని ధరించాడు.

# శర్వుడి స్తవం

సృష్టి క్రమంలో ఏడోకల్పం చివర ప్రళయం ఏర్పడింది. ఆ కారణంగా సప్తసముద్రాలు ఉప్పొంగి భూమండలాన్నంతా ముంచేసి, అంతా ఒకే సముద్రంగా రూపొందాయి. ఇక ఎటుచూసినా అనంతమైన జలరాశి. జీవి అన్నదేదీ అక్కడ లేదు. ఆ సమయంలో శంఖచక్ర గదాధారి, మేఘంలాగా నల్లనైనవాడు, కమలనేత్రుడు అయిన శ్రీహరి ఎనిమిది బాహువులతో, విశాలమైన వక్షఃస్థలంతో ఆదిశేషుడు పడగల్ని ఆధారంగా చేసుకున్న బంగారు పాన్పుమీద పడుకున్నాడు.

హాయిగా శయనించిన మహావిష్ణువు నాభినుంచి ఒక కమలం ఉద్భవించింది. ఆ దివ్య కమలం వంద యోజనాల వెడల్పుతో ఉంది. ఉదయించిన సూర్యుడిలా ప్రకాశిస్తూ వజ్రంలాంటి నాళం కలిగిఉంది. ఆ కమలంలోనే బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. నాలుగు ముఖాలతో బంగారు వర్ణంతో ప్రకాశించే ఆ బ్రహ్మ కమలం నుంచి క్రిందకి దిగి నెమ్మదిగా మహావిష్ణువు దగ్గరకి వచ్చాడు. వింతగా కనిపించిన బ్రహ్మను చూసి మహావిష్ణువు ఎంతో ఆశ్చర్యపోయాడు.

బ్రహ్మ విష్ణువును చూసి స్వామీ! తమరెవరు? ఈ సముద్రంమీద ఎందుకు శయనించారు? అని ప్రశ్నించాడు. అది విని విష్ణువు వెంటనే పాన్పు నుంచి పైకి లేచి ఓయీ! నేను ఈ సమస్తానికీ ప్రభువుని అసలు ఇంతకీ నీవెవరు? ఎక్కడి నుంచి వచ్చావు? అని తిరిగి బ్రహ్మని అడిగాడు. అందుకు బ్రహ్మ “నేను ఆదికర్తని, ప్రజాపతిని. ఈ సర్వం నాలోనే ఉంది. నేను అన్నిటినీ సృష్టించే సృష్టికర్తని” అని బదులిచ్చాడు.

మహావిష్ణువుకి బ్రహ్మమాటలు విని ఎంతో ఆశ్చర్యం కలిగింది. ఓ ప్రజాపతీ!నీలో అన్నీ ఉన్నాయని చెప్పావు కదా! నేను నీ లోపలికి వెళ్ళి అన్నీ చూడవచ్చా? అని అడిగాడు. బ్రహ్మ అనుమతించాడు. వెంటనే విష్ణువు బ్రహ్మముఖం ద్వారా ఆయన ఉదరంలోకి ప్రవేశించాడు. అక్కడ మహాద్భుతంగా ప్రకాశిస్తున్న లోకాల్ని, పర్వతాల్ని, సముద్రాల్ని, బ్రాహ్మణ క్షత్రియాది నాలుగు వర్ణాల వారినీ దర్శించాడు.

ఇంకా బ్రహ్మలోపల ఎన్నెన్నో వింతలు విశేషాలు చూస్తూ అలా వెయ్యిసంవత్సరాలు సంచరించాడు. అయినప్పటికీ లోపలున్న లోకాల్ని మొత్తం దర్శించలేకపోయాడు. బ్రహ్మదేవుడి దివ్యశక్తికి, ఆయన ప్రభావానికి ఆశ్చర్యపోయి తిరిగి ఆయన ఉదరం నుంచి బైటికి వచ్చాడు మహావిష్ణువు. ఎదురుగా ఉన్న బ్రహ్మతో "భగవాన్! నీ ఉదరంలో నేను ఎన్నో దివ్యలోకాలు చూసాను. ఇక నీవు కూడా నాలో ఉన్న లోకాల్ని చూడు" అని అన్నాడు.

విష్ణువు మాటననుసరించి బ్రహ్మదేవుడు కూడా ఆయన ముఖం ద్వారా లోపలికి ప్రవేశించాడు. ఆశ్చర్యం, అద్భుతం విష్ణువు ఉదరంలో ఏఏ లోకాలు, ప్రాంతాలు దర్శించాడో బ్రహ్మదేవుడు కూడా విష్ణువు ఉదరంలో అవే లోకాల్ని ప్రాంతాల్ని దర్శించాడు. ఎంత చూసినా ఆయనకి దాని అంతే తెలియటంలేదు. ఇక చూసింది చాలని భావించి బైటికి రావాలనుకున్నాడు బ్రహ్మ. అది గ్రహించిన విష్ణువు వెంటనే తన ద్వారాలన్నిటినీ మూసి వేసాడు. లోపలున్న బ్రహ్మ బైటికి రాలేకపోయాడు అన్ని ద్వారాలూ మూసి ఉన్నాయని గమనించిన బ్రహ్మ వివేకంగా మహాసూక్ష్మరూపాన్ని ధరించి, విష్ణువు నాభి నుంచి సరాసరి నాళంద్వారా తిరిగి కమలంలోకి వచ్చి చేరాడు.

తరువాత మహావిష్ణువు దగ్గరకి సకలభూతాలకీ ప్రభువు, ఈశ్వరుడు, త్రిశూలాన్ని బంగారు వస్త్రాలు ధరించి ఎంతో వైభవంగా ప్రకాశించే మహాదేవుడు వచ్చాడు. మహావేగంగా వస్తున్న శివుడి పాదాల తాకిడికి అక్కడున్న సముద్ర జలాలు ఉవ్వెత్తున పైకి లేచాయి. వాయువు బలంగా వీచింది. ఆ గాలి తాకిడికి బ్రహ్మ కూర్చున్న కమలం వణికిపోయింది. అందులో ఉన్న బ్రహ్మ విష్ణువుతో "ఏమిటీ విపరీతం? ఎందుకిలా జరుగుతోంది? నేను కూర్చున్న కమలం వణికిపోతుంది అని అడిగాడు. శేషతల్పం మీద పడుకున్న విష్ణువుకి ఒక్కసారిగా వళ్ళు జలదరించింది. ఆయనకి బ్రహ్మ తిరిగి బైటికి వచ్చిన విషయం తెలియదు. ఒక్కసారి ఆయన గొంతు వినబడేసరికి కంగారు పుట్టింది. వెంటనే తమాయించుకుని ఏమీ తెలియని వాడిలా "భగవాన్ తమరెవరు? ఎందుకు నా కమలంలో కూర్చున్నారు? అని అడిగాడు.

బ్రహ్మదేవుడు శాంతంగా "స్వామీ! ఇంతకు పూర్వమే నేను మిమ్మల్ని కలిశాను. మీరు నా ఉదరంలోకి ప్రవేశించి తిరిగి బైటికి వచ్చారు. అలాగే నేను కూడా మీ ఉదరంలోకి ప్రవేశించి తిరిగి బైటకి రాబోతుంటే తమరు మాత్సర్యంతో ద్వారాలన్నీ మూసేసారు. చేసేదేం లేక నేను నా మనసుతో ధారణచేసి తమరి నాభినాళం ద్వారా ఎలాగో తిరిగి బైటపడ్డాను. మీరలా చేసినప్పటికీ నాకు మీమీద ఎలాంటి కోపం లేదు. ఎందుకంటే తమరు పూజనీయులు" అని వినయంగా పలికాడు.

బ్రహ్మమాటలు విన్నాక విష్ణువుకి తను చేసిన పని తనకే అవమానం అనిపించింది. వెంటనే బ్రహ్మతో "కళ్యాణప్రదుడా! దయచేసి నా అపరాధాన్ని క్షమించు. ముందు పద్మం దిగి క్రిందకిరా! మహాతేజస్సుతో వెలిగిపోతున్న నీ బరువుని నేను మోయలేకపోతున్నానన్నాడు. అది విన్న బ్రహ్మ ప్రభూ! తమరు నాకొక వరం ఇస్తానంటేనే పద్మం దిగి వస్తానన్నాడు. విష్ణువు ఎంతో ఆనందంగా "ఓ శత్రునాశకుడా! ఈనాటి నుంచి నీవు నాకు పుత్రుడిగా ఉండు. నీవు సత్యధనుడివి. మహాయోగివి. ప్రణవస్వరూపిడివి, ఈనాటి నుంచి నీవు పద్మయోనిగా ప్రసిద్ధిచెందుతావు" అని వరాన్ని ప్రసాదించాడు. బ్రహ్మ ఆవరాన్ని విని సంతోషించి పద్మం దిగి ఆయన దగ్గరకి వచ్చాడు. అంతలో వారి సమీపానికి రుద్రుడు విచ్చేయబోతున్నాడు.

మహాభీకరంగా పెద్దముఖంతో, కోరలతో, విరబోసుకున్న తలవెంట్రుకలతో, పదిచేతులతో, మూడు కళ్ళతో, త్రిశూలాన్ని ధరించి, భయంకరంగా ధ్వనిచేస్తూ వస్తున్న రుద్రుణ్ణి చూసి బ్రహ్మదేవుడు ఎంతో ఆశ్చర్యపోయి "ఓ విష్ణుదేవా! ఇంత భీకరంగా మహాతేజస్సుతో వెలిగిపోతూ వస్తున్న ఆ వ్యక్తి ఎవరు? అని విష్ణువుని అడిగాడు.

ఓయీ! బ్రహ్మదేవా! అతడు అనాది స్వరూపుడు ప్రళయాన్ని సృష్టించగల సమర్థుడు. సాక్షాత్తు భగవంతుడైన పరమేశ్వరుడు అని చెప్పాడు. అంతలో రుద్రుడు పాదాల తాకిడికి సముద్ర జలాలు మరింత ఎత్తుగా లేచి బ్రహ్మని విష్ణువుని సాంతం తడిపేశాయి. అప్పుడు విష్ణువు తిరిగి బ్రహ్మతో, "బ్రహ్మదేవా!

నీవు నేను కలిసి వెంటనే ఆ వృషభధ్వజుణ్ణి స్తుతిద్దాం" అని అన్నాడు. విష్ణువు మాటలు వినగానే బ్రహ్మకు అమితమైన కోపం వచ్చింది.

"ఓ విష్ణూ! నీ గొప్పతనాన్ని నీవు తెలుసుకోలేవు. అలాగే ప్రజాపతినైన నా గొప్పతనాన్ని కూడా నీవు గుర్తించవు. మనిద్దరం ఈ జగత్తులోనే గొప్పవాళ్ళం కదా! మధ్యలో ఈ శివుడెవరు? మనిద్దరికీ చాలా వ్యతిరేకంగా కనిపిస్తున్నాడు" అని విష్ణువుతో అన్నాడు. అది విన్న విష్ణువు బ్రహ్మని శాంత పరచి "బ్రహ్మా! మహాత్ముడైన శంకరుడి గురించి తక్కువగా మాట్లాడకు. ఆయన యోగీశ్వరుడు. వరాల్ని ప్రసాదించేవాడు.ఆయనకి నాశనం లేదు. ఆ పరమేశ్వరుడు బీజవంతుడు. నీవు బీజస్వరూపుడివి. నేనేమో బీజాన్ని ఫలింపచేసే యోనిని అని రుద్రుడి గొప్పతనాన్ని బ్రహ్మకి వివరించాడు. తిరిగి ఆ బ్రహ్మతో...

బ్రహ్మా! పరమేశ్వరుడే మనందరికీ అధిపతి అని తెలుసుకో. ఆయన సాక్షాత్తు ప్రణవస్వరూపుడు. ఆయనకి భక్తితో నమస్కరించు. ఆయనకి కోపం వచ్చి ఒక్క నిట్టూర్పు విడిస్తే చాలు ఆ వేడికి నీవు నేనూ ఇద్దరం క్షణాల్లో దహించుకుపోతాం. జాగ్రత్త. ఆయన గొప్పతనాన్ని తెలుసుకోకుండా నిందించకు" అని హెచ్చరించాడు. అంతలో రుద్రుడు వారి సమీపానికి వచ్చాడు. జగదీశ్వరుడైన రుద్రుణ్ణి చూసి తన పాన్పు నుంచి క్రిందకి దిగిన విష్ణువు, బ్రహ్మ దేవుణ్ణి ముందుంచుకుని మహావైభవంగా అగ్నితేజస్కుడైన శంకరుణ్ణి ఇలా స్తుతించాడు.

## విష్ణువు చేసిన శర్వస్తుతి

నమస్తుభ్యం భగవతే సువ్రతే ఽ నన్తతేజసా ।
నమః క్షేత్రాధిపతయే బీజినే శూలినే నమః ॥ 1

ఆమేఢ్రాయోర్ధ్వమేఢ్రాయ నమో వైకుంఠరేతసే ।
నమో జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ అపూర్వప్రథమాయ చ ॥ 2

నమోహవ్యాయ పూజ్యాయ సద్యోజాతాయ వై నమః ।
గహ్వరాయ ధనేశాయ హైమచీరాంబరాయచ ॥ 3

నమస్తే హ్యస్మదాదీనాం భూతానాం ప్రభవాయ చ।
వేదకర్మావదానానాం ద్రవ్యాణాం ప్రభవే నమః॥ 4
నమో యోగస్య ప్రభవే సాంఖ్యస్య ప్రభవే నమః।
నమో ధ్రువనిశీధానామృషీనాం పతయే నమః॥ 5
విద్యుదశని మేఘానాం గర్జిత ప్రభవే నమః।
ఉదధీనాం చ ప్రభవే ద్వీపానాం ప్రభవే నమః॥ 6
అద్రిణాంచ ప్రభవే చైవ వర్షాణాం ప్రభవే నమః।
నమో నదానాం ప్రభవే నదీనాం ప్రభవే నమః॥ 7
నమశ్చౌషధి ప్రభవే చైవ వృక్షాణాం ప్రభవే నమః।
ధర్మాధ్యక్షాయ ధర్మాయ స్థితీనాం ప్రభవే నమః॥ 8
నమో రసానాం ప్రభవే రత్నానాం ప్రభవే నమః।
నమః క్షణానాం ప్రభవే కలానాం ప్రభవే నమః॥ 9
నిమేష ప్రభవే చైవ కాష్ఠానాం ప్రభవే నమః।
అహోరాత్రార్థమాసానాం మాసానాం ప్రభవే నమః॥ 10
నమ ఋతూనాం ప్రభవే సంఖ్యాయాః ప్రభవే నమః।
ప్రభవే చ పరార్ధస్య పరస్య ప్రభవే నమః॥ 11
నమః పురాణప్రభవే యుగస్య ప్రభవే నమః।
చతుర్విధస్య సర్గస్య ప్రభవేఽనన్తచక్షుషే॥ 12
కల్పోదయే నిబద్ధానాం వార్తానాం ప్రభవే నమః।
నమో విశ్వస్య ప్రభవే బ్రహ్మాది ప్రభవే నమః॥ 13
విద్యానాం ప్రభవే చైవ విద్యానాం పతయే నమః।
నమో వ్రతానాం పతయే మన్త్రాణాం పతయే నమః॥ 14
పితౄణాం పతయే చైవ పశూనాం పతయే నమః।
వాగ్వృషాయ నమస్తుభ్యం పురాణ వృషభాయ చ॥ 15
సురుచారు చారుకేశాయ ఊర్ధ్వ చక్షుః శిరాయ చ।
నమః పశూనాం పతయే గోవృషేన్ద్రధ్వజాయ చ॥ 16

ప్రజాపతీనాం పతయే సిద్ధానాం పతయే నమః ।
గరుడోరగ సర్పాణాం పక్షిణాం పతయే నమః ॥ 17
గోకర్ణాయ చ గోష్ఠాయ శఙ్కుకర్ణాయ వై నమః ।
వారాహాయాప్రమేయాయ రక్షోऽధిపతయే నమః 18
నమోహ్యప్సరసాం ప్రత్యేయగణానాం (పతయే) ప్రి యే నమః ।
అంభసాం పతయే చైవ తేజసాం పతయే నమః ॥ 19
నమోऽస్తు లక్ష్మీపతయే శ్రీమతే హ్రీమతే నమః ।
బలాబలసమూహాయ హ్యక్షోభ్యక్షోభణాయ చ ॥ 20
దీర్ఘశృంగైక శృంగాయ వృషభాయ కకుద్మినే ।
నమః స్థైర్యాయ వపుషే తేజసే సుప్రభాయ చ ॥ 21
భూతాయ చ భవిష్యాయ వర్తమానాయ వై నమః ।
సువర్చసేऽథ వీరాయ శూరాయ హ్యతిగాయ చ ॥ 22
వరదాయ వరేణ్యాయ నమః సర్వగతాయ చ ।
నమో భూతాయ భవ్యాయ భవాయ మహతే తథా ॥ 23
జనాయ చ నమస్తుభ్యం తపసే వరదాయ చ ।
నమో వన్ద్యాయ మోక్షాయ జనాయ నరకాయ చ ॥ 24
భవాయ భజమానాయ ఇష్టాయ యాజకాయ చ ।
అభ్యుదీర్ణాయ దీప్తాయ తత్త్వాయ నిర్గుణాయ చ ॥ 25
నమః పాశాయ హస్తాయ నమః స్వాభరణాయ చ ।
హుతాయ అపహుతాయ ప్రసూత ప్రశితాయ చ ॥ 26
నమోऽస్త్విష్టాయ మూ(పూ)ర్తాయ హ్యగ్నిష్టోమర్త్విజాయ చ ।
నమ ఋతాయ సత్యాయ భూతాధిపతయే నమః ॥ 27
సదస్యాయ నమశ్చైవ దక్షిణాబృథాయ చ ।
అహింసాయాధలోకానాం పశుమన్త్రౌషధాయ చ ॥ 28
నమస్తుష్టి ప్రదానాయ త్ర్యంబకాయ సుగంధినే ।
నమోऽస్త్విన్ద్రియపతయే పరిహారాయ స్రగ్విణే ॥ 29

విశ్వాయ విశ్వరూపాయ విశ్వతోఽక్షి ముఖాయ చ ।
సర్వతః పాణిపాదాయ రుద్రాయా ప్రమితాయ చ ॥ 30
నమోఽహవ్యాయ కవ్యాయ హవ్యకవ్యాయ వై నమః ।
నమః సిద్ధాయ మేధ్యాయ చేష్టాయ త్వవ్యయా చ ॥ 31
సువీరాయ సుఘోరాయ హ్యక్షోభ్యక్షోభణాయ చ ।
సుమేధసే సుప్రజాయ దీప్తాయ భాస్కరాయ చ ॥ 32
దృష్టిఘ్నాయ నమశ్చైవ నమః సౌమ్యేక్షణాయ చ ।
నమో ధూమ్రాయ శ్వేతాయ కృష్ణాయ చ ॥ 33
పిశితాయ పిశఙ్గాయ పీతాయచ నిషఙ్గిణే ।
నమస్తే సవిశేషాయ నిర్విశేషాయ వై నమః ॥ 34
నమో వై పద్మవర్ణాయ మృతఘ్నాయ చ మృత్యవే ।
నమః శ్యామ్యాయ గౌరాయ కద్రవేరోహితాయచ ॥ 35
నమః కాన్తాయ సన్ధ్యాభ్రవర్ణాయ బహురూపిణే ।
నమః కపాలహస్తాయ దిగ్వస్త్రాయ కపర్ధినే ॥ 36
అప్రమేయాయ శర్వాయ హ్యవధ్యాయ వరాయ చ ।
పురస్తాత్పృష్ఠత శ్చైవ బిభ్రాణాయ కృశానవే ॥ 37
దుర్గాయ మహతే చైవ రోధాయ కపిలాయ చ ।
అర్కప్రభశరీరాయ బలినే రంహసాయ చ ॥ 38
పినాకినే ప్రసిద్ధాయ స్థితాయ ప్రసృతాయ చ ।
సుమేధసేఽక్షమాలాయ దిగ్వాసాయ శిఖండినే ॥ 39
చిత్రాయ చిత్రవర్ణాయ విచిత్రాయ ధరాయ చ ।
చేకితానాయ తుష్టాయ నమస్త్వనిహితాయ చ ॥ 40
నమఃక్షాన్తాయ శాన్తాయ వజ్రసంహననాయ చ ।
రక్షోఘ్నాయ మఖఘ్నాయ చ శితికంఠోర్ధ్వరేతసే ॥ 41
అరిహాయ కృతాన్తాయ తిగ్మాయుధ ధరాయ చ ।
సమోదాయ ప్రమోదాయ ఇరిణాయైవ తే నమః ॥ 42

ప్రణవ ప్రణవేశాయభక్తానాం శర్మ యదాయ చ ।
మృగవ్యాధాయ దక్షాయ దక్షయజ్ఞహరాయ చ ॥ 43
సర్వభూతాయ భూతాయ సర్వేజాతి శయాయ చ ।
పురభేత్రేచ శాన్తాయ సుగన్ధాయ వరేశవే ॥ 44
పుష్పవన్త స్వరూపాయ ఖగనేత్రాన్తకాయ చ ।
కణదాయ విరిష్టాయ కామాఙ్గదహనాయ చ ॥ 45
రవేః కరాల చక్రాయ నాగేన్ద్రదమనాయ చ ।
దైత్యానామన్తకాయాద్గో దివ్యాక్రన్ద కరాయ చ ॥ 46
శ్మశానరతి నిత్యాయ నమస్త్ర్యంబకధారిణే ।
నమస్తే ప్రాణపాలాయ ధవమాలాధరాయ చ ॥ 47
ప్రహీణ శోకైర్వివిధైర్భూతైః పరిష్ణుతాయ చ ।
నరనారీశరీరాయ దేవ్యాః ప్రియకరాయ చ ॥ 48
జటినే దండినే తుభ్యం వ్యాలయజ్ఞోపవీతినే ।
నమోఽస్తు నృత్యశీలాయ వాద్యనృత్య ప్రియాయ చ ॥ 49
మన్యనే శీతశీలాయ సుగీతిగాయతే నమః ।
కటకకరాయ భీమాయ చోగ్రరూపధరాయ చ ॥ 50
విభీషణాయ భీమాయ భగప్రమథనాయ చ ।
సిద్ధ సంఘాత గీతాయ మహాభాగాయ వై నమః ॥ 51
నమో ముక్తాట్టహాసాయ క్ష్వేదితా స్ఫోటితాయ చ ।
నదతే కూర్దతే చైవ నమః ప్రముదితాయ చ ॥ 52
నమోఽద్భుతాయ స్వపతే ధావతే ప్రస్థితాయ చ ।
ధ్యాయతే జృంభతే చైవ తుతే ద్రవతే నమః ॥ 53
చలతే క్రీడతే చైవ లంబోదర శరీరిణే నమః ।
కృతాయ కంపాయ ముండాయ వికారాయ చ ॥ 54
నమ ఉన్మత్తవేషాయ కింకిణీకాయ వై నమః ।
నమో వికృతవేషాయ క్రూరోగ్రామర్షనాయ చ ॥ 55

అప్రమేయాయ దీప్తాయ దీప్త యే నిర్గుణాయ చ ।
నమః ప్రియాయ వాదాయ ముద్రామణిధరాయ చ॥ 56
నమస్తోకాయ తనవే గుణైరప్రతిమాయ చ ।
నమోగణాయ గుహ్యాయ అగమ్యా గమనాయ చ ॥ 57
లోక ధాత్రీత్వయం భూమిః పాదౌ సజ్జనసేవితా ।
సర్వేషాం సిద్ధయోగానామధిష్ఠానం తవోదరమ్ ॥ 58
మధ్యేఽన్తరిక్షం విస్తీర్ణం తారాగణవిభూషితమ్ ।
తారాపథ ఇవాభాతి శ్రీమాన్ హారస్తవోరసి ॥ 59
దిశోదశభూజాస్తే వై కేయూరాఙ్గద భూషితాః ।
వీస్తీర్ణపరిణాహశ్చ నీలాంబుదచయో పమః ॥ 60
కంఠస్తే శోభతే శ్రీమాన్ హేమసూత్ర విభూషితః ।
దంష్ట్రాకరాల దుర్ధర్షమనౌపమ్యం ముఖం తవ ॥ 61
పద్మమాలాకృతోష్ణీషం శీర్షణ్యం శోభతే కథమ్ ।
దీప్తిః సూర్యేవపుశ్చన్ద్రే స్థైర్యే భూర్వ్యానిలో బలే ॥ 62
తైక్ష్ణ్యమగ్నౌ ప్రభాచన్ద్రే ఖే శబ్దః శైత్యమప్సు చ ।
అక్షరోత్తమనిష్పన్నాన్ గుణానేతాన్విదుర్బుధాః ॥ 63
జపా జప్యో మహాయోగీ మహాదేవో మహేశ్వరః ।
పరేశయో గుహావాసీ ఖేచరో రజనీచరః ॥ 64
తపోనిధిర్గుహగురుర్నందనో నందివర్ధనః ।
హరశీర్ష్ణో ధరా ధాతా విధాతా భూతివాహనః ॥ 65
బోద్ధవ్యో బోధనో నేతా ధూర్వహోదుష్ప్రకంపకః ।
బృహద్రథో భీమకర్మా బృహత్కీర్తి ర్ధనంజయః ॥ 66
ఘంటాప్రియో ధ్వజీ ఛత్రీపతాకాధ్వజినీపతిః ।
కవచీ పట్టిశీ శంఖీ పాశహస్తః పరేశ్వభృత్ ॥ 67
ఆగమస్త్వనఘః శూరో దేవరాజారిమర్దనః ।
త్వాం ప్రసాద్య పురాఽస్మాభిర్ద్విషన్తో నిహతా యుధి ॥ 68

అగ్నిస్త్వం చార్ణవాన్ సర్వాన్ పిబన్నైవ న తృప్యసే ।
క్రోధాగారః ప్రసన్నాత్మా కామహా కామదః ప్రియః ॥ 69
బ్రహ్మణ్యో బ్రహ్మచారీ చ గోఘ్నస్త్వం శిష్టపూజితః ।
వేదానామవ్యయః కోశస్త్వయా యజ్ఞం ప్రకల్పితః ॥ 70
హవ్యం చ వేదం వహతి వేదోక్తం హవ్యవాహనః ।
ప్రీతే త్వయి మహాదేవ వయం ప్రీతా భవామహే ॥ 71
భవానీశో నాదిమాన్ ధామరాశిర్బ్రహ్మ లోకానాన్త్వ కర్తాత్వారిసర్గః ।
సాంఖ్యాః ప్రకృతిభ్యక్తి పరమం త్వాం విదిత్వా క్షీణధ్యానాస్తే న మృత్యుం విశన్తి ॥ 72
యోగేన త్వాన్ధ్యాని నో నిత్యయుక్తాః జ్ఞాత్వాభోగాన్ సన్న్యస్తే పునస్తాన్ ।
యోఽన్యే మర్త్యాస్త్వాం ప్రపన్నా విశుద్ధాస్తే కర్మభిర్దివ్యభోగాన్ భజన్తే ॥ 73
అప్రమేయస్య తత్త్వస్య యథావిద్మః స్వశక్తితః ।
కీర్తితం తమాహాత్మ్యమపారం పరమాత్మనః ।
శివో న భవ సర్వత్ర యోఽపి సోఽపి నమోస్తుతే ॥ 74

*(శ్లో॥88-164, అధ్యా-24)*

ఈ విధంగా తనని ఘనంగా స్తుతించినందుకు రుద్రుడు ఎంతో సంతోషించాడు. బ్రహ్మ విష్ణువులిద్దర్నీ చూసి వారెవరో తనకి తెలిసినప్పటికీ ఏమీ తెలియని వాడిలా మీ ఇద్దరూ ఎవరు? అని ప్రశాంతంగా అడిగాడు. రుద్రుడి మాటలు వినగానే బ్రహ్మ విష్ణువులిద్దరు ఆశ్చర్యపోయారు. “ప్రభూ! మేము మీకు తెలియకపోవటం చాలా విచిత్రంగా వుంది. తమరు అనాదిపురుషులని మేము గ్రహించాం. దయచేసి మమ్మల్ని అనుగ్రహించండి” అని ప్రార్థించారు. పరమేశ్వరుడు వారి ప్రార్ధన విని ఓ బ్రహ్మ విష్ణువులారా! మీరు సత్యం గ్రహించారు. సంతోషం. మీకేం వరం కావాలో కోరుకోండి ప్రసాదిస్తాను” అని అన్నాడు.

అప్పుడు బ్రహ్మదేవుడితో విష్ణువు బ్రహ్మా! ముందుగా నీకేం కావాలో కోరుకో అన్నాడు. బ్రహ్మ విష్ణువుతో నాకు సంతానం కావాలనుంది” అన్నాడు. అది విని విష్ణువు “అయితే ఆ శంకరుణ్ణీ సంతానంగా కోరుకోవయ్యా!

నీ జన్మ తరిస్తుంది" అని సలహా ఇచ్చాడు విష్ణువు. అది ఎంతో గొప్ప ఆలోచన అని విష్ణువుని ప్రశంసించి శంకరుడితో "ప్రభూ నాకు సంతానం కావాలి. అది నీవే నాకు పుత్రుడుగా జన్మించాలి. నా పుత్రుడు సమస్త భారాన్ని మోయగలగాలి అని కోరుకున్నాడు బ్రహ్మ. బ్రహ్మ ప్రార్థన విన్న శంకరుడు 'బాఢం' అనగా తథాస్తు వరాన్ని అనుగ్రహిస్తున్నా అన్నాడు తిరిగి బ్రహ్మతో.

బ్రహ్మా! త్వరలో నీవు సృష్టి కార్యక్రమం ప్రారంభిస్తావు. అప్పుడు నీకు ఒకానొక సందర్భంలో తీవ్రమైన కోపం వస్తుంది. ఆ సమయంలో నీ భృకుటి నుంచి రుద్రుడుగా నేను నీకు జన్మిస్తాను అని చెప్పాడు. తరువాత విష్ణువు వైపుచూసి విష్ణు నీవు కూడా వరాన్ని కోరుకోవయ్యా! అన్నాడు. అప్పుడు విష్ణువు ఆయనకి నమస్కరించి "ప్రభూ! నాకు నీ దివ్యపాదాల మీద నిరంతరం భక్తి ఉండేలా అనుగ్రహించు అదే నేను కోరే వరం మరేదీ వద్దు" అని వినయంగా అన్నాడు.

## శివకేశవ ప్రాశస్త్యం

మహావిష్ణువు కోరిక విన్న పరమేశ్వరుడు ఎంతో సంతోషించి "విష్ణూ! నీ దివ్య స్తుతికి, నీ నిశ్చలమైన భక్తికి నేనెంతో ఆనందించాను. అసలు నీవూ నేనూ వేరే కాదు. మనిద్దరం ఒక్కటే.

ప్రకాశం చాప్రాకాశం చ జంగమం స్థావరం చ యత్ ।
విశ్వరూప మిదం సర్వం రుద్రనారాయణాత్మకమ్ ॥ 1
అహమగ్నిర్భగవాన్ సోమో భవాన్ రాత్రిరహం దినమ్ ।
భవానృతమహం సత్యం భవాన్ క్రతురహం ఫలమ్ ॥ 2
భావాన్ జ్ఞానమహం జ్ఞేయం యజ్జపిత్వా సదా జనాః ।
మాం విశన్తి త్వయి ప్రీతే జనాః సుకృత కారిణః ॥ 3
ఆవాభ్యాం సహితా చైవ గతిర్నాన్యా యుగక్షయే ।
ఆత్మానాం ప్రకృతిం విద్ధి మాం విద్ధి పురుషం శివమ్ ॥ 4
భవానర్ధశరీరం మే త్వహం తవ యథైవ చ ।
వామపార్శ్వమహం మహ్యం శ్యామం శ్రీవత్సలక్షణమ్ ॥ 5

త్వం చ వామేతరం పార్శ్వం త్వహం వై నీలలోహితః ।
త్వం చ మే హృదయం విష్ణో తవ చాహం హృది స్థితః ॥ 6
భవాన్ సర్వస్స కార్యస్య కర్తాహమధిదైవతమ్ ।
తదేహి స్వస్తితే వత్స గమిష్యామ్యంబుదప్రభ ॥
ఏవముక్త్వా గతో విష్ణోర్దేవో ఽ న్తర్ధానమీశ్వరః ॥ 7

*(శ్లో॥20-26,అధ్యా-25)*

కేశవా! ఈ కనపడే స్థావర జంగమాత్మకమైన ప్రపంచమంతా రుద్రనారాయణాత్మకం. నేను అగ్నినైతే నీవు సోముడివి. నేను ఉదయమైతే నీవు రాత్రివి. నీవు ఋతమైతే నేను సత్యాన్ని, నీవు క్రతుస్వరూపుడవైతే నేను దాని ఫలాన్ని, నీవు జ్ఞానానివైతే నేను జ్ఞేయాన్ని. నిన్ను ధ్యానించినవారు నీ నామాన్ని జపించినవారు నన్ను చేరుకుంటారు. నా అనుగ్రహాన్ని పొందుతారు. నీవు సంతోషిస్తే ప్రజలంతా మంచి కార్యాలు చేసే ఆసక్తిని పెంపొందించుకుంటారు. యుగాంతకాలంలో మన ఇద్దరితో కూడినదే మార్గం. మరో మార్గం లేదు. నన్ను నీవు ప్రకృతిగా–పురుషుడిగా గ్రహించు. నేను నీకు సగం శరీరాన్ని, అలాగే నీవు కూడా నాకు సగశరీరానివి. ఓ విష్ణూ నీవు నా హృదయానివి. అలాగే నీ హృదయంలో కూడా నేనున్నాను. నీవు సకల కార్యాలకీ కర్తవి. దానికి నేను దైవతాన్ని అని విష్ణువుతో పలికిన పరమేశ్వరుడు. బ్రహ్మని, విష్ణువుని ఆశీర్వదించి అక్కణ్ణుంచి అంతర్ధానమయ్యాడు.

## బ్రహ్మ నుంచి అక్షరాల ఆవిర్భావం

పూర్వం ప్రళయం సంభవించి అంతా ఒకే సముద్రంగా మారిపోయింది. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రజల్ని సృష్టించాలని భావించాడు. అయితే ఎలా సృష్టించాలో అతనికి స్ఫురించక చింతిస్తున్నాడు. సరిగ్గా అదే సమయంలో ఆయనకొక పుత్రుడు జన్మించాడు. పుట్టిన ఆ శిశువు దివ్య సుగంధాల్ని వెదజల్లుతూ, మధురంగా దివ్యమైన శ్రుతి (వేదాన్ని) ని ఉచరిస్తున్నాడు. శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం లేని ఆ శ్రుతిని చతుర్ముఖుడైన బ్రహ్మ విన్నాడు.

బ్రహ్మదేవుడు ఒక్కసారిగా ధ్యానంలోకి వెళ్ళాడు. భైరవుడైన శివుణ్ణి మనసులో నిలిపి ధ్యానిస్తుండగా మూడు రూపాలు కనిపించాయి. ఇవి ఏ రూపాలై ఉంటాయి అని ఆలోచిస్తుండగా, శబ్దస్పర్శ రూప రస గంధాలులేని ఒక అక్షరం ఆ ధ్యానంలో ప్రాదుర్భవించింది. అదే 'అ' అన్న అక్షరం. ఆ 'అ' అనే అక్షరంలో మహాపురుషుడైన సర్వేశ్వరుణ్ణి చూసాడు. అలా తనకు కనిపించిన అక్షరాన్ని చాలా కాలం ధ్యానించాడు బ్రహ్మ. ఆ విధంగా ధ్యానిస్తున్న బ్రహ్మ కంఠం నుంచి ఆ అక్షరం పైకి వెలువడింది. అది కేవలం ఒక మాత్రమే కలిగింది. ఆ వర్ణం తెల్లగా మెరిసిపోతుంది. చాలా నిర్మలంగా ఉంది. అది నాశనమేలేని పరమేశ్వరుడి స్వరూపం.

తరువాత బ్రహ్మదేవుడు తిరిగి ధ్యానం చేయటం ప్రారంభించాడు. అప్పుడాయనకి ధ్యానంలో ఎర్రని వర్ణంతో మొదటిసారిగా, మొదటి దేవుడు అనబడే ఋక్కు ఒకటి వినబడింది. అది "అగ్నిమీళేపురోహితం" అని ప్రారంభమయ్యే ఋగ్వేదప్రథమ ఋక్కు. లోకకారకుడైన బ్రహ్మ ఆ ఋక్కుని చూసి, విని అందులో ఉన్న అక్షరం ఏమిటి అని ఆలోచించసాగాడు. అప్పుడు "ఇషే త్వోర్జేత్వా వాయువస్థదేవో సవితాపునః అన్న యజుర్వేద ప్రారంభమంత్రం ఆవిర్భవించింది. తరువాత ఆయనకి ధ్యానంలో అ–ఉ అనే అక్షరాలతో పాటు మ్ అనే అక్షరం కూడా కనిపించి. అది 'ఓం' అనే ఏకాక్షరంగా మారింది. అప్పుడు మూడు మాత్రలతో కూడిన ఆ ఓంకారాన్ని తదేకంగా బ్రహ్మ ధ్యానించటం మొదలుపెట్టాడు.

ఆవిధంగా ఓంకారాన్ని ధ్యానిస్తుండగా ఆ ఓంకారం నుంచి ఒక ఋక్కు బయలుదేరింది. అదే 'అగ్న ఆయహీవీతయే గృహాణో హవ్యదాతయే" అనేది. ఆ విధంగా బ్రహ్మదేవుడు మూడు మాత్రలతో 'అ–ఉ–మ్' కూడిన ఓంకారాన్ని ఉదయం మధ్యాహ్నం సాయం సంధ్యల్లో ధ్యానించగా ఆ ధ్యానంలో తనకు స్ఫురించిన వేదాల్ని కూడా దర్శించాడు. బ్రహ్మ ధ్యానించిన ఆ ఓంకారం యజ్ఞ స్వరూపంగా, సాక్షాత్తు ఆ బ్రహ్మ స్వరూపంగా గుర్తించబడింది.

ఓంకారంలో ఉన్న మూడు మాత్రలూ బ్రహ్మ విష్ణు శివరూపాలు. మూడు మాత్రలు మూడు పదాలు, మూడు యోగాలు, మూడులోకాలు కలిగినది కనుకనే ఆ ఓంకారాన్ని బ్రహ్మ ఉపాసించాడు. ఆ విధంగా ఓంకారాన్ని ధ్యానించిన బ్రహ్మ ముఖంనుంచి పద్నాలుగు 'స్వర' వర్ణాలు ఆవిర్భవించాయి.

చతుర్ముఖ ముఖాత్తస్మాదజాయంత చతుర్దశ ।
నానావర్ణః స్వరా దివ్య మాద్యం తచ్చదక్షరమ్ ।
తస్మాత్త్రి షష్టివర్ణావై ఆకార ప్రభవాః స్మృతాః ॥ *(శ్లో॥28,అధ్యా-26)*

అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ, ఌ,ౡ, ఏ, ఐ,ఓ,ఔ అనే దివ్యమైన ఓంకారాక్షరాలు మొదట పుట్టాయి. ఈ పద్నాలుగు అక్షరాలనే స్వరాలని, స్వర వర్ణాలని, అచ్చులని అంటారు. తరువాత అకారాది క్రమంగా మొత్తం 63 వర్ణాలు పుట్టాయి.

తరువాత ఆ పద్నాలుగు వర్ణాల సాధారణార్థం కోసం బ్రహ్మ మొదటి అక్షరమైన 'అ' కార రూపంలో నిలిచాడు. అందుకే అది మొదటి స్వరం (అచ్చు) అయ్యింది. తరువాత ఆవిర్భవించిన మన్వంతరాలలో ఆ పద్నాలుగు స్వరాల నుంచీ పద్నాలుగు మంది మనువులు పుట్టారు. మొదటి పద్నాలుగు ముఖాలతో ఉన్న 'అ'కారం బ్రహ్మగా పిలవబడింది. ఆ బ్రహ్మ ఉన్న కల్పమే బ్రహ్మకల్పంగా ప్రసిద్ధి చెందింది.

**అ :** బ్రహ్మదేవుడి మొదటి ముఖం నుంచి అనగా 'అ'కారం నుంచి స్వాయంభువ మనువు పుట్టాడు (స్మరించబడ్డాడు). ఆయన బ్రహ్మ మనసు నుంచి జన్మించాడు కాబట్టి ఆయన లాగానే తెల్లటి వర్ణంతో ఉంటాడు.

**ఆ :** బ్రహ్మదేవుడి రెండో ముఖంనుంచి 'ఆ' కారం పుట్టింది (స్మరించబడింది). దాని నుంచి స్వారోచిష మనువు జన్మించాడు. ఆయన వర్ణం తెలుపు.

**ఇ :** బ్రహ్మదేవుడి మూడో ముఖంనుంచి యజుస్సులకి శ్రేష్ఠమైన 'ఇ'కారం పుట్టింది. అది యజువైన ఆదిత్యుడు. అతడి నుంచే యజుర్వేదం వచ్చినట్టుగా స్మరించబడింది. ఈ ముఖం నుంచే ఔత్తమ మనువు ఆవిర్భవించాడు.

**ఈ :** ఈకారం ఎర్రని వర్ణంతో ప్రతాపవంతుడైన మనువుగా ఆవిర్భవించింది. ఆ ఎర్రటి వర్ణంగల మనువునుంచే క్షత్రియజాతి బయలుదేరింది. అందుకే క్షత్రియులది ఎరుపువర్ణం.

**ఉ :** బ్రహ్మదేవుడి నాలుగో ముఖం నుంచి 'ఉ' కారం వచ్చింది. అది తామ్రవర్ణంలో ఉంటుంది (రాగిరంగు). ఆ రాగి రంగుగల 'ఉ'కారం నుంచి పుట్టినవాడే 'తామసు'డనే మనువు.

**ఊ :** బ్రహ్మదేవుడి అయిదో ముఖం నుంచి 'ఊ'కారం అనే స్వరం పుట్టింది. అది పచ్చటి రంగుతో ఉంటుంది. దాని నుంచి పుట్టిన మనువు రైవతుడు.

**ఓ :** బ్రహ్మదేవుడి ఆరోముఖం నుంచి కపిలవర్ణంతో ఉన్న 'ఓం' కారం పుట్టింది. దాని నుంచి మహాతపస్వి అయిన 'చాక్షుసుడు' అనే మనువు జన్మించాడు.

**ఋ :** బ్రహ్మదేవుడి ఏడోముఖం నుంచి నలుపురంగుతో కూడిన 'ఋ'కారం అనే స్వరం, దాని నుంచి వైవస్వత మనువు ఆవిర్భవించారు.

**ౠ :** బ్రహ్మదేవుడి ఎనిమిదోముఖం నుంచి నలుపువర్ణంతో 'ౠ' అనే స్వరం పుట్టింది. నలుపు వర్ణాన్నే శ్యామవర్ణం అంటారు. ఆ శ్యామవర్ణంతో సమానమైన వర్ణంగల 'సావర్ణి' అనే మనువు ౠకారం నుంచి జన్మించాడు.

**ఌ :** బ్రహ్మదేవుడి తొమ్మిదో ముఖం నుంచి 'ఌ' కారం ధూమ్రవర్ణంతో ఆవిర్భవించింది. ఆ ధూమ్రవర్ణ 'ఌ' కారం నుంచి దక్షసావర్ణి మనువు ఉదయించాడు.

**ౡ :** బ్రహ్మదేవుడి పదో ముఖం నుంచి 'ౡ' కారం ఆవిర్భవించింది. దాని నుంచి బ్రహ్మసావర్ణి అనే మనువు జన్మించాడు.

**ఏ :** బ్రహ్మదేవుడి పదకొండోముఖం నుంచి ఏకారం పిశంగవర్ణంలో ఆవిర్భవించింది. ఆ ఏకారం నుంచి 'ధర్మసావర్ణి' అనే మనువు జన్మించాడు.

**ఐ :** బ్రహ్మదేవుడి పన్నెండో ముఖం 'ఐ' కారం. అది పిశంగం, భస్మంతో సమానమైన కాంతి కలిగింది. ఆ ఐకారం నుంచి రుద్రసావర్ణి మనువు జన్మించారు.

**ఓ :** ఓకారం ఐదురంగులతో వుంటుంది. అది బ్రహ్మదేవుడి పదమూడో ముఖం నుంచి ఆవిర్భవించింది. దాని నుంచి రౌచ్యసావర్ణి మనువు పుట్టాడు.

**ఔ :** బ్రహ్మదేవుడి పద్నాలుగో ముఖం నుంచి ఔకారం పుట్టింది. అది కర్బూర చిత్ర వర్ణంతో వుంటుంది. దాని నుంచి భౌమ్యసావర్ణి మనువు ఆవిర్భవించాడు.

ఈ విధంగా బ్రహ్మదేవుడి పద్నాలుగు ముఖాల నుంచి పద్నాలుగు వర్ణాలు వాటినుంచి ఆ వర్ణాలతో సవర్ణులైన పద్నాలుగుమంది మనువులు ఆవిర్భవించారు.

## ఋషుల వంశాలు

**1. భృగుమహర్షి :** భృగుమహర్షికి 'శ్రీ' అనే కూతురు సకల ప్రాణులకీ శుభాల్ని చేకూర్చే వారు, సుఖదుఃఖాలకి ఈశ్వరులు, దేవతలు అయిన ధాత-విధాత అనే కుమారులు జన్మించారు. వీరిలో జ్యేష్ఠురాలైన 'శ్రీ' సుందరుడైన శ్రీమన్నారాయణుణ్ణి భర్తగా పొందింది. మహాసాధ్వి అయిన ఆ శ్రీదేవి ఎంతో మంది పుత్రుల్ని మానసికంగా కన్నది. ఎంతో మంది దేవతలు దివ్యలోకాల్లో చరించేవారు ఆమె పుత్రులుగా జన్మించారు. ఇక ధాత-విధాత ఇద్దరికీ ఆయతి-నియతి అనే ఇద్దరు భార్యలయ్యారు. వారిద్దరికీ పాండువు-మృకండుడు అనే వారు జన్మించారు. వారిద్దరూ బ్రహ్మజ్ఞానులు, సనాతనులు. వారిలో మృకండమహర్షికి మనస్విని అనే భార్యద్వారా మార్కండేయుడు జన్మించాడు. ఆ మార్కండేయుడికి 'మూర్ధన్య' అనే భార్య ద్వారా వేదశిరుడనే మహర్షి జన్మించాడు. తిరిగి ఆ వేదశిరుడికి 'పేవరి' అనే భార్య ద్వారా వశంకరులైన పుత్రులు జన్మించారు. వారంతా వేదవేదాంగాలని అభ్యసించి మహర్షులై మార్కండేయులుగా ప్రసిద్ధి చెందారు.

విధాతపుత్రుడైన 'పాండవు'కి పుండరీక అనే భార్యద్వారా ద్యుతిమంతుడు, సృజనానుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు. వారిద్దరికీ వంశపరంపరగా ఎంతో మంది పుత్రపౌత్రులు జన్మించారు. వీరంతా భృగు సంతానంగా కీర్తిగాంచారు. వీరంతా స్వాయం భువమన్వంతరానికి చెందినవారు.

**2. మరీచమహర్షి :** మరీచి ప్రజాపతి తన భార్య సంభూతి ద్వారా పూర్ణమాసుడనే కుమారుణ్ణి కన్నాడు. అలాగే కృష్టి, పుష్టి, త్విషా, అపచితి, శుభా అనే కుమార్తెల్ని

కూడా కన్నాడు. వారిలో పూర్ణమాసుడు, సరస్వతి అనే తన భార్య ద్వారా విరజుడు, సర్వసుడు అనే ఇద్దరు పుత్రుల్ని కన్నాడు. వారిలో విరజుడి కుమారుడైన సుధాముడనేవాడు విద్వాంసుడుగా పేరుపొందాడు. ఆసుధాముడి సుతుడైన 'వైరాజు'డనే వాడు తూర్పు దిక్కున ఆశ్రయం పొందాడు.

పూర్ణమాసుడి రెండో కుమారుడైన సర్వసుడు సర్వగణాలు, వారితత్త్వం తెలిసినవాడు. అతడు చక్కని ధర్మాత్ముడు, లోకపాలుడు, ప్రతాపవంతుడు. ఆ సర్వసుడు 'సర్వస' అనే తన భార్య ద్వారా యజనాముడైన శ్రీమంతుడు, కాశ్యపుడు అనే ఇద్దర్ని పుత్రులుగా పొందాడు. వారిద్దరికీ జన్మించిన పుత్రులు గోత్రాన్ని వృద్ధిచేసారు. ధర్మాత్ములుగా ప్రసిద్ధిచెందారు.

**3. అంగిరసమహర్షి :** అంగిరసుడి భార్య స్మతి. ఈ దంపతులకి భరతాగ్ని, కీర్తిమంతుడు అనే ఇద్దరు కుమారులు, సినీవాలి, కుహు, రాకా, అనుమతి అనే కుమార్తెలు జన్మించారు. వీరిలో భారతాగ్ని కుమారుడు పర్జన్యుడు. అతడు సంహుతి అనే కుమార్తెని, మారీచి అనే భార్య ద్వారా ప్రళయకాలం దాకా జీవించి ఉండే లోకపాలుడు అనే కుమారుణ్ణి కన్నాడు.

ఇక అంగిరసుడి రెండో కుమారుడైన కీర్తిమంతుడు ధేనుకు అనే తన భార్య ద్వారా వరిష్ఠుడు, ధృతిమంతుడు అనే ఇద్దరు పుత్రుల్ని కన్నాడు. వీరిద్దరూ అంగిరసుడి వంశంలో గొప్పవారు. తరువాత ఆ వరిష్ఠ ధృతిమంతులకి వంశపారంపర్య క్రమంలో ఎంతోమంది పుత్రపౌత్రులు జన్మించారు. అలా వారి వంశం విస్తరించింది.

**4. అత్రిమహర్షి :** అత్రిమహర్షి అనసూయద్వారా సత్యనేత్రుడు హవ్యుడు, అపోమూర్తి, శనీవురుడు, శముడు అనే అయిదుగురు పుత్రుల్ని కన్నాడు. స్వాయంభువమన్వంతరంలో ఒక యామం గడిచాక జన్మించిన వారందరూ ఆత్రేయులని కీర్తిపొందారు. అనసూయా అత్రి దంపతులకి 'శ్రుతి' అనే పుత్రిక కూడా జన్మించింది. ఆమె పురిహ ప్రజాపతి అయిన కర్దమమునిని వివాహం చేసుకుని శంఖపదుడనే పుత్రుణ్ణి కన్నది. ఆ తరువాత అత్రిపుత్రులైదుగురికి వంశపారంపర్యక్రమంలో పుత్రపౌత్రులు వేలకొద్దీ జన్మించారు. ఆ విధంగా లోకంలో అత్రివంశం విస్తరించింది.

**5. పులస్త్యమహర్షి :** పులస్త్య మహర్షికి ప్రీతి అనే తన భార్య ద్వారా దత్తాలి అనే కుమారుడు జన్మించాడు. పూర్వజన్మలో ఆ దత్తాలి స్వాయంభువ మన్వంతరంలో ఉన్న అగస్త్యుడు. ఈ దత్తాలితో పాటూ మధ్యముడు, దేవబాహువు, వినీతుడు అనే ముగ్గురు పుత్రలు వారితో పాటు సరస్వతి అనే కూతురు కూడా వారికి జన్మించింది. పర్జన్యుడి తల్లి అయిన శుభ్ర అనే ఆమెని కూడా పౌలస్త్యుడు వివాహం చేసుకున్నాడు. ధీమంతుడైన దత్తాలి తన భార్య ద్వారా సుజంఘుడు ఇంకా ఎంతోమంది పుత్రుల్ని కన్నది. వారంతా స్వాయంభువ మన్వంతరంలో పౌలస్త్యులుగా ప్రసిద్ధి చెందారు.

**6. పులహమహర్షి :** పులహప్రజాపతి క్షమ అనే తన భార్య ద్వారా అగ్ని తేజస్కులు, కీర్తిమంతులు అయిన ముగ్గురు పుత్రుల్ని కన్నాడు. వారే కర్దముడు, అంబరీషుడు, సహిష్ణుడు, ఋతువు, ధనకసీవానుడు. వీరితోపాటూ కన్యపీరి అనే కూతురు కూడా ఆ దంపతులకి జన్మించారు.

వీరిలో కర్దముడు ఆత్రేయి (శ్రుతి) అనే తన భార్య కూడా శంఖపదుడనే పుత్రుణ్ణి, కామ్య అనే కుమార్తెని కన్నాడు. తదనంతర కాలంలో ఆ శంఖపదుడే లోకపాలుడై ప్రజాపతి అయ్యాడు. కర్దమ ప్రజాపతి దక్షిణ ప్రాంతానికి వెళ్ళాలనే కోరికతో తన కుమార్తె 'కన్యని', దక్షిణ ప్రాంతవాసి అయిన ప్రియవ్రతుడికిచ్చివివాహం జరిపించాడు. ఆ కామ్య ప్రియవ్రతుడి ద్వారా స్వయంభువైన బ్రహ్మతో సమానులైన పదిమంది పుత్రుల్ని వారితో పాటు ఇద్దరు పుత్రికల్ని కన్నది. వారందరివల్లా క్షత్రియజాతి లోకంలో బాగా విస్తరించింది.

కర్దముడి పుత్రుడైన ధనసీనుడు గొప్ప సహనశీలిగా పేరుపొందాడు. ఆయన సమధ్యముడైన (అందగాడైన) కామదేవుడనే పుత్రుణ్ణి కన్నాడు. ఆ తరువాత కర్దముడి మరో కుమారుడైన ఋతువుకి 'క్రతుసముడు' అనే పుత్రుడు జన్మించాడు. ఆ క్రతుసముడికి అరవైవేలమంది సంతానం కలిగారు. వారెవ్వరికీ భార్యలు పుత్రులు లేరు. వారంతా నివృత్తిపరులై వాలఖిల్యాది మహర్షులని పేరుగాంచారు. వారు సూర్యుడివెంట మహాభూతప్రళయం వచ్చేంతవరకూ సంచరిస్తూనే ఉంటారు.

**7. వశిష్ఠమహర్షి :** వశిష్ఠుడికి ఊర్జ అనే భార్య ద్వారా ఏడుగురు పుత్రులు, వారితోపాటు పుండరీక అనే కుమార్తె జన్మించారు. ఆ పుండరీక ద్యుమంతుణ్ణి వివాహం చేసుకుంది. కాలక్రమంలో పుండరీకాద్యుమంతుల దంపతులకి 1.రజసుడు 2.పుత్రుడు 3.అర్ధబాహు 4.సవనుడు 5.ఆదనుడు 6.సుతపుడు 7.శుక్లుడు అనే ఏడుగురు పుత్రులుదయించారు. వీరంతా సప్తర్షులుగా విఖ్యాతి పొందారు. వీరిలో రజసుడనే ఋషి మార్కండేయ ద్వారా యశస్విని అనే ఆమెని, తూర్పు దిక్కు ద్వారా క్షత్రియుడు ప్రజాపతి అయిన కేతుమంతుణ్ణి కన్నాడు. వారి నుంచి క్రమంగా వశిష్ఠుడి వంశం పుత్రపౌత్రాదులతో విస్తరించింది. వీరందరి సంతానంతో స్వాయంభువ మన్వంతరం మొత్తం గడిచిపోయింది.

## ఋతువులు

పూర్వం స్వాయంభువ మన్వంతరంలో బ్రహ్మదేవుడు తన నూతన సృష్టిని ప్రారంభించాడు. ఆయన ముఖం నుంచి జలాలు, మనుషులు, అసురులు జన్మించారు. వారితోపాటు పితరులు, వసంత, గ్రీష్మ, వర్ష, హేమంత, శశిర ఋతువులు కూడా ఆవిర్భవించాయి. ఋతువుల్నే "ఋతవఃపితరో దేవాః" పితరులుగా కూడా చెబుతారు.

ఋతువులుగా చెప్పబడ్డ పితృదేవతలు, అగ్నిష్వాత్తులని, బర్హిషదులని రెండు విధాలుగా వ్యవహరించబడ్డారు. వారిలో అగ్నిష్వాత్తులు అనబడే పితృదేవతలు, అనాహితాగ్ని పితరులుగా, వారిలో భాగమైన యజ్వానులనేవారు సోమపానాన్ని చేసే పితురులుగా వుండగా, బర్హిషదులనే పితృదేవతలు అగ్నిహోత్రులైన వారుగా చెప్పబడ్డారు.

**ఋతువులు :** చైత్రవైశాఖ మాసాలు రెండూ కలిపి వసంత ఋతువుగా తెలుసుకోవాలి. అలాగే జ్యేష్ఠ ఆషాఢమాసాలు గ్రీష్మ ఋతువుగా, శ్రావణ భాద్రపద మాసాలు వర్షఋతువుగా, ఆశ్వయుజకార్తీక మాసాలు శరదృతువుగా, మార్గశిర పుష్యమాసాలు హేమంత ఋతువుగా, మాఘపాల్గుణాలు శిశిర ఋతువుగా చెప్పబడ్డాయి. ఈ ఋతువులన్నీ చేతనాలు, అలాగే అచేతనాలు కూడా.

ఆరుఋతువులూ బ్రహ్మదేవుడి పుత్రులు. పగళ్ళు, రాత్రుళ్ళు, నెలలు, ఋతువులు, ఆయనాలు, సంవత్సరాలు, కాలావస్థని తెలిపే విషయాలు. ప్రతిరోజూ వచ్చే తిథులు, సంధ్యలు, పక్షాలు(15రోజులు) అనేవి 'నెల'లోని భాగాలు. రెండు పక్షాలు ఒకనెల (మాసం) రెండు నెలలు (మాసాలు) ఒక ఋతువు. మూడు ఋతువులు (ఆరునెలలు) ఒక ఆయనం. రెండు ఆయనాలు (12 నెలలు) ఒక సంవత్సరం. ఇవి దేవతల స్థానాలు.

ఎవరైతే ప్రజాపతి అని చెప్పబడుతున్నాడో అతడే సంవత్సరుడు (సంవత్సరస్వరూపుడు) గా చెప్పబడ్డాడు. ఆ సంవత్సరుణ్ణే 'అగ్ని' అని, 'ఋతం' అని కూడా తలుస్తారు. ఋతువులన్నీ ఆ ఋతం (సంవత్సరం)నుంచి పుట్టినందువల్ల, ఋతువులనుంచి మాసాలు పుట్టాయని తెలుసుకోవాలి.

## దక్షుడి వృత్తాంతం

పూర్వం జ్యోతిష్కం అనే పేరుతో సూర్య సంబంధం కలిగి, రత్నాలతో అలంకరించబడ్డ మేరు పర్వత శిఖరం ఉన్నది. ఆ దివ్య శిఖరం ఎంతో ఉన్నతమైంది. సకలలోక వాసుల చేతా నమస్కరించ తగింది. వివిధ రకాల ధాతువులతో, మణిమాణిక్యాలతో అలంకరించబడ్డ ఆ పర్వతం మీద మహాదేవుడైన పరమేశ్వరుడు చిద్విలాసంగా ఆసీనుడై ఉన్నాడు. దక్షుడి కుమార్తె సతీదేవి ఆయన ప్రక్కనే ఆసీనురాలై ఉంది.

దివ్య శోభలతో ప్రకాశిస్తున్న ఆ సతీపరమేశ్వరుల్ని మహాత్ములైన ద్వాదశ ఆదిత్యులు, అష్టవసువులు, వైద్య శ్రేష్ఠులైన అశ్వినీదేవతలు, యక్షపరివారం, యక్షరాజ్యాధిపతి కుబేరుడు, మహామునిగా ప్రసిద్ధి చెందిన ఉశనుడు (శుక్రుడు) సనత్కుమారాది మహర్షులు, అంగిరసాది సప్తర్షులు, విశ్వావసువు లాంటి గంధర్వులు, ఇంకా ఎంతోమంది దేవాసుర గణాలన్నీ ఆయన్ని సేవిస్తున్నారు. వారితో పాటు సిద్ధులు, సాధ్యులు, తపోధనులు, విద్యాధరులు, ఋతువులు కూడా ఆయన్ని సేవిస్తు స్తుతిస్తున్నారు. నదులన్నిటిలో గొప్పదైన గంగానది కూడా ఆ దివ్య దంపతుల్ని సేవించటానికి అక్కడికి వచ్చింది. ఈ విధంగా మహాదేవుడు సకలదేవతల చేతా నిత్యం సేవించబడుతూ కొలువుదీరి ఉన్నాడు.

సతీదేవి తండ్రి దక్ష ప్రజాపతి ఒకనాడాయన గంగాద్వారం ప్రాంతంలో దివ్యమైన యజ్ఞాన్ని ప్రారంభించాడు. దక్షుడు తన యజ్ఞానికి రావలసిందిగా ఇంద్రాది సకలదేవతలకీ ఆహ్వానాలు పంపించాడు. ఆయన ఆహ్వానాన్ని అందుకున్న సకలలోక వాసులంతా తమ తమ దివ్యవిమానాల నెక్కి దక్షుడి యాగాన్ని దర్శించటానికి కోలాహలంగా బయలుదేరారు. వారందరి విమానాలతో ఆకాశమండలమంతా నిండి పోయింది. ఇంతమందిని ఆహ్వానించిన దక్షుడు గత జన్మలవైరం కారణంగా తన అల్లుడు కూతురైన సతీశంకరుల్ని యజ్ఞానికి ఆహ్వానించలేదు.

దక్షుడి యాగశాల ప్రాంగణానికి వేలాది దేతలు విచ్చేసారు. వారందర్నీ అక్కడున్న దధీచిమహర్షి చూసాడు. సతీ శంకరులు ఆయనకి కనిపించలేదు. యోగదృష్టి ద్వారా దక్షుడు వారిద్దర్నీ ఆహ్వానించలేదని తెలుసుకున్నాడు. వెంటనే ఆయనకి దక్షుడిమీద ఆగ్రహం కలిగింది. దక్షుణ్ణి పిలిచి ఓ దక్షప్రజాపతీ!

అపూజ్యపూజనే చైవ పూజ్యానాం చాప్యపూజనే ।
నరః పాపమవాప్నోతి మహద్వైనాత్ర సంశయః ॥ *(శ్లో॥103, అధ్యా-30)*

ఏ నరులైతే పూజించ తగనవాణ్ణి పూజిస్తారో, పూజించ తగినవాణ్ణి పూజించరో వారు మహాపాపాన్ని పొందుతారు. ఇందుకు ఏమాత్రం సందేహం లేదు. దక్షా! నీవు పశుపతిని ఎందుకు ఈ యజ్ఞానికి ఆహ్వానించలేదు? అని అడిగాడు. దధీచి మాట విన్న దక్షుడు.

దధీచిమహర్షీ! శూలాలు జటలు ధరించిన రుద్రులు ఎంతోమంది ఉన్నారు. వారంతా కలిపి పదకొండుమంది. వారిలో మహేశ్వరుణ్ణి నేను ప్రత్యేకమైనవాడుగా భావించటంలేదు అన్నాడు. నీమాటలు సరికాదు. శంకరుడు లోకపూజ్యుడు. ఆదిదైవం. ఆయన లేని నీ యాగం ఫలవంతంకాదు. ఇలాంటి చోట నేనుండటం మంచిదికాదు. శివుడు లేని ఏ కార్యం శుభప్రదం కాదు. కనుక నేను ఈ యాగం నుంచి నిష్క్రమిస్తున్నాను" అని చెప్పి కోపంగా వెళ్ళిపోయాడు దధీచి మహర్షి.

సతీదేవి ఆకాశంలో తిరుగుతున్న దేవతల విమానాలు చూసింది. అందరూ సంతోషంగా ఉల్లాసంగా వెళ్ళుతున్నారు. వెంటనే శివుడితో "ప్రభూ! విమానాలెక్కి ఆ దేవతలంతా ఎక్కడికి వెళ్తున్నారు" అనడిగింది. అప్పుడు శివుడు సతీ! నీ తండ్రి దక్షప్రజాపతి మహత్తరమైన యాగం చేస్తున్నాడు. దాన్ని దర్శించటానికి దేవతలందరికీ ఆహ్వానం పంపాడు. అందుకే వాళ్ళంతా అలా కోలాహలంగా వెళుతున్నారు అని చెప్పాడు. స్వామీ! మరితమరెందుకు వెళ్ళటంలేదు అని అడిగింది. దేవీ! దక్షుడికి నేనంటే సరిపడదు. నా మీద అకారణంగా విరోధం పెంచుకున్నాడు. అందుకే నన్ను నిన్ను ఆహ్వానించలేదు. ఆహ్వానం లేని చోటికి వెళ్ళి అవమానపడటం ఎందుకు? అందుకే నేను వెళ్ళటం లేదని సమాధానం చెప్పాడు.

సతీదేవికి మనసులో ఎలాగైనా నా తండ్రి చేసే యాగానికి వెళ్ళాలని అనిపించింది. ఉండబట్టలేక ఆ విషయాన్ని శివుడికి నివేదించి సతీదేవి కోరిక విన్న శివుడు ఆమె మాటని కాదన లేక దక్షుడు చేసే యాగానికి వెళ్ళమని పంపించాడు.

ప్రమథగణాల్ని వీరభద్రుణ్ణితోడు తీసుకుని సతీదేవి దక్షుడు చేసే యజ్ఞ ప్రాంగణానికి వచ్చింది. తన పరివారాన్నంతా వెలుపలే ఉంచి యాగ ప్రాంగణం లోపలికి తానొక్కటే వెళ్ళింది. లోపల అంతా సందడిగా ఉంది. ఎంతో మంది దేవతలు ఋషులు, మహర్షులు అతిథులుగా విచ్చేసారు. తన తండ్రి దక్షుడు వారందర్నీ స్వయంగా ఆహ్వానించి యథోచితంగా అందరికీ అతిథి మర్యాదలు చేస్తున్నాడు. సతీదేవి వచ్చిన విషయం ఆయన గమనించి కూడా ఉద్దేశపూర్వకంగా ఆమెని లోపలికి రమ్మని కూడా ఆహ్వానించలేదు. కనీసం పలకరించలేదు కూడా. పైగా కొంతసేపటికి శంకరుణ్ణి నలుగురు ముందూ సతీదేవి వినేలా అవమానకరంగా మాట్లాడాడు. అంతా విన్న సతీదేవికి దుఃఖం ముంచుకొచ్చింది. తన తండ్రి చేసిన అవమానానికి, తన భర్త శంకరుణ్ణి అవమానించి నందుకు ఆమె ఆవేశంతో రగిలిపోయింది. వెంటనే యాగాగ్నిని సృష్టించుకొని అందులో తనను తానే సమర్పించుకుని భస్మమైపోయింది.

దక్షుడి చేత అవమానించబడి సతీదేవి ఆత్మాహుతి చేసుకుందన్న విషయం శంకరుడికి తెలిసింది. ఆయన ఆ మాట విని ఆగ్రహోదగ్రుడయ్యాడు. వీరభద్రుణ్ణి పిలిచి దక్షయాగాన్ని విధ్వంసం చేయమని ఆజ్ఞాపించాడు. అంతే ఒక్కసారిగా మహాభూతగణాలతో వీరభద్రుడు దక్షయజ్ఞవాటిక మీద విరుచుకుపడ్డాడు. అందిన వార్ని అందినట్టు చిత్రహింసలకు గురిచేసాడు. ప్రమథగణాలు యాగానికి వచ్చిన వారందర్నీ తరిమికొట్టారు. ఆ యాగశాలలో ఉన్న అన్ని వస్తువుల్నీ ధ్వంసం చేసారు.

వీరభద్రుడి విజృంభణ తట్టుకోలేక యాగానికి వచ్చిన దేవతలు ఋషులు, తలోదిక్కుకీ ప్రాణాలరచేతిలో పెట్టుకుని పారిపోయారు. దక్షుడు కూడా ఒక లేడి రూపాన్ని ధరించి పరుగెత్తటం ప్రారంభించాడు. అది గ్రహించిన వీరభద్రుడు ఆకాశమంతా వ్యాపించి ఆకాశమార్గంలో పరుగెత్తుతున్న దక్షుడి తలని ఒక్కవేటుతో ఖండించేసాడు.

ఆ విధంగా వీరభద్రుడి చేత శిరస్సు ఖండించబడగా దక్షుడి మొండెం భూమిమీద పడింది. మిగిలిన దేవతలంతా వీరభద్రుడి పాశంతో బంధించబడ్డారు. కొంతసేపటికి ఇంద్రాది దేవతలంతా వీరభద్రుడి దగ్గరకొచ్చి పరిపరివిధాలుగా స్తుతించి ఆయన్ని శాంతపరిచారు. వారి ప్రార్థనలువిన్న వీరభద్రుడు క్రమంగా శాంతించాడు. అప్పుడు దేవతలంతా కలిసి ఒక మేక తలని తెచ్చి దక్షుడికి అతికించి అతన్ని పునర్జీవితుణ్ణి చేసారు.

పునర్జన్మ పొందిన దక్షుడు, బ్రహ్మ విష్ణ్వాదిదేవతలంతా తిరిగి వీరభద్రుణ్ణి ఘనంగా స్తుతించి "ప్రభూ! తమరెవరు? అని వినయంగా ప్రశ్నించారు. అప్పుడు వీరభద్రుడు "దేవతలారా! శివుడి క్రోధం నుంచి నేను ఆవిర్భవించాను. నా పేరు వీరభద్రుడు, నాలాగానే ఆయన కోపం నుంచి ఆవిర్భవించిన ఈమె భద్రకాళి. మేమిద్దరం దక్షయజ్ఞ వినాశనం కోసమే సృష్టించబడ్డాం. మేం వచ్చిన పని అయిపోయింది. మీరంతా నన్ను కాదు. నన్ను సృష్టించిన ఆ పరమేశ్వరుణ్ణి శరణువేడండి" అని పలికాడు.

వీరభద్రుడి బోధ విన్న దేవతలకి జ్ఞానోదయమైంది. దక్షుడితో సహా అందరూ హృదయపూర్వకంగా తమని క్షమించమని శంకరుణ్ణి ప్రార్థించారు. వారు ప్రార్థించిన కొద్ది సేపటికి వెలిగిపోతున్న పరమేశ్వరుడు బైటికి వచ్చాడు. ఎంతో దీనంగా తననే స్తుతిస్తూ కన్నీళ్ళు పెట్టుకున్న దక్షుణ్ణి చూసాడు. అతడితో దక్షా! నీ అజ్ఞానం వల్ల ఇంతగొప్ప యాగం ధ్వంసమైపోయింది. ఇప్పటకి నీకు జ్ఞానోదయమైంది. నా తత్త్వాన్ని గ్రహించగలిగావు. నీ వినయానికి పశ్చాత్తాపానికి నేనెంతో ప్రసన్నుడనయ్యాను. నీకేం కావాలో కోరుకో అన్నాడు.

శివుడి ఆదరపూర్వకమైన మాటలు విన్నాక దక్షుడికి ఎంతో ఆనందం కలిగింది. తిరిగి ఎంతో భయభక్తులతో ఆయనకి నమస్కరించి "ప్రభూ! నేనెంతో కష్టపడి ఎన్నో రోజులు శ్రమించి ఈ యజ్ఞ సంభారాలన్నీ సమకూర్చుకున్నాను. అదంతా ఇప్పుడు నాశనమైంది. తిరిగి వాటిని సమకూర్చుకునే శక్తి నాకు లేదు. కనుక ఇక్కడ ధ్వంసమైనవన్నీ తిరిగి అలాగే నాకు లభించాలి. ఇదే నేను కోరే వరం" అని అడిగాడు. తథాస్తు అలాగే జరుగుగాక! అని శివుడు వరమిచ్చాడు. ఇక ఆనందం పట్టలేక దక్షుడు అమాంతం ఆయన పాదాలమీద పడిపోయి అష్ట సహస్రనామాలతో  పరమేశ్వరుణ్ణి అనన్య భక్తితో దివ్యనామాలతో స్తుతించాడు.

దక్షుడి స్తుతి విన్న శంభుడు సంపూర్ణంగా ప్రసన్నుడై దక్షా! ఎంతో భక్తిభావంతో నీవు చేసిన స్తోత్రంతో నేనెంతో సంతృప్తి చెందాను. నీ యజ్ఞం విధ్వంసమైందని బాధపడకు. అనుగ్రహిస్తున్నాను. నేటినుంచీ నీవు వెయ్యి అశ్వమేధ యాగాలు, వంద వాజపేయ యాగాలు నిర్వహించిన పుణ్యఫలాన్ని పొందుతావు. ఓ దక్ష ప్రజాపతీ! నేను వేదాల్ని, వేదాంగాల్ని, సాంఖ్యా, యోగాన్ని సంపూర్ణంగా ఉద్ధరించి, దేవదానవులెవరూ చేయలేని మహత్తరమైన తపస్సు ఆచరించి, సకల పాపాల్నీ తొలగించే 'పాశుపతవ్రతాన్ని' ఏర్పరిచాను. ఆ వ్రతంలో ప్రధాన విషయంఏమిటంటే సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన మంత్రాలు ఉచ్చరించి భస్మాన్ని తీసుకోవాలి.

తరువాత దాన్ని "త్ర్యయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుక మివ బంధనాన్మృత్యో ర్ముక్షీయమామృతాత్" అనే మంత్రం చెప్పి నీళ్ళతో తడిపి నుదుట, శరీరం మీద ధరించాలి.

దక్షా! పాశుపతవ్రతంలో ప్రధాన విషయం భస్మధారణే కనుక దీన్ని నీవు నియమంగా ఆచరించు. ఈ దివ్య వ్రతం నీకేకాదు. మానవులందరికీ అని ఆశ్రమాలవారికీ ఆచరణయోగ్యమైనది. ఈ వ్రతాన్ని ఆచరించటం వల్ల జీవులు చేసే పాపాలన్నీ తొలగిపోతాయి. నీకు శుభం కలుగుగాక! అని ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు శివుడు.

## శివజ్వరోత్పత్తి

పూర్వం పరమేశ్వరుడి చమట బిందువు రాలి క్రిందపడి అది ఒకవిధమైన జ్వరంగా రూపొందింది. ఆ జ్వరమే దక్షుడి యజ్ఞాన్ని ధ్వంసంచేసింది. ఆ తరువాత అదే జ్వరాన్ని పరమేశ్వరుడు ఎన్నో రకాలుగా విభాగించాడు. అది ఎలాగంటే?

ఏనుగులకి తలనొప్పిగా, పర్వతాలకి శిలాజిత్తు కారటం ద్వారా, నీటికి నాచుపట్టటం, పాముకి కుబుసం, ఎద్దులకి కుంటితనం (కాలిరోగం), భూమికి చేటు కలగటం, పశువులకి కంటిచూపు లోపించడం, గుర్రాలకి గొంతులో పుండు లేవడం, నెమళ్ళకి పింఛాలు రాలిపోవటం, కోకిలలకి కంటి జబ్బురావటం, మేకలకి గొర్రెలకి ఒక విధమైన పిత్తం కలగడం, చిలుకలకి మంచు బాధకలగటం, ఇవన్నీ జ్వరాలుగా శివుడి చేత ఏర్పాటు చేయబడ్డాయి. ఇక మనుషుల విషయానికి వస్తే మనిషి పుట్టిన దగ్గర్నుంచి మరణించే వరకు మధ్యలో ఎపుడైనా అతడికి జ్వరం కలుగుతుంది. జ్వరం అంటే భయంకరమైన తేజస్సు (వేడి) అని అర్థం. ఈ జ్వరం సాక్షత్తు శివస్వరూపం కనుక అందరూ జ్వరాన్ని గౌరవించాలి.

ఎవరైతే ఏకాగ్రచిత్తంతో ఈ జ్వరోత్పత్తి విషయాన్ని చదువుతాడో వాడు సకల రోగాల నుంచీ విముక్తుడై సంతోషంగా జీవిస్తాడు. అలాగే దక్షుడు చేసిన శివనామ స్తోత్రాన్ని ఎవడైతే శ్రద్ధా భక్తులతో వింటాడో, లేక పఠిస్తాడో,

వాటికి ఎలాంటి వ్యాధులూ రావు. దీర్ఘాయువు పొందుతాడు. ఈ శివనామ స్తుతిని భక్తిగా పారాయణ చేసే స్త్రీ, తన తండ్రి పక్షం వారితో, భర్త పక్షం వారితో అత్యధికంగా గౌరవించ బడుతుంది. ఈ స్తోత్రాన్ని మొత్తం పఠించిన వారికీ, బోధించిన వారికీ సకల కార్యాలూ నిర్విఘ్నంగా కొనసాగుతాయి.

## యుగధర్మ నిరూపణం

ఓంకారం అక్షరూప పరబ్రహ్మం. అది ఎప్పుడూ నశించనిది. అది మూడు వర్ణాలతో కూడుకున్నది. ఆ ఓంకారం నుంచే దేవతలు ఋక్కులు, యజస్సులు, సామాలు, (ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం) వాయువు, అగ్ని, జలం అనే మూడు భూతాలు, వారితో పాటు దేవతలకే దేవతలైన 14మంది మహాపురుషులు కూడా పుట్టారు. వారందరిలో ఉన్నవాడు, సృష్టి అంతటా కూడా వ్యాపించినవాడు, సమస్త యోగాలనీ తెలిసినవాడు అయిన మహాదేవుడు, లోకాల్ని అనుగ్రహించటం కోసం ఆది మధ్యాంతర హితుడయ్యాడని పండితులు చెబుతారు.

మహేశ్వరాత్మకమైన ఆ ఓంకారం నుంచే సప్తర్షులు, పితృదేవతలు, దేవతలు అవిర్భవించారు. ఇక కృత-త్రేతా-ద్వాపర-కలియుగాలనే పేరుతో కాలచక్రం తిరగటం ప్రారంభించింది. అప్పుడు దేవతలందరూ కాలాన్ని చూసి ఎంతో భయపడ్డారు. అయితే ఆ కాలాన్ని వారు ఏ మాత్రం కొలవలేక పోయారు. అలా కాలానికి భయపడిన ఋషులు, మునులు, దేవతలు, ఇంద్రుడూ అంతా కలిసివేయి సంవత్సరాలు తీవ్రంగా తపస్సు చేసి పరమేశ్వరుణ్ణి శరణు వేడారు. వారికి నాలుగు ముఖాలతో కాలుడు దర్శనమిచ్చాడు. ఆ కాలుణ్ణి దర్శించిన దేవతలు, మహాదేవుడితో "స్వామీ! ఎంతో లోతైన ఈ కాలాన్ని ఎవరు తెలుసుకోగలరు? ఈ కాలుణ్ణి చూస్తే మాకెంతో భయం కలుగుతోంది" అని అన్నారు. అపుడు శివుడు కూడా ఆ కాల పురుషుణ్ణి స్పష్టంగా చూసాడు. దేవతలతో " మీరెవ్వరూ భయపడకండి" అని అభయమిచ్చాడు. తిరిగి వారితో-

దేవతలారా! ఈ కాలుణ్ణి జయించటం ఎవరికీ సాధ్యంకాదు. ఇతడికున్న నాలుగు ముఖాలు నాలుగుయుగాలు. ఇతడి మొదటి ముఖం తెల్లగా నాలుగు

నాలుకలతో కనిపిస్తోంది. ఇది కృతయుగం. అలాగే రెండో ముఖం ఎర్రనికాంతితో ప్రకాశిస్తూ మూడు నాలుకలతో కనిపిస్తోంది. అది త్రేతాయుగం. ఈ యుగంలో మూడు ఉంటాయి. ఈ అగ్నులు మూడూ వ్రేల్చబడి జిహ్వ ప్రవర్తిస్తూ వుంటుంది. ఇక రెండు నాలుకలతో, ఎరుపు గోరోచనం లాంటి రంగు కలిగిన ముఖంతో రెండు పాదాలతో ఉండేది ద్వాపరయుగం. ఆ యుగంలో నేను కొలువుంటాను. దీని తరువాత నల్లగా ఎర్రగా మెరిసే కళ్ళు, ఒక నాలుకతో ఉన్న ఆ కాలపురుషుడి నాలుగో ముఖం నుంచి ఘోరమైన, భయంకరమైన కలియుగం ఆవిర్భవించింది. ఆ కలియుగంలో ప్రజలందరూ కాలానికి వశులై ఉంటారు.

దేవతలారా! కృతయుగంలో బ్రహ్మదే అగ్రస్థానం. ఆయన ఆకాలంలో అందరిచేతా పూజించబడతాడు. త్రేతాయుగంలో యజ్ఞం పూజనీయ స్థానాన్ని పొందుతుంది. అందరూ యజ్ఞాన్ని ఆచరించటం ద్వారా దాన్ని గౌరవిస్తారు. ద్వాపయుగంలో శ్రీమహావిష్ణువు అవతరించి జగత్తుచేత పూజలందుకుంటాడు. ఇక సర్వేశ్వరుడనైన నేను పై మూడు యుగాలతో పాటు కలియుగంలో కూడా అందరి చేతా పూజించబడతాను.

బ్రహ్మ-విష్ణువు-యజ్ఞం అనే మూడూ కాలానికి చెందిన మూడు కళలు. అన్ని కాలాలలో చతుర్ముఖుడైన కాల స్వరూపుడుగా నేను జన్మించి, ఆ కాలాల్ని ప్రవర్తిం చేస్తూ, ఆ యుగానికి కర్తగా ఉంటాను. సురోత్తములారా! నేను కలియుగాన్ని పొంది, లోకాలన్నిటికీ హితం చేకూర్చటం కోసం కాలంగా అవతరిస్తాను. ఆ విధంగా అవతరించిన నేను దేవ మానవలోకాలచేత పూజించబడతాను. తేజోవంతులారా! మీరు కలియుగం గురించి భయపడకండి" అని అన్నాడు. పరమేశ్వరుడి మాటలు విన్న దేవతలు ధైర్యం తెచ్చుకుని ఆయనతో ప్రభూ! తమరు చెప్పిన మహాతేజస్వి, సకల భూతాలకీ భయంకరుడైన ఆ కాలుడు (పురుషుడు) నాలుగు ముఖాలతో ఎలా ఉన్నాడు? అని ప్రశ్నించాడు.

దేవతలారా! ఈ కాలపురుషుడు నాలుగు ఆకారాలు కలిగినవాడు. అతడికి నాలుగు కోరలు, నాలుగు ముఖాలు ఉంటాయి. లోక సంరక్షణ కోసం అతడు నిరంతరం సంచరిస్తూ ఉంటాడు. ఈ ప్రపంచంతో అతడికి

అసాధ్యమైనదేదీ లేదు. ఆ కాలపురుషుడే (కాలమే) సకలభూతాల్నీ (జీవుల్ని) సృష్టించి తిరిగి అదే క్రమంగా వాటిని సంహరిస్తుంది. లోకంలో అందరూ కాలానికి వశమై నడుచుకోవాలే తప్ప కాలం ఎవ్వరి వశంలో ఉండదు.

సర్వేకాలస్యవశగాః నకాలః కస్యచిద్వశే ।
తస్మాత్తు సర్వభూతాని కాలః కలయతే సదా ॥ *(శ్లో॥30, అధ్యా-32)*

ఈ కాలమే సమస్త భూతాలనీ తమ తమ పనుల్లో ప్రవర్తిల్లేలా చేస్తుంది. ఈ కాల పురుషుడి వీరోచితమైన గమనంలో పూర్వం చెప్పిన డెబ్భైఒక్క పదాల కాలం గడిచేసరికి ఒక మన్వంతరం గడిచిపోయి చివరికది నశిస్తుంది. ఈవిధంగా మహాదేవుడైన పరమేశ్వరుడు కాలపురుషుడి స్వరూపాన్ని స్వభావాన్ని దేవతలకి వివరించి అంతర్ధానమయ్యాడు.

మహాదేవుడే కాల స్వరూపుడు. యుగాంతంలో ఆయనే దేవతల్ని పితృదేవతల్ని మానవుల్ని మళ్ళీ మళ్ళీ సంహరిస్తూ ఉంటాడు. తిరిగి వారిని మళ్ళీ మళ్ళీ పుట్టిస్తూ వుంటాడు. అందుకే అందరూ కాలరూపుడైన పరమేశ్వరుణ్ణి భక్తిగా పూజించాలి.

## పర్వతాలు - దేవతలు

**1.మహాశీతశైలం :** ఈ పర్వతం ఎంతో శీతలంగా మంచుతో నిండి ఉంటుంది. ఎన్నో రకాల ప్రాణులకి చిత్ర విచిత్రమైన వృక్షాలకి, వివిధరకాల మణులకి, రత్నాలకి అది నివాసస్థానం. ఆ పర్వతం మీద ఎన్నో సుందరమైన వనాలున్నాయి. బంగారు వెదురు వృక్షాలు మెరుస్తుంటాయి. అందమైన పూలలతలతో, తీగలతో ఆ పర్వతం మీదున్న ఉద్యానవనాలన్నీ వింత శోభలతో వెలుగొందుతున్నాయి. తీయగా నిర్మలంగా ఉండే నీటి సరస్సులు, చిన్న చిన్న జలపాతాలు, సెలయేర్లు అక్కడ ప్రవహిస్తున్నాయి.

ఆ పర్వతం మీద కిన్నరులు, యక్షులు, గంధర్వులు, సంచరించే అందమైన గుహలున్నాయి. అక్కడే మహేంద్రుడు నిత్యం సంచరించే క్రీడావనం కూడా వుంది. దానికి సమీపంలోనే దివ్యమైన పుష్పాలతో శోభించే పారిజాత వనం కూడా వున్నది.

సకల శుభలక్షణాలతో, సమశీతోష్ణమైన వాతావరణంతో, జీవుల శరీరాలకి సుఖాన్ని, హాయిని, మనసుకి ఆనందాన్ని ఆ మహాశీతశైలం కలిగిస్తుంది. ఆ పర్వతం మీదున్న ఇంద్రవనంలో దేవతలు దానవులు, పన్నగులు (సర్పజాతులు) యక్షులు, రాక్షసులు, గుహ్యకులు, విద్యాధరులు, సిద్ధులు, కిన్నరులు ఎంతో సంతోషంగా అప్సరస్త్రీలతో కలిసి విహరిస్తుంటారు. ఎంతో విశాలంగా వ్యాపించిన శీతశైల పర్వతం మీద ఎన్నో దివ్యమైన పర్వతాలున్నాయి. ఆ పర్వతాల్ని వివిధ రకాల దేవతా గణాలు తమ స్థావరాలుగా చేసుకున్నారు.

**1.కుముంజ పర్వతం :** మహాశీతశైలానికి తూర్పుదిశలో కుముంజమనే పర్వతం ఉంది. దాని మీద ఎన్నో గుహలు నదీ ప్రవాహాలున్నాయి. ఆ పర్వత శిఖరాల మీద రాక్షసులు నివసించే ఎనిమిది రకాల నగరాలు ఎంతో వైభవంగా ప్రకాశిస్తున్నాయి.

**2.వజ్రక పర్వతం :** ఈ పర్వత శిఖరాల మీద కూడా ఎంతో మంది అసురులు నివసిస్తున్నారు. వారందరి సంతానంతో ఆ పర్వత శిఖరాలన్ని నిండిపోయాయి. అక్కడుండే రాక్షసులు నీలకులు అనేవారు. వారంతా కోరిన శరీరాన్ని ధరించగల కామరూపులు. అంతేకాదు అమిత బల పరాక్రమవంతులు కూడా.

**3.మహానీల పర్వతం :** ఈ పర్వతం మీద మొత్తం పదిహేను నగరాలున్నాయి. ఆ నగరాలలో అశ్వముఖం కలిగిన కిన్నరులు నివసిస్తుంటారు. మహాబాహువైన దేవసేనుడు, ఇంద్రుడు వారికి ఆరాధ్యదైవాలు. వారిని రక్షించేవారు కూడా. ఆ పదిహేను నగరాలనీ పదిహేనుమంది కిన్నరరాజులు పాలిస్తున్నారు.

**4.శైలేంద్ర పర్వతం :** వివిధ రకాల నాగులతో శైలేంద్ర పర్వతం నిండి ఉంది. ఆ నాగుల్లో భయంకరమైనవారు, విషపు చూపు కలిగినవారు, అగ్నిలా కోపంతో జ్వలించేవారు, సమీపించటానికి వీలులేనివారు అయిన మహోరగులు (మహానాగులు) వందమంది అక్కడే నివసిస్తున్నారు. అది నాగుల నివాసస్థానమైనప్పటికీ అక్కడ కొంతమంది రాక్షసులు కూడా నివాసాలు నేర్పర్చుకున్నారు.

**5.వేణువంత పర్వతం :** ఈ పర్వతం మీద విద్యాధరులు నివసించే మూడు నగరాలున్నాయి. ఆ నగరాలన్నీ ఒక్కోటీ ముప్ఫైయోజనాల వెడల్పు, ఏభైయోజనాల పొడవుతో ఉన్నాయి. ఆ నగరాల్లో సాక్షాత్తు దేవేంద్రుడితో సమానులైన ఉలూకుడు, రోమశుడు, మహానేత్రుడు అనే పరాక్రమవంతులైన విద్యాధరులున్నారు.

**6.వైకంక పర్వతం :** ఈ పర్వతం మీద ఎన్నో అందమైన గుహలు, సెలఏర్లు ఉన్నాయి. అందమైన ధాతువులతో రత్నాలతో ప్రకాశించే దివ్య శిఖరాలు కూడా ఉన్నాయి. అలాంటి పర్వతం మీద గరుత్మంతుడి కుమారుడైన సుగ్రీవుడనే మహావీరుడు నివసిస్తున్నాడు. ఆ సుగ్రీవుడు నాగులకి శత్రువు. మహావేగం కలిగినవాడు. వైకంక పర్వతం మీద బలవంతుడైన సుగ్రీవుడితో పాటు సర్పాలకి శత్రువులైన ఎంతో మంది గరుడ గణాలు కూడా నివసిస్తున్నాయి.

**7.కరంజ పర్వతం :** యోగులకి ప్రభువైనవాడు, వృషభధ్వజుడు అయిన మహాదేవుడు (శంకరుడు) నిత్యం కొలువుండేది ఈ కరంజ పర్వతశిఖరం మీదే. శంకరుడు నివసించే ఆ కరంజ పర్వత చరియలన్నీ ఎన్నో వేషాలు ధరించిన భూతగణాల్లా కనిపిస్తాయి. ఆ పర్వతం మొత్తం శివసేవకులైన ప్రమథ గణాలతో వ్యాపించబడ్డాయి.

**8.వసుధారా పర్వతం :** ఈ పర్వతం మీద అష్ట(ఎనిమిది) వసువులకీ ఎనిమిది గృహాలున్నాయి. వారంతా ఎంతో తేజస్సుతో వెలిగిపోయేవారు మహాత్ములు.

**9.రత్నధాతు పర్వతం :** దానిమీద మహాత్ములై సప్తర్షుల ఆశ్రమాలున్నాయి. వారితో పాటు మరెంతమందో సిద్ధులు, మహర్షులు ఆ పర్వతం మీద నివాసాన్ని ఏర్పరుచుకున్నారు.

**10.హేమశృంగ పర్వతం :** ఈ దివ్య పర్వతం మీద నాలుగు ముఖాలతో ప్రకాశించే బ్రహ్మదేవుడు కొలువున్నాడు. అది ఆయన స్థానం.

**11. గజశైలం :** ఈ పర్వతం మీద భూతగణాలకి చెందిన శూద్రులు నివాసం ఏర్పర్చుకున్నారు.

**12.సుమేధ పర్వతం :** ఇది ఎన్నో రకాల ధాతువులతో ప్రకాశించేది. ఈ పర్వతంమీద ఎన్నో సుందరమైన ఉద్యానవనాలు, గుహలు ఉన్నాయి. ఇక్కడ ద్వాదశ ఆదిత్యుల, అష్టవసువుల, అశ్వినీ దేవతల గృహాలున్నాయి. సిద్ధులు, యక్షులు, గంధర్వులు ఆ పర్వతం మీద సంచరిస్తూ ఉంటారు.

**13.హేమకక్ష పర్వతం :** ఈ పర్వతం మీదే విశాలమైన గంధర్వనగరం ఉంది. అది ఎనభైక్రోసుల వైశాల్యంతో, గొప్ప ప్రాకారాలతో నిర్మించబడింది. సిద్ధుల, గంధర్వుల అధిపతి అయిన కపింజలుడు అక్కడే నివసిస్తుంటాడు.

**14.నలపర్వతం :** ఇది రాక్షసులు నివసించే పర్వతం. ఇక్కడ అమిత బలపరాక్రమాలు కలిగిన దానవులు కూడా సంచరిస్తుంటారు. వీరంతా దేవతల శత్రువులు.

**15.పాండురేచారు పర్వతం :** ఇది రాగి రంగుతో ప్రకాశించే దివ్యమైన పర్వతం. ఇక్కడ యక్షులు నివసించే వంద నగరాలున్నాయి. ఈ పర్వతం మీదే కద్రువ పుత్రుడైన తక్షకుడు (సర్పరాజు) నివసించే నగరం కూడా ఉంది.

**16.విశాఖ పర్వతం :** ఈ దివ్యపర్వతం మీద అద్భుతమైన గుహలున్నాయి. ఇక్కడి గుహలోనే దేవసేనా నాయకుడైన కుమార స్వామి నివసిస్తాడు. గుహల్లో నివసించినందువల్లే ఆయనకి గుహుడనే పేరువచ్చింది.

**17.శ్వేతోదర పర్వతం :** ఇక్కడ గరుత్మంతుడి కుమారుడైన సునాభుడు నివసించే నగరం ఉన్నది.

**18.పిశాచక పర్వతం :** ఇక్కడ ఎంతో ధనవంతులైన దేవరాజుల నివాస గృహాలున్నాయి. యక్షులు, గంధర్వులు నిరంతరం సంచరించే కుబేరుడి భవనం ఇక్కడే ఉంది.

**19.హరికూట పర్వతం :** ఈ పర్వతం మీద సకల దేవతలూ నిత్యం కొలిచే శ్రీహరి నివాసముంటాడు. ఆయన ప్రభావంతో ఈ పర్వతం మహానాభంగా ప్రకాశిస్తుంది.

**20.కుముద పర్వతం :** ఇది కిన్నరుల నివాసస్థానం.

ఈ పర్వతాలతో పాటు మహోరగులనేవారు నివసించే అంజనపర్వతం, గంధర్వుల భవనాలతో నిండిన కృష్ణపర్వతం, అందమైన శిఖరాలతో ప్రాకారాలతో ఉండే పాండురపర్వతం, ఉగ్రకర్ములైన రాక్షసులు నివసించే వేయినగరాలతో ఉన్న సహస్ర శిఖరపర్వతం, నాగులు నివసించే ముకుటపర్వతం, నిత్యవసంతులైన మునిగణాలు సంచరించే పుష్పక పర్వతం, వీటితోపాటు - వైవస్వత, సోమ, వాయు, నాగరాజులకు చెందిన నివాసగృహాలు కల సుపక్షమనే పర్వతం, అనేవి హిమశైలమహాపర్వతం పరిసరాల్లో ఉన్నాయి. ఇవేకాక మరెన్నో దివ్యనగరాలతో విలసిల్లే పర్వతాలు అసంఖ్యాకంగా విస్తరించాయి.

## దేవకూట పర్వతం

భూలోకంలో ఉన్న సుప్రసిద్ధ పర్వతం దేవకూటం. అది సకలదేవతలకీ నిలయం. ఇది ఎంతో విశాలంగా ఎన్నో ఉన్నతమైన శిఖరాలతో ఒక్కొక్కటీ వందయోజనాల విస్తీర్ణంతో వ్యాపించింది. ఇక్కడే పక్షి రాజైన గరుత్మంతుడి నివాస స్థానం ఉన్నది. ఎంతోమంది పక్షిగణాలు ఆయన్ని నిత్యం సేవిస్తూ ఉంటారు. ఆ దేవకూట పర్వతం శిరోభాగం ఎంతో సుందరంగా ఉంటుంది. దాని కుడివైపు శిఖరాల మీద ఏడు గంధర్వనగరాలున్నాయి. ఎంతో అందమైన భవనాలతో విలసిల్లే ఆ నగరాలలో కుబేరుడి సేవకులైన యక్షులు నివాసముంటారు.

దేవకూటం ఉత్తర శిఖరాల్లో దేవబ్రాహ్మణ నివాసాలతో నిండిన నగరాలు కొన్ని ఉన్నాయి. వాటిలో కొన్ని నగరాలలో మహావిషసర్పాలు నివాసమున్నాయి. ఆ సర్పజాతులన్నీ దేవతలకి శత్రువైన రాహువుకి చెందినవి. అక్కడే ఉన్న మరో శిఖరం మీద కాలకేయులనే రాక్షులు నివసించే నగరాలు కొన్నున్నాయి. దేవకూటం దక్షిణ శిఖరాన్ని మహాభయంకరులు, పరాక్రమవంతులైన రాక్షసులు ఆక్రమించారు. కామరూప శక్తి కలిగిన వారంతా ఆ పర్వతం మీద హాయిగా నివసిస్తున్నారు.

దేవకూట పర్వతం మధ్యలోఉన్న శిఖరం అన్ని శిఖరాలకన్నా ఉన్నతమైనది. మహిమాన్వితమైనది. ఎందుకంటే మహాదేవుడైన పరమేశ్వరుడు కొలువుండే

దివ్యస్థలం అది. అక్కడ ముక్కంటి సేవకులైన మహాభూత గణాలు నివసించే మహావట (మర్రి) వృక్షం ఉంది. ఆ వృక్షం చెంతనే పరమేశ్వరుడు నివసిస్తుంటాడు. ఆ వృక్షం బంగారంతో, మణులతో పొదగబడిన వంద శాఖలతో విస్తరించింది. దాని మొత్తం వైశాల్యం పదియోజనాలు.

పంది, ఏనుగు, సింహం, ఎలుగుబంటి, పులి, ఒంటె, గ్రద్ద, గుడ్లగూబ, గొర్రె, మేక వంటి ముఖాలతో, ఉగ్రంగా మహాభీకరంగా చిత్రవిచిత్రమైన ఆకారాలు గల భూతగణాలతో, అలాగే మహా పారిషదులు, చండీశ్వరాది మహాగణాలతో, ప్రమథగణాలతో ఆ వటవృక్షం ఎప్పుడూ నిండి ఉంటుంది. ఆ దివ్య వృక్షం ఛాయలో కొలువున్న సర్వేశ్వరుణ్ణి సకల దేవతలు నిత్యం పూజిస్తుంటారు. అలాగే నిత్యం ఝర్ఝరాలు, శంఖాలు, తప్పెట్లు, కొమ్ము బూరలు, దుందుభులు, భేరీలు, ఢమరుకాలు లాంటి వాద్యాలు మ్రోగిస్తూ ఎంతో మంది శివగణాలు ఆయన్ని సేవిస్తూ ఉంటారు. ఆ విధంగా శంకరుడు సకల దేవ, దానవ, సిద్ధ, చారణ, యక్ష, రాక్షస, పిశాచగణాల చేత మహావైభవంగా అర్చించబడుతుంటాడు.

## కుబేర నగరం

సుందరమైన మంచు శిఖరాలతో, శంఖం లాగా తెల్లగా మెరుస్తూ, పుణ్యాత్ములైన దేవతలకు, భక్తులకు నివాసస్థానంగా కైలాసపర్వతం ఉన్నది. ఆ దివ్య పర్వత శిఖరం మీద వందయోజనాల పొడవు, ఏభై యోజనాల వెడల్పుతో, ఎంతో విశాలమైన నగరం ఉన్నది. వివిధరకాల బంగారు మణులతో అలంకరించబడ్డ భవనాలు అక్కడ ఎన్నో ఉన్నాయి. అది ధనాధిపతి అయిన కుబేరుడి నగరం. శత్రువులెవరూ ఆ నగరాన్ని ఆక్రమించలేరు. ఎంతో సుందరమైన నగరం మధ్యలో ఒక సభామండపం ఉంది. అది బంగారు స్తంభాలతో, విశాలమైన తోరణాలతో 'విపులా' అనే పేరుతో వ్యవహరించబడుతోంది.

ఆ కుబేర నగరంలో ఎన్నో రకాల రత్నాలతో అలంకరించబడ్డ పుష్పక విమానం ఉంది. అది మనోవేగం కలిగింది. బంగారు కిరీటాన్ని ధరించి ప్రకాశించే యక్షరాజు కుబేరుడి వాహం అది. ఆ నగరంలో గోరోచనంలాంటి

శరీరకాంతితో మెరిసిపోతూ, యక్షగణాలచేత సేవించబడే కుబేరుడు స్వయంగా నివసిస్తుంటాడు. ఆయనతోపాటు, గంధర్వులు, అప్సరసలు, కిన్నరులు కూడా ఆయన్ని సేవిస్తూ అక్కడే నివాసముంటున్నారు.

కుబేర నగరంలో అష్టనిధులున్నాయి అవి ఏవి అంటే?

తత్ర పద్మమహా పద్మౌ తథామకర కచ్ఛపౌ ।
కుముదః శంఖనీలౌచ నందనో నిధిసత్తమః ॥
అష్టావేతేఽ క్షయా దివ్యా ధనేశస్య మహాత్మనః ।
మహానిధా నాస్తిష్ఠన్తి సభాయాం రత్నసంచితాః ॥ *(శ్లో॥10-11, అధ్యా-41)*

1.పద్మం 2.మహాపద్మం 3.మకరం 4.కచ్ఛపం 5.శంఖం 6.నీలం 7.కుముదం 8.నందనం అనేవి అవి ధనాధిపతి అయిన కుబేరుడి అక్షయనిధులు. అవి ఎప్పటికీ క్షీణించవు. యక్షరాజు కుబేరుడు నివసించే ఆ కైలాసపర్వతం మీదే ఇంద్ర, అగ్ని యమాది దేవతలు అప్సరసలతో కొలువుంటారు.

ఆ దివ్య పర్వతంమీద 'మందాకిని' అనే చిన్న సరస్సు ఉన్నది. ఆ సరస్సుకి బంగారంతో మణులు పొదిగి మెట్లున్నాయి. చల్లని జలాలతో బంగారురంగు పద్మాలతో సుగంధ భరితమైన ఆ సరోవరంలో దేవకన్యలు, అప్సరసలు స్నానమాడుతుంటారు. అక్కడే 'అలకనందా' అనే మరో నది మందాకినీ గుణాలతో కూడా సిద్ధుల చేత, మహర్షుల చేత నిత్యం సేవించబడుతోంది.

## నీలకంఠుడి వృత్తాంతం

పూర్వం కృతయుగంలో బ్రహ్మమానసపుత్రుడు, బ్రహ్మజ్ఞాని, మహాతపస్వి అయిన వశిష్ఠుడనే మహర్షి ఉండేవాడు. ఒకనాడా మహర్షి మయూర వాహనుడు, దేవసేనుడు, పార్వతీ హృదయ నందనుడు అయిన కుమార స్వామిని దర్శించి –

నమస్తే హరనందనాయ ఉమాగర్భనమోస్తుతే ।
నమస్తే అగ్ని గర్భాయ గంగాగర్భాయ నమోఽస్తుతే ॥

నమస్తే శర గర్భాయ నమస్తే కృత్తికాసుత ।
నమో ద్వాదశ నేత్రాయ షణ్ముఖాయ నమోఽస్తుతే ॥
నమస్తే శక్తి హస్తాయ దివ్యఘంటా పతాకినే ॥ *(శ్లో॥22-24, అధ్యా-54)*

ఓ హరనందనుడా! ఉమాగర్భా! నీకు నమస్కారం అని నమస్కరించి స్వామీ! నీ తండ్రి పరమేశ్వరుడు తెల్లటి కంఠం మీద నల్లగా ఆ మచ్చ ఎందుకేర్పడింది? అని వినయంగా ప్రశ్నించాడు. అప్పుడు కుమారస్వామి వశిష్ఠ మహర్షికి నీలకంఠుడి వృత్తాంతాన్ని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

వశిష్ఠా! పూర్వం ఎంతో రమ్యమైన కైలాస పర్వతం మీద పరమేశ్వరుడు ప్రశాంతంగా కూర్చున్నాడు. అప్పుడు పార్వతీదేవి ఆయన దగ్గరకి చేరి మృదువుగా ప్రభూ! మీ శరీరమంతా తెల్లగా ఉండి కేవలం కంఠం మాత్రం నల్లగా మారింది ఎందుకు స్వామీ! దయచేసి నాకు చెప్పండి అని అడిగింది. పార్వతి మాటలు విన్న పరమేశ్వరుడు చిన్నగా నవ్వి ఆ వృత్తాంతాన్ని ఆమెకి చెప్పగా అక్కడే వున్న నేను కూడా విన్నాను. ఆనాడు నేను విన్న దాన్ని యథాతథంగా నీకు చెబుతాను. ఆ రోజు పరమేశ్వరుడు పార్వతితో ఏం చెప్పాడంటే?–

దేవీ! పూర్వం దేవతలు దానవులు కలిసి పాలసముద్రాన్ని మథించటం ప్రారంభించారు. అప్పుడు అమృతం కన్నా ముందు ఆ సముద్రంలోంచి మహా భయంకరమైన కాలకూట విషం ఆవిర్భవించింది. ప్రళయాగ్నిలా ప్రజ్వరిల్లుతున్న ఆ మహావిషాన్ని చూసి దేవతలు దానవులు భయంతో పరుగెత్తి బ్రహ్మదేవుడి దగ్గరకి వెళ్ళారు. వారందర్నీ చూసిన బ్రహ్మదేవతలారా! ఎందుకింత భయంతో వున్నారు? మీకేమైంది? ఎందుకిలా వచ్చారు? అని ప్రశ్నించాడు. అప్పుడు దేవతలంతా ఒక్కసారిగా విలపిస్తూ –

"పితామహా! అమృతం కోసం దేవదానవులిద్దరం కలిసి క్షీరసాగరాన్ని మథిస్తున్నాం. అయితే అందులోంచి అమృతం కన్నా ముందు ప్రళయకాల సంవర్తాగ్నితో సమానమైన కాలకూటవిషం వెలువడింది. అదికాల మృత్యువులాగా ఉంది. ముల్లోకాల్నీ నశింపచేసేంత తీక్షణంగా ప్రకాశిస్తోంది.

స్వామీ! ఆ కాలకూట ప్రభావంతో తెల్లగా మెరుస్తూ ఉండే శ్రీమహావిష్ణువు కూడా నల్లగా మారిపోయాడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువే అలా మారిపోవటంతో మేమంతా దిక్కుతోచక నీ దగ్గరకి పరుగునవచ్చాం" అని విన్నవించారు.

దేవతలవేదన విన్న బ్రహ్మ వారితో "సురులారా! అసురులారా! మీరేమీ భయపడకండి. ఎంతటి భయంకరమైన విషాన్నైనా తట్టుకుని నిలబడగలిగేవాడు పరమేశ్వరుడొక్కడే. ఆయన్ని స్తుతించి ఆయన అనుగ్రహాన్ని పొందుదాం" అని వారికి ధైర్యంచెప్పి మనసులో ఏకాగ్రంగా పరమేశ్వరుణ్ణి ఇలా స్తుతించటం ప్రారంభించాడు.

## బ్రహ్మ చేసిన పరమేశ్వర స్తుతి

నమస్తుభ్యం విరూపాక్ష నమస్తేఽనేక చక్షుషే ।
నమః పినాకహస్తాయ వజ్రహస్తాయ వైనమః ॥ 1
నమస్త్రైలోక్య నాథాయ భూతానాం పతయే నమః ।
నమః సురారి సంహర్త్రే తాపసాయ త్రిచక్షుషే ॥ 2
బ్రహ్మణే చైవ రుద్రాయ విష్ణవే చైవ తే నమః ।
సాంఖ్యాయ చైవ యోగాయ భూతగ్రావాయ వై నమః॥ 3
మన్మథాంగవినాశాయ కాలకాలాయ వై నమః ।
రుద్రాయ చ సురేశాయ దేవదేవాయ తే నమః ॥ 4
కపర్దినే కరాలాయ శంకరాయ కపాలినే ।
విరూపాయైక రూపాయ శివాయ వరదాయ చ ॥ 5
త్రిపురఘ్నాయ వంద్యాయ మాతౄణాం పతయే నమః ।
బుద్ధాయ చైవ శుద్ధాయ ముక్తాయ కేవలాయచ ॥ 6
నమః కమలహస్తాయ దిగ్వాసాయ శిఖండినే ।
లోకత్రయ విధాత్రే చ చంద్రాయ వరుణాయ చ ॥ 7
అగ్రాయ చైవ చోగ్రాయ విప్రాయానేకచక్షుషే ।
రజసే చైవ సత్వాయ తమసే ఽవ్యక్త యేనయే ॥ 8

నిత్యాయానిత్యరూపాయ నిత్యానిత్యాయ వై నమః ।
వ్యక్తాయ చైవా వ్యక్తాయ వ్యక్తా వ్యక్తాయవై నమః॥ 9
చిన్త్యాయ చైవా చింత్యాయ చింత్యా చింత్యా వై నమః ।
భక్తానామార్తినాశాయ నరనారాయణాయ చ॥ 10
ఉమాప్రియాయ శర్వాయ నందిచక్రాంకితాయ చ ।
పక్షమాసార్ధమాసాయ నమః సంవత్సరాయచ॥ 11
బహురూపాయ ముండాయ దండినేఽ థ వరూథినే ।
నమః కపాలహస్తాయ దిగ్వాసాయ శిఖండినే ॥ 12
ధ్వజినే రథినే చైవ యమినే బ్రహ్మచారిణే ।
ఋగ్యజుః సామవేదాయ పురుషాయేశ్వరాయచ ।
ఇత్యేవమాది చరితై స్తుభ్యం దేవనమోఽ స్తుతే ॥ 13

*(శ్లో॥67-77,అధ్యా-54)*

బ్రహ్మదేవుడు చేసిన స్తుతికి నేనెంతో సంతోషించి వెంటనే వారి ముందు ప్రత్యక్షమయ్యాను. అప్పుడు బ్రహ్మదేవుడు కాలకూటవిషం ఆవిర్భవించిన విషయాన్ని దేవదానవులు భయంతో తన దగ్గరకి వచ్చిన విషయాన్ని నాకు విన్నవించాడు. అలాగే "మహాదేవా! మహాభయంకర మైన ఆ కాలకూటవిషం అన్ని లోకాల్నీ దహించటం ప్రారంభించింది. లయకారకుడవైన నీవే దాన్ని అదుపు చేయగల సమర్థుడివి.నీవు గనక ఆ విషాన్ని స్వీకరిస్తే లోకాలన్నీ రక్షించబడతాయి. అంటే విషాన్ని గ్రహించగల శక్తి నీకే వుంది. ప్రభూ! ఆలస్యం చేయకు. వెంటనే కాలకూటాన్ని స్వీకరించి అందర్నీ కాపాడు అని దీనాతిదీనంగా ప్రార్థించాడు.

దేవీ! బ్రహ్మాదిదేవతల విన్నపాన్ని నేను కాదనలేకపోయాను. వెంటనే లోకాల్ని రక్షించాలని నిశ్చయించుకుని మహాభయంకరమైన కాలకూటవిషాన్ని గ్రహించి త్రాగటం ప్రారంభించాను.

తతోఽ హంపాతు మారబ్ధో విషమస్తక సన్నిభమ్ ।
పిబతో మేమహాఘోరం విషం సురభయంకరమ్ ।
కంఠః సమభవత్తూర్ణం కృష్ణోమే పరవర్ణిని ॥ *(శ్లో॥90,అధ్యా-54)*

లోకభీకరమైన ఆ విషం నా గొంతులోకి దిగగానే నా కంఠం ఒక్కసారిగా విషప్రభావంతో నల్లబడింది. దానితో నా కంఠం నల్ల కలువ రేకులాగా, కంఠానికి చుట్టుకున్న సర్పంలాగా వుందని బ్రహ్మదేవుడు ఎంతో ఆశ్చర్యపోయాడు.

ఆ విధంగా దేవీ! నేను ఉరగులు, యక్షులు, గంధర్వులు, దేవతలు, దానవులు, భూతాలు, పిశాచాలు, రాక్షసులు అందరూ చూస్తుండగా ఆ విషాన్ని నా కంఠంలో బంధించాను. ఈ మహాద్భుత దృశ్యాన్ని చూసి వారంతా సంభ్రమాశ్చర్యాలకి గురయ్యారు. ఒక్క క్షణంలో అందరూ తేరుకుని నా లీలలని ఇలా స్తుతించారు.

"దేవదేవా! మహాదేవా! నీ బలం, నీ పరాక్రమం! ఎంత గొప్పవి స్వామీ! ఆహా! ఎంత ఆశ్చర్యంగా ఉంది. నీ యోగ బలం ఎంతో గొప్పది. నీవే విష్ణువువి, బ్రహ్మవి, మృత్యురూపుడివి. నీవే సూర్యుడివి, చంద్రుడివి,భూమివి. నీవే కాలానివి, యజ్ఞానివి, నియమానివి. నీవే భూత, భవిష్యత్ వర్తమానకాల స్వరూపుడివి. ఆదివి నీవే, అంతమూ నీవే. స్థూల, సూక్ష్మ రూపాలు రెండూ నీవే. అగ్నివి, వాయువువి, లోకకర్తవీ, హర్తవీ నీవే. "దేవీ! ఈవిధంగా వారంతా నన్ను స్తుతించి తిరిగి తమ తమ స్థానాలకి వెళ్ళి పోయారు.

దేవీ! ఈ నీలకంఠవృత్తాంతం పరమ రహస్యమైనది. పుణ్యాలన్నిటికన్నా గొప్ప పుణ్యాన్ని ప్రసాదిస్తుంది. ఈ వృత్తాంతం లోక ప్రసిద్ధమైనది. స్వయంగా ఆ బ్రహ్మచేతే చెప్పబడింది. దీన్ని విన్నవారి సకల పాపాలనీ నశింపచేస్తుంది. పుణ్యప్రదమైన ఈ కథని జ్ఞాపకముంచుకున్నవారికి గొప్ప ఫలాలు లభిస్తాయి" అని పార్వతీ దేవికి తన కంఠం నీలంగా ఎందుకు మారింది అన్న వృత్తాంతాన్ని సవివరంగా చెప్పాడు.

## లింగోద్భవ వృత్తాంతం

పూర్వం శ్రీమహావిష్ణువు వామనావతారాన్ని ధరించి బలిచక్రవర్తిని పాతాళానికి అణగ ద్రొక్కాడు. ఆ తరువాత ఆయన ప్రశాంతంగా అవతారాన్ని చాలించి క్షీరసముద్రం మీద విశ్రాంతి తీసుకుంటున్నాడు. అప్పుడు సకల

దేవతలు, ఋషులు, మునులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, వైకుంఠ ధామానికి చేరి తమకు అసురుల బాధలు తప్పించినందుకు కృతజ్ఞతగా ఆయన్నిలా స్తుతించారు.

"ప్రభూ! నీవే బ్రహ్మవి, నీవే కర్తవి, నీవేలోకాలన్నిటినీ సృష్టించేవాడివి. నీ అనుగ్రహంతోనే అన్ని లోకాలకీ శుభాలు కలిగాయి. సకల రాక్షసులూ నీచేత జయించబడ్డారు. నీవు దివ్యమైన వామనావతారాన్ని ధరించటం వల్లనే బలిచక్రవర్తి పాతాళానికి పారిపోయాడు. అలాంటి నీకు మేమందరం నమస్కరిస్తున్నాం" దేవతలస్తుతి విన్న విష్ణువు వారితో వినయంగా ఇలా అన్నాడు. సురోత్తములారా! దేవర్షులారా! మునీశ్వరులారా! అసురుల్ని సంహరించటంలో నా ప్రతిభ ఏమీలేదు. నేను నిమిత్తమాత్రుణ్ణి మాత్రమే.

సర్వభూతాల్నీ సృష్టించినవాడు, కాలస్వరూపుడు, ఆయన కాలానికి కారకుడు. ఆయనతోనే బ్రహ్మతో సహా సకలలోకాలూ సృష్టించబడ్డాయి. ఆయన అనుగ్రహంతోనే నాకీ దివ్యశక్తులు లభించాయి. పూర్వం నేను ముల్లోకాల్నీ మింగి అవన్నీ నా కడుపులో ఉండగా హాయిగా నిద్రపోయాను. నిద్రలో దూరంగా వందమంది సూర్యులకాంతితో ప్రకాశిస్తూ ఉన్న ఒక వ్యక్తిని చూసాను. ఆయన నాలుగు ముఖాలతో, బంగారు రంగు శరీరంతో మెరిసిపోతున్నాడు. కృష్ణమృగచర్మాన్ని చుట్టుకుని, చేతిలో కమండలాన్ని ధరించాడు. ఇలా ఒక్కక్షణం ఆ దివ్య పురుషుణ్ణి చూడగానే నా శరీరం జలదరించి ఒక్కసారి కళ్ళు తెరిచాను. నా ఎదురుగా చతుర్ముఖ బ్రహ్మ కనిపించాడు. నిద్రలేచిన నన్ను చూసి ఇలా అడిగాడు.

ఓయీ! ఎవరునీవు? ఎక్కడ నుంచి వచ్చావు. నేను అన్ని లోకాలకీ కర్తని. విధాతని. స్వయంగా ఆవిర్భవించినవాణ్ణి అని అన్నాడు. బ్రహ్మ మాటలు వినగానే నాకు కోపం వచ్చింది. "ఓయీ! అసలు నీవెవరు? ఎక్కడనుంచొచ్చావు? నేనే ఈ సృష్టికర్తను. అంతేకాదు. సృష్టిని సంహరించే వాణ్ణి కూడా నేను. అది నీకు తెలుసా!" అని బదులిచ్చాను. ఇలా మేమిద్దరం వాదులాడుకుంటుండగా మా ఇద్దరికీ దూరంగా ఒక మహాగ్నిశిఖ వెలుగుతూ కనిపించింది.

దివ్యమైన ఆ అగ్నిజ్వాల భూమ్యాకాశాలని కలిపేలా జ్వలిస్తోంది. మేము ఎంతో భయంగా ఆ జ్వాలని దూరం నుంచే నిశితంగా గమనించాం. క్రమంగా మాకు ఆ జ్వాల మధ్యలో ప్రాదేశ మాత్రం ఉన్న ఒక లింగం కనుపించింది. అది బంగారంది కాదు, వెండిదీకాదు. అది ఇలాంటిది అని చెప్పలేకుండా అద్భుతంగా ఉంది. మహాతేజస్సుతో వెలిగిపోతున్న ఆ లింగం క్షణక్షణానికీ పెరగటం ప్రారంభించింది. మా ఇద్దరికీ ఆ లింగం ఆద్యంతాలు తెలుసుకోవాలనిపించింది. అప్పుడు బ్రహ్మదేవుడు నాతో ఇలా అన్నాడు.

"ఓయీ! నీవు ఈ లింగం క్రింద భాగంలోకి వెళ్ళి అది ఎంత లోతులో ఉందో! ఎక్కడ మొదలయ్యిందో తెలుసుకురా! నేను ఈ లింగం పైకి వెళ్ళి అది ఎక్కడదాకా వ్యాపించిందో తెలుసుకుని వస్తా" అని అన్నాడు. దానికి నేను కూడా సమ్మతించి లింగం అడుగుభాగం చేరుకోవాలని బయలుదేరాను. కానీ నేనెంత లోపలికి వెళ్ళినా ఆ లింగం అంతు తెలియలేదు. నాకు చాలా భయం వేసింది. వెంటనే అలసిపోయి పైకి వచ్చాను. నాలాగే బ్రహ్మ కూడా ఆలింగం ఊర్ధ్వ భాగం చూడలేక అలసిపోయి క్రిందకిదిగి వచ్చాడు. తరువాత మేమిద్దరం శివమాయకి లోబడి మూర్ఛపోయాం. కొంతసేపటికి తిరిగి కోలుకుని పైకి లేవగానే మా ఎదుట అన్ని వైపులా ముఖాలతో పంచముఖుడైన పరమేశ్వరుడు దర్శనమిచ్చాడు. జననమరణరహితుడు, సకలలోకాలకీప్రభువు, ధ్యానంలో ఉన్నవాడు అయిన ఆ ఈశ్వరుణ్ణి చూసి, ఆనంద తన్మయత్వంతో బ్రహ్మదేవుడు భక్తిపూర్వకంగా ఇలా స్తుతించాడు.

## బ్రహ్మచేసిన లింగోద్భవ స్తవం

నమోఽస్తుతే లోక సురేశ దేవనమోఽస్తుతే భూతపతే మహాంశ్చ ।
నమోఽస్తుతే శాశ్వతసిద్ధయోనే నమోఽస్తుతే సర్వజగత్ప్రతిష్ఠ ॥ 1
పరమేష్ఠీ పరం బ్రహ్మ అక్షరం పరమం పదం ।
శ్రేష్ఠస్త్వం వామదేవశ్చ రుద్రః స్కందః శివః ప్రభుః ॥ 2
త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమోంకారః పరం పదమ్ ।
స్వాహాకారో నమస్కారః సంస్కారః సర్వకర్మణామ్ ॥ 3

స్వధా కారశ్చ జాప్యశ్చ వ్రతాని నియమాస్తథా ।
వేదా లోకాశ్చ దేవాశ్చ భగవానేవ సర్వశః ॥ 4
ఆకాశస్య చ శబ్దస్త్వం భూతానాం ప్రభవావ్యయమ్ ।
భూమేర్గంధోరసశ్చాపాం తేజోరూపం మహేశ్వర ॥ 5
వాయోః స్పర్శశ్చ దేవశ్చ వపుశ్చంద్రమనస్తథా ।
బుధో జ్ఞానం చ దేవేశ ప్రకృతా బీజమేమ చ ॥ 6
త్వం కర్తా సర్వభూతానాం కాలో మృత్యుర్యమోఽ ంతకః ।
త్వం ధారయసి లోకాం స్త్రీం స్త్వమేవ సృజసి ప్రభో ॥ 7
పూర్వేణ వదనే నత్వమింద్రత్వం చ ప్రకాశసే ।
దక్షిణేన చ వక్త్రేణ లోకాన్ సంక్షీయసే ప్రభో ॥ 8
పశ్చిమేన తు వక్త్రేణ వరుణత్వం కరోషి వై ।
ఉత్తరేణ తు వక్త్రేణ సౌమ్యత్వం చ వ్యవస్థితమ్ ॥ 9
రాజసే బహుధా దేవ లోకానాం ప్రభవావ్యయః ।
ఆదిత్యా వసవో రుద్రా మరుతశ్చాశ్వినీసుతౌ ॥ 10
సాధ్యావిధ్యాధరా నాగాశ్చారణాశ్చ తపోధనాః ।
వాలఖిల్యామహాత్మాన స్తపః సిద్ధాశ్చ సువ్రతాః ॥ 11
త్వత్తః ప్రసూతా దేవేశ యే చాన్యే నియతవ్రతాః ।
ఉమా సీతా సినీవాలీ కుహూర్గాయత్రి రేవ చ ॥ 12
లక్ష్మీః కీర్తిర్ధృతిర్మేధా లజ్జా క్షాన్తి ర్వపుస్తథా ।
తుష్టిః పుష్టిః క్రియా చైవ వాచాం దేవీ సరస్వతీ ।
త్వత్తః ప్రసూతా దేవేశ సంధ్యారాత్రి స్తథైవచ ॥ 13
సూర్యాయుతా నామయుత ప్రభా చ నమోస్తుఽతే చంద్రసహస్రగోచర ।
నమోస్తుఽతే పర్వతరూపధారిణే నమోస్తుఽతే సర్వగుణాకరాయ ॥ 14
నమోస్తుఽతే పట్టిశ రూపధారిణే నమోస్తుఽతే చర్మవిభూతి ధారిణే ।
నమోస్తుఽతే రుద్రపినాకపాణయే నమోస్తుఽతే సాయచక్రధారిణే ॥ 15
నమోస్తుఽతే భస్మవిభూషితాంగ నమోస్తుఽతే కామశరీరనాశన ।
నమోస్తుఽతే దేవహిరణ్యవాససే నమోస్తుఽతే దేవహిరణ్యబాహవే ॥ 16

నమోస్తుఽతే దేవహిరణ్యరూప నమోస్తుఽతే దేవహిరణ్యనాభ ।
నమోస్తుఽతే నేత్రసహస్రచిత్రనమోస్తుఽతే దేవహిరణ్య రేతః ॥ 17
నమోస్తుఽతే దేవహిరణ్యవర్ణ నమోస్తుఽతే దేవహిరణ్య గర్భ ।
నమోస్తుఽతే దేవహిరణ్య చీర నమోస్తుఽతే దేవహిరణ్యదాయినే ॥ 18
నమోస్తుఽతే దేవహిరణ్య మాలినే నమోస్తుఽతే దేవ హిరణ్యవాహినే ।
నమోస్తుఽతే దేవహిరణ్య వర్మనే నమోస్తుఽతే భైరవ నాదనాదినే ॥ 19
నమోస్తుఽతే భైరవ వేగవేగ నమోస్తుఽతే శంకర నీలకంఠ ।
నమోస్తుఽతే దివ్యసహస్ర బాహో నమోస్తుఽతే నర్తన వాదన ప్రియ ॥ 20

బ్రహ్మచేత స్తుతించబడ్డ పరమేశ్వరుడు కోటిసూర్యులకాంతిలో ప్రకాశిస్తూ మేఘధ్వనితో సమానంగా ఒక్కసారి అట్టహాసం చేసాడు. ఆ హాసధ్వని ఆకాశమంతా నిండిపోయింది. ఆ నవ్వు విని మేమిద్దరం ఎంతో భయపడిపోయాం. కొద్దిసేపటికి ఆ మహాదేవుడు చిన్నగా దేవతాశ్రేష్ఠులారా! మీరు చేసిన స్తుతి నాకెంతో ఆనందాన్ని కలిగించింది. నన్ను చూసి మీరు భయపడకండి. పూర్వం నాశరీరం నుంచే మీరు పుట్టారు. మీ ఇద్దరూ సనాతనులు. ఈ బ్రహ్మ నా కుడి భుజం. ఓ విష్ణూ! నీవు నా ఎడమ భుజం. మీకేం వరం కావాలో కోరుకోండి అన్నాడు. అప్పుడు మేమిద్దరం ఒకే మాటగా ప్రభూ! నీమీద మాకు ఎప్పుడూ భక్తి నిలిచి ఉండేలా అనుగ్రహించు అని కోరుకున్నాం.

పరమేశ్వరుడు మాకోరికని మన్నించి "బ్రహ్మ విష్ణులారా! మీరు ఇకనుంచి వివిధరకాల జీవుల్ని సృష్టించండి" అని చెప్పి అంతర్ధానమయ్యాడు. దేవతలారా! విన్నారుగా అలా ఆనాడు పరమేశ్వరుడి ఆజ్ఞననుసరించి మేమీనాడు సృష్టిస్థితుల్ని చేస్తున్నాం. కానీ నిజానికి అందర్నీ సృష్టించింది ఆ సర్వేశ్వరుడే. మేము కేవలం నిమిత్తమాత్రులమే నని గ్రహించండి. మీరు కూడా సనాతనుడైన ఆ సర్వేశ్వరుడికి నమస్కరించండి. ఆ మహాదేవుడు జ్ఞాన చక్షువులకి మాత్రమే కనిపిస్తాడు.

## ఋషుల వృత్తాంతం

ఋషీత్యేష గతేధాతుః శ్రుతేసత్యే తపస్యథ ।
ఏతత్సన్నియతే తస్మిన్ బ్రహ్మణా స ఋషిః స్మృతః ॥ *(శ్లో॥79,అధ్యా-59)*

ఋషి అనే ధాతువు 'గతి' అనే అర్థంలో, శ్రుతి అనే అర్థంలో, అలాగే సత్యం-తపస్సు అనే అర్థంలో కూడా వర్తిస్తుంది. ఇది గత్యార్థమైనపదం. ఈ గుణాలతోనే బ్రహ్మదేవుడి చేత ఋషి అనేవాడు స్మరించబడ్డాడు. బ్రహ్మదేవుడి ద్వారా స్మరించబడ్డ ఋషి స్వయంగా వ్యక్తమయ్యాడు. పరతత్త్వం తెలిసినవాడు కాబట్టి అతడే పరమర్షిగా ఆత్మసంభూతుడవటం వల్ల 'ఆత్మర్షి' గా 'ఋషి' ప్రసిద్ధి చెందాడు. ఈశ్వరులైన ఋషులు బ్రహ్మమనస్సు నుంచి ఆవిర్భవించారు. శుభ స్వరూపాలైన వారంతా అహంకారాన్ని తమోగుణాన్ని విడిచిపెట్టి ఋషిత్వాన్ని పొందారు. తరువాత కాలంలో ఋషుల ద్వారా ఋషీకులనే సంతతి ఆవిర్భవించారు. ఈ ఋషుల పుత్రులే శ్రుతాన్ని అనగా వేదాన్ని శ్రవణం చేయటం వల్ల శ్రుతర్షులయ్యారు.

1.అవ్యక్తాత్మా 2.మహాత్మా 3.అహంకారాత్మా 4.భూతాత్మా 5.ఇంద్రియాత్మా అని ఋషులు పొందిన జ్ఞానం ఐదు విధాలుగా చెప్పబడింది.

**మహర్షులు :** భృగుమహర్షి, మరీచి, అత్రిమహర్షి, అంగిరసుడు, పులహుడు, క్రతువు, మనువు, దక్షుడు, వశిష్ఠుడు, పులస్త్యుడు అనే పదిమందీ మహాత్ములుగా వ్యవహరించటం వల్ల వారంతా మహర్షులుగా కీర్తించబడ్డారు.

**ఋషులు :** కాశ్యపుడు, బృహస్పతి, కశ్యపుడు, ఉశనుడు, ఉతథ్యుడు, వామదేవుడు, ఆపోజ్యుడు, ఐశిజుడు, కర్దముడు, మిశ్రవుడు, శక్తి, వాలఖిల్యులు, ధరులు అనేవారంతా ఈశ్వరసుతులుగా ఖ్యాతిపొందారు. తమ జ్ఞానం ద్వారా ఋషిత్వాన్ని పొంది గొప్ప ఋషులుగా ప్రసిద్ధి చెందారు.

**ఋషికులు :** ఋషికులకి జన్మించిన వారే ఋషికులు. వత్సరుడు, నగ్రహుడు,భారద్వాజుడు, బృహదుక్థుడు, శరద్వతుడు, అగస్త్యుడు, ఔశిజుడు, దీర్ఘతమర్షి, వాజశ్రవసుడు, సువిత్తుడు, సువాక్కు, వేషపారాయణుడు, దధీచుడు, శంఖమంతుడు, వైశ్రవణరాజు అనే వీరంతా సత్య ధర్మాల్ని ఆశ్రయించి ఋషికులుగా ఖ్యాతిపొందారు.

**మంత్రవాదులు :** మహర్షులు, ఋషులు, ఋషికులతో పాటు మంత్రకర్తలైనవారు ఎంతోమంది ఉన్నారు. వారిలో 1.భృగువు 2.కావ్యుడు

3.ప్రచేతసుడు 4.దధీచి 5.ఆత్మవంతుడు 6.జేర్వుడు 7.జమదగ్ని 8.విదుడు 9.సారస్వతుడు 10.అర్విషేణుడు 11.అరూపుడు 12.వీతహావ్యుడు 13.సుమేధనుడు 14.వైన్యుడు 15.పృథువు 16.దివోదాసుడు 17.ప్రశ్వారుడు 18.గృత్సమదుడు 19.నభుడు – ఈ పంతొమ్మిది మందీ మంత్రవాదులు.

**మంత్రకర్తలు :** 1.అంగిరసుడు 2.వేధసుడు 3.భారద్వాజుడు 4.భాష్కలి 5.అమృతుడు 6.గార్గ్యుడు 7.శౌనీ 8.సంహృతి 9.పురుకుత్సుడు 10.మంధాత 11.అంబరీషుడు 12.ఆహోర్యుడు 13.అజామీఢుడు 14.ఋషభుడు 15.బలి 16.వృషదశ్వుడు 17.విరూపుడు 18.కణ్వుడు 19.ముద్గలుడు 20.యవనాశ్వుడు 21.పౌరుకుత్సుడు 22.త్రాసదస్యుడు 23.దస్యుమంతుడు 24.ఉతథ్యుడు 25.వాజశ్రవసుడు 26.అయాప్యుడు 27.సువిత్తి 28.వామదేవుడు 29.ఔగజుడు 30.బృహదుక్థుడు 31.దీర్ఘతపుడు 32.కక్షీవంతుడు అనే ఈ ముప్పై రెండు మందీ మంత్రకర్తలు.

**కాశ్యపులు :** 1.కాశ్యపుడు 2.వత్సారుడు 3.విభ్రముడు 4.రైభ్యుడు 5.అసితుడు 6.దేవలుడు అనేవారు బ్రహ్మవాదులు. అనగా బ్రహ్మర్షులు. వీరినే కాశ్యపులు అంటారు.

**ఆత్రేయులు :** 1.అత్రి 2.అర్చిసనుడు 3.శ్యామావంతుడు 4.నిష్ఠురుడు 5.వల్గూతకుడు 6.మునిధీమంతుడు 7.పూర్వాతిథి ఈ ఏడుగురూ ఆత్రేయులుగా ప్రసిద్ధిచెందారు. వీరు మంత్రకారులైన మహర్షులు.

**మంత్ర బ్రహ్మణ కారకులు :** 1.వశిష్ఠుడు 2.శక్తి 3.పరాశరుడు 4.ఇంద్రప్రమతి 5.భరద్వసువు 6.మైత్రావరుణుడు 7.కుండినుడు 8.సుద్యుమ్నుడు 9.బృహస్పతి 10.భరద్వాజుడు – వీరంతా మంత్ర బ్రహ్మణ కారకులు. మంత్రకర్తలు కూడా.

**మంత్రం–సూత్రం :** వేద విధితో చూడబడే కర్మల్లో మంత్రాల కల్పన కూడా చెప్పబడింది.

మంత్రాణాం కల్పనంచైవ విధి దృష్టేషు కర్మసు ।
మంత్రో మంత్రయతేర్ధాతో ర్బ్రాహ్మణో బ్రాహ్మణోఽవత్ ॥

అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖం ।
అస్తోభమనవద్యం చ సూత్రం సూత్ర విదో విదుః ॥ *(శ్లో॥116-117, అధ్యా-59)*

మంత్ర అనే ధాతువు నుంచి 'మంత్రం' అనే శబ్దం వచ్చింది. బ్రహ్మ అనే 'వేదం' దాన్ని రక్షించేవాడు కాబట్టి బ్రహ్మణుడయ్యాడు. అనగా వేదాన్ని రక్షించటం బ్రాహ్మణ ధర్మం. అలా రక్షించిన వాడే నిజమైన బ్రాహ్మణుడు.

ఇక సూత్రం అంటే? తక్కువ అక్షరాలతో వుండేది, ఎలాంటి సందేహాలూ లేనిది, సారవంతంగా ఉండేది, అంతటా వ్యాపించి వుండేది, ఎవరిచేతా ఆపబడనిది, ఎవరిచేతా నిందించబడనిది అయినదాన్నే సూత్రం అని పండితులు చెబుతారు.

## వేదం - విభాగాలు

పరాశరమహర్షికి శ్రీమహావిష్ణువు అంశంలో వ్యాసుడు జన్మించాడు. ఆయనే కృష్ణద్వైపాయనుడని ప్రసిద్ధిచెందాడు. బ్రహ్మద్వారా ప్రేరేపించబడ్డ వ్యాసుడు వేదాల్ని విభజించటానికి పూనుకున్నాడు. పూర్వం ఒకే రాశిగా ఉన్న వేదాన్ని ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం అని నాలుగు విధాలుగా విభాగించాడు. వాటిలో మొదటిదైన ఋగ్వేదాన్ని శ్రవణం చేయటానికి పైలుడిని, యజుర్వేద ప్రవక్తగా వైశంపాయనుణ్ణి, సామవేద శ్రావకుడుగా జైమిని మహర్షిని, అలాగే అధర్వవేద శ్రావకుడిగా సుమంతుణ్ణి శిష్యులుగా స్వీకరించాడు.

ఒక్కటిగా వున్న యజుర్వేదాన్ని వ్యాసుడు నాలుగు విధాలుగా విభాగించాడు. దానిద్వారా చతుర్హోత్రం అనేది పుట్టింది. ఆ చతుర్హోత్రం ద్వారా ఆయన యజ్ఞాన్ని కల్పించాడు. ఆ తరువాత యజస్సులతో అధర్వాన్ని, ఋక్కులతో హోత్రాన్ని, సామాలతో ఉద్గాత్రాన్ని, అధర్వంతో బ్రహ్మత్వాన్ని చేసాడు.

వ్యాసమహర్షి ముందుగా అధర్వణవేదాన్ని బ్రహ్మగా చేసి యజ్ఞాన్ని ప్రారంభించాడు. తరువాత ఆ యజ్ఞం నుంచి ఋక్కుల్ని ఉద్ధరించి ఋగ్వేదాన్ని కల్పించాడు. అలాగే సామాలతో సామవేదాన్ని దాని ద్వారా ఉద్గాత్రాన్ని ప్రకాశింపచేసాడు. వీటితో పాటు అధర్వణ వేదంలో చెప్పిన విషయాలతో రాజులకు సంబంధించిన అన్ని రకాల కార్యాలూ చేయించాడు.

ఈవిధంగా నాలుగు వేదాల విభాగం పూర్తయిన తరువాత పురాణ విశారదుడైన ఆ వ్యాసమహర్షి ఆఖ్యానాలతో, ఉపాఖ్యానాలతో, గాథలతో, కులకర్మలతో పురాణ సంహితల్ని రచించాడు.

**ఋగ్వేద శాఖలు :** వేదవ్యాసుడి ద్వారా పైలుడు ఋగ్వేదాన్ని గ్రహించి, దాన్ని రెండు శాఖలుగా విభాగించాడు. వాటిలో ఒకటి ఇంద్రప్రమతి అనేవాడికి, రెండోదాన్ని బాష్కలుడనే వాడికి ఇచ్చాడు. వారిలో మహావిద్వాంసుడైన బాష్కలుడు తన ప్రతిభతో తాను పఠించిన ఋగ్వేదశాఖని తిరిగి నాలుగు శాఖలుగా విభాగించాడు. వాటిలో మొదటి సంహితని బోధుడనేవాడికి, రెండో సంహితని అగ్ని మాఠరుడనేవాడికి, మూడో సంహితని పారాశరునికి, నాలుగో సంహితని యాజ్ఞవల్క్యుడికి బోధించి, వారిచేత సంపూర్ణంగా అధ్యయనం చేయించాడు.

పైలుడి మొదటి శిష్యుడైన ఇంద్రప్రమతి తాను అభ్యసించి సంహితని మహాతపస్వి అయిన మార్కండేయుడి చేత,తన జ్యేష్ఠ కుమారుడైన సత్యశ్రవసుడిచేత చదివించాడు. వారిలో సత్యశ్రవసుడు తాను అధ్యయనం చేసిన ఋగ్వేద సంహితని తన శిష్యుడైన సత్యతరుడికి బోధించాడు. ఈ సత్యతరుడు పేరుకి తగట్టే ధర్మపరాయణుడు. ఆయనకి మహాతేజోవంతులైన ముగ్గురు శిష్యులున్నారు. వారే 1.శాకల్యుడు 2.రథంతరుడు 3.భాష్కలి. అయిన భరద్వాజుడు వీరంతా తాము పఠించిన ఋగ్వేద శాఖని ప్రచారం చేసారు.

**యజుర్వేద శాఖలు :** వైశంపాయనుడు తాను అధ్యయనం చేసిన యజుర్వేదాన్ని తన శిష్యులకి తిరిగి బోధించాడు. అతడి శిష్యులలో గొప్పవాడు యాజ్ఞవల్క్యుడు. ఒకనాడు వైశంపాయనుడి ఆగ్రహానికి గురైన యాజ్ఞవల్క్యుడు గురువుగారి ఆదేశాన్ని అనుసరించి తాను నేర్చిన యజుర్వేదాన్నంతా వమనం (వాంతి) చేసాడు. ఆ తరువాత గొప్ప దీక్షాపరుడైన యాజ్ఞవల్క్యుడు సూర్యమండలం చేరుకుని సూర్యభగవానుడి ద్వారా తిరిగి కొత్త యజుర్వేదాన్ని పొందాడు. ఆశ్వరూపంలో సూర్యుడు బోధించిన కారణంగా ఆ యజుర్వేద ఋక్కులకి వాజులు అనే పేరు వచ్చింది.

ఇక వైశంపాయనుడి ఇతర శిష్యులందరూ చరకులుగా వ్యవహరించబడ్డారు. యాజ్ఞవల్క్యుడి శిష్యులలో ఆయన ద్వారా యజుర్వేదాన్ని అభ్యసించిన 1.కణ్వవైధేయులు 2.శాలులు 3.మధ్వందినుడు 4.శాపేయి 5.విదిగ్ధుడు 6.ఆప్యుడు 7.ఉద్దలుడు 8.తామ్రాయణుడు 9.వాత్స్యుడు 10.గాలవుడు 11.శైశిరి 12.ఆటవి 13.పర్ణి 14.వీరణీ 15.పరాయణుడు అనే పదిహేను మందీ వాజులుగా ప్రఖ్యాతి చెందారు. వీరందరి ద్వారా యజుర్వేదశాఖలు మొత్తం 101గా అయ్యాయి.

**సామవేదశాఖలు :** వ్యాసుడి ద్వారా సామవేదాన్ని అభ్యసించిన జైమిని తన పుత్రుడి ద్వారా తాను పఠించిన సామవేదాన్ని చదివించాడు. జైమిని కుమారుడైన సుమంతుడు తండ్రి ద్వారా తాను అధ్యయనం చేసిన సంహితని తన పుత్రుడైన సుత్వానుడిచేత అధ్యయనం చేయించాడు. ఆ సుకర్ముడు తిరిగి తను చదివిన సంహితల్ని సహస్రుడిచేత చదివించాడు.

తరువాత కొంతకాలానికి సుకర్ముడికి పౌష్యంజి, కుశిక వంశానికి చెందిన హిరణ్యానాభుడనే రాజు శిష్యులుగా వచ్చి చేరారు. వారిలో బుద్ధిశాలి అయిన పౌష్యంజి ఒక వేయి ఏభై (1050) సామ సంహితల్ని తన శిష్యులచేత అధ్యయనం చేయించాడు. అలాగే రెండోవాడైన హిరణ్యానాభుడు ఐదువందల (500)సంహితల్ని తన శిష్యుల చేత అధ్యయనం చేయించాడు. ఈ విధంగా సామవేద శాఖల్ని అధ్యయనం చేసి ప్రచారం చేసిన పౌష్యంజి శిష్యులు అన్యోదీచ్యులని పేరు పొందగా, హిరణ్యానాభుడి శిష్యులు ప్రాచ్యసామగులుగా కీర్తిపొందారు.

1.లోకాక్షి 2.కుథుమి 3.కుశలి 4.లాంగలి అనే నలుగురూ పాష్యంజి శిష్యులు. వారంతా తమతమ పుత్ర పౌత్రపరంపరగా తాము అధ్యయనం చేసిన సామవేదాన్ని ఎన్నో సంహితలుగా రూపొందించి లోకంలో వ్యాప్తి చేసారు. ఆ తరువాత హిరణ్యానాభుడి శిష్యుడైన ఒక రాకుమారుడు సామాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేసి ఇరవైనాలుగు సంహితలుగా దాన్ని విభాగించాడు. ఆ విభాగాలన్నిటిని తన శిష్యులైన-రాడుడు, మహావీర్యుడు, రోదవహుడు,

వాహనుడు, తాలకుడు, పాండవకుడు, కాలికుడు, రాజికుడు, గౌతముడు, అజబస్తుడు తదితర శిష్యులందరూ సామవేద సంహితల్ని వ్యాప్తి చేసారు.

**అధర్వవేద సంహితలు :** వేదవ్యాసుడి ద్వారా అధర్వవేదాన్ని అధ్యయనం చేసిన సుమంతుడు దాన్ని రెండు విభాగించి వాటిని తన శిష్యుడైన కబంధుడి కిచ్చాడు. ఆ కబంధుడు సంపూర్ణంగా అధర్వవేదాన్ని అధ్యయనం చేసి తాను కూడా దాన్ని రెండు విభాగాలు చేసాడు. వాటిలో ఒక సంహితని పథ్యుడనే శిష్యుడికి, మరో సంహితని వేదస్పర్శుడనే శిష్యుడికి ఇచ్చాడు. వారిలో వేదస్పర్శులు తన మేధాశక్తితో తాను నేర్చిన సంహితని నాలుగు శాఖలుగా చేసి తన ప్రియ శిష్యులైన 1.మోదుడు 2.పిప్పలాదుడు 3.శాక్వాయనుడు 4.తపసుడే వారికి బోధించాడు.

ఇక పథ్యుడు తాను అభ్యసించిన అధర్వసంహితని మూడు భాగాలుచేసి జాబాలి, కుముదాది, శౌనకుడు తాను నేర్చిన సంహితని రెండు భాగాలుచేసి ఒకదాన్ని బభ్రువుకి, రెండోదాన్ని సైంధవాయనుడికి ఇచ్చాడు. తిరిగి ఆ సైంధ వాయనుడు తను నేర్చిన సంహితని ముంజకేశుడనేవాడికి ప్రసాదించగా, ఆ తరువాత అధర్వవేదం రెండుగా విభాగించబడింది. ఈ అధర్వవేదానికి 1.నక్షత్రకల్పం 2.వైతానం 3.సంహితానిధి 4.అంగరసకల్పం 5.శాంతికల్పం అనేవి సంహితలు వికల్పాలు.

## శుక్రాచార్యుడి వృత్తాంతం

పూర్వం హిరణ్యకశిపుడు పదికోట్ల సంవత్సరాలు భూమండలాన్నంతా పాలించాడు. అందులో 1,80,072 సంవత్సరాలు ముల్లోకాలకీ అధిపతిగా ఉన్నాడు. అదే పరంపరలో బలిచక్రవర్తి రాజై పదికోట్ల అరవై వేల ముప్పైలక్షల సంవత్సరాలు పాలించాడు. బలి రాజ్యం పాలిస్తున్న కాలంలోనే హిరణ్యకశిపుడి కుమారుడైన ప్రహ్లాదుడు కూడా రాజుగా పాలిస్తున్నాడు. మహావీరులై హిరణ్య కశిపుడు, బలి, ప్రహ్లాదుడు ఈ ముగ్గురూ అసురులకి ఇంద్రుడిలా భాసించారు. ఆ విధంగా భూమండలమంతా పదియుగాలు రాక్షసుల ఆధీనంలో ఉంది.

ఆ తరువాత పదియుగాల పాటు ఎలాంటి శత్రుభయం లేకుండా ఇంద్రుడు స్వర్గాన్ని పాలించాడు. క్రమంగా దేవతలు యజ్ఞయాగాల వల్ల అమితమైన బలాన్ని పుంజుకుని దానవులమీదకి దండెత్తారు. అమితబల సంపన్నులైన దేవతల ధాటికి దానవులు తట్టుకోలేకపోయారు.

అసురులంతా ఇక భూమిమీద నివసించలేమని భావించి తమకుల గురువైన శుక్రాచార్యుడి దగ్గరకి వెళ్ళి "గురుదేవా! మేమిక్కడ ఉండలేము. అనుక్షణం దేవతలు మమ్మల్ని తరుముతున్నారు. వారి బలం బాగా పెరిగిపోయింది. మాకిక పాతాళమే దిక్కు ఇక మేమంతా అక్కడికే వెళతాం" అని విన్నవించారు.

అసురులు భయవాక్యాలు విన్న శుక్రాచార్యుడు ఎంతో బాధపడి వారిని ఓదార్చి "అసురులారా! భయపడకండి. నా దగ్గర సమస్త శక్తులూ ఉన్నాయి. ఆ దేవతలకన్నా ఎక్కువే ఉన్నాయి. ఆ శక్తులన్నిటినీ మీకు ప్రసాదిస్తాను. ఆవేశపడకండి" అని ధైర్యం చెప్పి పంపాడు. కొన్నాళ్ళ తరువాత తిరిగి దేవతలు అసురులమీదకి దండెత్తారు. ఇద్దరి మధ్యా యుద్ధం కొనసాగింది. దేవతలు ప్రయోగించిన శస్త్రాస్త్రాల ధాటికి క్షతగాత్రులైన అసురులు యుద్ధరంగం వదిలి శుక్రాచార్యుడి దగ్గరకి వచ్చారు. అప్పుడు దీనంగా కనిపిస్తున్న అసురులతో శుక్రాచార్యుడిట్లా అన్నాడు.

"అసురులారా! దేవదానవ సంగ్రామాలు ఇప్పుడు దాకా పన్నెండు జరిగాయి. ఆ యుద్ధాలలో ఎంతోమంది అసురులు, దేవతల మాయోపాయాన్ని తెలుసుకోలేక వారి చేతిలో ప్రాణాలు కోల్పోయారు. అలా అందరూ పోగా ఇదిగో మీరు కొంతమందే మిగిలారు. కొంత కాలం నిరీక్షించండి. మీ అందరూ తిరిగి విజయం సాధించటం కోసం నేను మహాదేవుడైన పరమేశ్వరుడి దగ్గరకి వెళ్తాను. ఆయన అనుగ్రహాన్ని పొంది తిరిగి మీ దగ్గరకొస్తాను. మీ అందర్నీ శక్తివంతుల్ని చేస్తాను. నాలాగే మీరుకూడా నార వస్త్రాలు ధరించి అడవికి వెళ్ళి తపస్సు చేయండి. నేను తిరిగి వచ్చేవరకూ దేవతలు మిమ్మల్ని

ఏమీచేయలేరు. మనందరం భక్త వరదుడైన పరమేశ్వరుడి ద్వారా శత్రునాశకర మంత్రాల్ని పొందుదాం. మనకి విజయం తథ్యం. మరేమీ అధైర్యపడకండి. ప్రస్తుతానికి మనకి తగిన బలం లేదు కనుక దేవతలతో యుద్ధాన్ని విరమించండి" అని చెప్పాడు శుక్రాచార్యుడు.

గురువు మాట విన్న అసురులంతా దేవతల దగ్గరకెళ్ళి "సురులారా! మేము యుద్ధాలు చేసి అలసిపోయాం. ప్రస్తుతం మీతో యుద్ధం చేయలేం. మా ఆయుధాల్ని వదిలేస్తాం. మీరు కూడా మీ ఆయుధాల్ని విడిచిపెట్టండి. మేము ఆక్రమించిన మీ లోకాల్ని తిరిగి మీరే స్వాధీనం చేసుకోండి. మేము తపస్సు చేసుకుంటాం. మా వల్ల మీకు ఎలాంటి కష్టం కలగదు" అని విన్నవించారు. అసురుల మాటలు సత్యమని నమ్మిన దేవతలు యుద్ధాన్ని విరమించి తమ తమ స్థానాలకి తిరిగి వెళ్ళిపోయారు.

దేవతలందరూ యుద్ధాన్ని విరమించి వెళ్ళిపోగానే శుక్రాచార్యుడు అసురుల్ని పిలిచి "మీరంతా కొంతకాలం ఏ పనులూ చేయకుండా పరమేశ్వరుణ్ణి ఉపాసించండి" అని చెప్పి వారి దగ్గర నుంచి సరాసరి కైలాసానికి వెళ్ళాడు. కైలాస శిఖరం మీద చిద్విలాసంగా కూర్చున్న శివుణ్ణి దర్శించి దేవా! దేవతల వల్ల మా దానవజాతి ఘోరంగా పరాభవించబడింది. వారంతా దిక్కుతోచక అవమానభారంతో నలిగిపోతున్నారు. దయచేసి నాకు దేవతల్ని జయించగలిగే దివ్యమంత్రాన్ని ఉపదేశించండి. నేను వాళ్ళకి గురువుని. వారిని కాపాడటం నా ధర్మం" అని సవినయంగా అర్థించాడు.

శుక్రుడి ప్రార్థన విన్న పరమేశ్వరుడు "శుక్రాచార్యా! నీవు కోరినట్టు నీకు శత్రుజయమంత్రాలు లభించాలంటే బ్రహ్మచర్య దీక్షతో తలక్రిందులుగా ఉండి కుండధూమాన్ని ఉపాసించు. అప్పుడే నీ కోరిక నెరవేరుతుంది" అని చెప్పి పంపాడు. శుక్రాచార్యుడు శివుడు చెప్పిన విధంగానే కఠోర దీక్షతో భూమిలోపల పొగ నిరంతరం వచ్చే ఒక కుండాన్ని ఏర్పాటుచేసుకుని దానిమీద తలక్రిందులుగా వ్రేలాడుతూ తన తపస్సుని ప్రారంభించాడు.

శుక్రాచార్యుడు దేవతల్ని ఓడించటానికి కఠోరమైన దీక్షతో తపస్సు చేస్తున్నాడన్న విషయం దేవతలకి తెలిసింది. ఇక అదే తగిన సమయంగా భావించి ఒంటరిగా ఉన్న అసురుల మీదకి దండెత్తారు. అయితే గురువు మాట ననుసరించి అస్త్రాలు వదిలి తపోదీక్షలో ఉన్న అసురులు దేవతల్ని ఎదిరించలేక పోయారు. తపోదీక్షతో ఉన్న వారికి చంపకూడదన్న కనీసధర్మాన్ని కూడా దేవతలు పాటించలేదు. వారిలో కొందరు శుక్రమాత దగ్గరికి వెళ్ళి దేవతలు తమని చంపేందుకు ప్రయత్నిస్తున్న విషయాన్ని ఆమెకి విన్నవించారు. అప్పుడు శుక్రమాత మీరేం భయపడకండి. మీకండగా నేనున్నాను. అందరూ నా దగ్గరకి రండి అని పలికింది. ఆ విధంగా అసురులంతా శుక్రమాత దగ్గరకి వచ్చి చేరారు.

దేవతలు అసురుల్ని వదిలిపెట్టలేదు. వారు శుక్రమాత దగ్గర రక్షణ పొందారని గ్రహించి అక్కడకి వచ్చారు. ఆమె ఎదురుగానే వారిమీద దాడి చేయటం ప్రారంభించారు. ఇంద్రుడు రెచ్చిపోయి అక్కడున్న అసురుల్ని వధించటం మొదలుపెట్టాడు. శుక్రమాతకి సహనం నశించింది.

వెంటనే ఆమె తన దివ్యశక్తితో ఇంద్రుణ్ణి స్తంభింపచేసింది. ఒక్కసారిగా ఇంద్రుడు స్తంభంలా నిలబడిపోవటంతో దేవతలంతా కలవరపడ్డారు. భయంతో తలో దిక్కుకీ పారిపోయారు.

ఇంద్రుడు శుక్రమాత మంత్రశక్తితో స్తంభించబడ్డాడని తెలిసి శ్రీమహావిష్ణువు అక్కడికొచ్చి ఇంద్రుడితో తనలోని సూక్ష్మరూపంతో ప్రవేశించమని చెప్పాడు. వెంటనే ఇంద్రుడు విష్ణువు శరీరంలోకి ప్రవేశించాడు. అలా తన మంత్ర ప్రభావం నుంచి ఇంద్రుణ్ణి రక్షించిన విష్ణువును చూసి శుక్రమాత కోపంగా "ఓ విష్ణూ! ఇంద్రుడితో సహా నిన్ను సకల భూతాలూ చూస్తుండగా దహించేస్తాను. చూడు నా తపోబలం" అని ధ్యానంలోకి వెళ్ళింది.

ఇంద్రుడికి ప్రాణభయం పట్టుకుంది. శుక్రమాత సామాన్యమైనది కాదు. ఆమె అన్నంతపనీ చేస్తుంది. ప్రభూ! మీరు వెంటనే ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఆమెని వధించండి. లేకపోతే మనిద్దరం మిగలం అని విన్నవించాడు.

ఇంద్రుడి మాటలు విన్న విష్ణువు ఒక్కక్షణం ఆలోచించి ఇక తప్పదని భావించి తన సుదర్శనాయుధాన్ని స్మరించి శుక్రమాత శిరస్సుని ఖండించాడు.

శ్రీమహావిష్ణువు స్త్రీ వధచేసాడన్న విషయం భృగువుకి తెలిసింది. తన భార్య మరణానికి కారకుడైన విష్ణువుని ఏడుసార్లు మానవలోకంలో జన్మించమని శపించాడు. అలా ఆనాడు ఆయనిచ్చిన శాపం కారణంగా నారాయణుడు భూలోకంలో అవతారాలు ధరించాల్సివచ్చింది. వెంటనే భృగువు తన భార్య శిరస్సుతెచ్చి ఆమె మొండానికి అతికించి, తన తపోబలంతో ఆమెని పునర్జీవితురాల్ని చేసాడు. ఆ విధంగా శుక్రమాత తిరిగి జీవించటంతో ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళిపోయి ప్రతిరోజూ ఏం జరుగుతుందో అని భయపడసాగాడు.

ఇంద్రుడికి నిద్ర కరువయ్యింది. ఒకవైపు శుక్రమాత ఏమైనా చేస్తుందేమోనని, మరోవైపు దైత్యగురువు శుక్రాచార్యుడు తమని జయించేందుకు తపస్సు చేస్తున్నాడని ఆయనకి ఆందోళన పెరిగిపోయింది. ఒకనాడు తన కుమార్తె జయంతిని పిలిచి "కుమారీ! అసుర గురువు శుక్రాచార్యుడు కఠోరదీక్షతో తపస్సుచేస్తున్నాడు. నీవు ఆయన దగ్గరకి వెళ్ళి యధోచితంగా సేవలు చేయి. ఆయనకి ఆనందం కలిగేలా స్తుతించి, నీ పరిచర్యల వల్ల శుక్రాచార్యుడికి ప్రీతి కలిగేలా ప్రవర్తించు" అని చెప్పి పంపాడు. జయంతి ఆచార్యుడి దగ్గరకి వచ్చి తండ్రి చెప్పిన విధంగా ఆయన్ని ఎంతో భక్తి శ్రద్ధలతో సేవిస్తూ కాలం గడిపింది.

వెయ్యి సంవత్సరాల వ్రతం పూర్తయ్యింది. శుక్రాచార్యుడి కఠోరదీక్షకి శివుడు సంతోషించాడు. వెంటనే అక్కడ ప్రత్యక్షమై "శుక్రా! నీలాంటి వాడు మరొక్కడు లేడు. నీదీక్ష, కృషి, శ్రద్ధా భక్తులు నాకెంతో నచ్చాయి. నేడు నీ తపస్సు ఫలించింది. ఇదిగో నీవు కోరుకున్నట్టే నా దగ్గరున్న సమస్త విద్యల్నీ నీకు ప్రసాదిస్తున్నాను. నీవు అందరికన్నా గొప్పవాడివి. నిన్ను ఎవరూ జయించలేరు. ఎవరూ నిన్ను చంపలేరు. నేటి నుంచి నీ బుద్ధిబలం శారీరక బలం ఎన్నో రెట్లు ఉన్నతంగా పెరుగుతుంది" అని వరాల్ని ప్రసాదించాడు.

శివుడి మాటలు విన్న శుక్రాచార్యుడు ఆనందంతో పులకించిపోయాడు. తన మనోరథాన్ని నెరవేర్చిన పరమేశ్వరుడి భక్తవాత్సల్యానికి చలించిపోయాడు. ఒక్కసారిగా ఆ నీలలోహితుడి పాదాలమీద పడి మహాద్భుతమైన మూడు వందల (త్రిశతి) దివ్యనామాలతో ఆయన్నిలా స్తుతించాడు.

## శుక్రాచార్యకృత శంకర త్రిశతీస్తోత్రం

నమోఽస్తు శితికంఠాయ సురాపాయ, సువర్చసే ।
రిరిహోణాయ, లోపాయ, వత్సరాయ, జగత్పతే ॥ 1

కపర్దినే, హ్యూర్ధ్వరోమ్ణే, హయాయ, కరణాయ చ ।
సంస్కృతాయ, సుదతీర్థాయ, దేవదేవాయ, రంహసే॥ 2

ఉష్ణీషిణే, సువక్త్రాయ, సహస్రాక్షాయ, మీఢుషే ।
వసురేతాయ, రుద్రాయ, తపసే, చారవాససే ॥ 3

హ్రస్వాయ, ముక్తకేశాయ, సేనాన్యే, రోహితాయ చ ॥ 4

కవయే, రాజవృద్ధాయ, తక్షకక్రీడనాయ చ ।
గిరిశాయార్కనేత్రాయ, యతినే, జాంబవాయ చ ॥ 5

సహస్రబాహవే చైవ, సహస్రామలచక్షుషే ।
సహస్రకుక్షయే చైవ, సహస్రచరణాయ చ ॥ 6

సహస్రశిరసే చైవ, బహురూపాయ, వేధసే, ।
భవాయ విశ్వరూపాయ, శ్వేతాయ, పురుషాయ చ ॥ 7

నిషంగిణే, కవచినే, సూక్ష్మాయ, క్షపణాయ చ ।
తామ్రాయ చైవ, భీమాయ, ఉగ్రాయ చ శివాయచ, ॥ 8

బభ్రవే చ, పిశంగాయ, పింగలా యాఽరుణాయ చ ।
మహాదేవాయ, శర్వాయ, విశ్వరూపశివాయ చ, ॥ 9

హిరణ్యాయ చ, శిష్టాయ, శ్రేష్టాయ, మధ్యమాయ చ, ।
పినాకినే, చేషుమతే, చిత్రాయ, రోహితాయ చ॥ 10

దుందుభ్యా,యైకపాదాయ, అర్హాయ, బుద్ధయే, తథా ।
మృగవ్యాధాయ, సర్పాయ, స్థాణవే, భీషణాయ చ ॥ 11

బహురూపాయ, చోగ్రాయ, త్రినేత్రా, యేశ్వరాయ, చ ।
కపిలా, యైకవీరాయ, మృత్యవే, త్ర్యంబకాయ చ ॥ 12
వాస్తోష్పతే, పినాకాయ, శంకరాయ, శివాయ చ ।
అరణ్యాయ, గృహస్థాయ, యతినే, బ్రహ్మచారిణే ॥ 13
సాంఖ్యాయ చైవ, యోగాయ, ధ్యానినే, దీక్షితాయ చ, ।
అంతర్హితాయ, శర్వాయ, మాన్యాయ, మాలినే తథా ॥ 14
బుద్ధాయ చైవ, శుద్ధాయ, ముక్తయే, కేవలాయ చ ।
రోధసే, చేకితానాయ, బ్రహ్మిష్ఠాయ, మహర్షయే ॥ 15
చతుష్పాదాయ, మేధ్యాయ, ధర్మిణే, శీఘ్రగాయ చ ।
శిఖండినే, కపాలాయ, దంష్ట్రిణే, విశ్వమేధసే ॥ 16
అప్రతీఘాతాయ, దీప్తాయ, భాస్కరాయ, సుమేధసే ।
క్రూరాయ, వికృతాయైవ, భీభత్సాయ, శివాయ చ, ॥ 17
సౌమ్యాయ చైవ, పుణ్యాయ, ధార్మికాయ, శుభాయ చ ।
అవధ్యాయ, మృతాంగాయ, నిత్యాయ, శాశ్వతాయ చ,॥ 18
సాధ్యాయ, శరభాయైవ, శూలినే చ త్రిచక్షుషే, ।
సోమపా, యాఽజ్యపాయైవ, ధూమపా, యోష్మపాయ చ, ॥ 19
శుచయే, రేరిహాణాయ, సద్యోజాతాయ, మృత్యవే ।
పిశితాశాయ, ఖర్వాయ, మేధాయ, వైద్యుతాయ చ, ॥ 20
వ్యాశ్రితాయ, శ్రవిష్ఠాయ,భారతా, యాఽంతరిక్షయే ।
క్షమాయ, సహమానాయ, సత్యాయ, తపనాయ చ, ॥ 21
త్రిపురఘ్నాయ, ధీప్తాయ, చక్రాయ, రోమశాయ చ, ।
తిగ్మాయుధాయ, మేధ్యాయ, సిద్ధాయ చ, పులస్తయే ॥ 22
రోచమానాయ, ఖండాయ, స్ఫీతాయ,ఋషభాయ చ, ।
భోగినే పుంజమానాయ, శాంతాయై వోర్ధ్వరేతసే ॥ 23
అఘఘ్నాయ, మఖఘ్నాయ, మృత్యవే, యజ్ఞియాయ చ ।
కృశానవే, ప్రచేతాయ, వహ్నాయే, కిశలాయ చ, ॥ 24

సికత్యాయ, ప్రసన్నాయ, వరేణ్యాయైవ, చక్షుషే, ।
క్షిప్రగవే, సుధన్వాయ, ప్రమేధ్యాయ, పివాయ చ,॥ 25
రక్షోఘ్నాయ,పశుఘ్నాయ,విఘ్నాయ,శయనాయ చ, ।
విభ్రాంంతాయ, మహంతాయ, అంతయే,దుర్గమాయ చ ॥ 26
దక్షాయ చ, జఘన్యాయ, లోకానామీశ్వరాయ, చ ।
అనామయాయ, చోర్ధ్వాయ, సంహత్యాధిష్టితాయ చ, ॥ 27
హిరణ్యబాహవే, చైవ, సత్యాయ, శమనాయ చ, ।
అసికల్యాయ, మాఘాయ, రీరిణ్యా, యైకచక్షుషే ॥ 28
శ్రేష్ఠాయ, వామదేవాయ, ఈశానాయ చ ధీమతే ।
మహాకల్పాయ, దీప్తాయ, రోదనాయ, హసాయ చ ॥ 29
వృతధన్వనే, కవచినే, రథినే చ, వరూథినే ।
భృగునాథాయ, శుక్రాయ, వహ్నిరిష్టాయ, ధీమతే ॥ 30
అఘాయ, అఘశంసాయ, విప్రియాయ, ప్రియాయ చ, ।
దిగ్వాసః కృత్తివాసాయ, భగఘ్నాయ, నామోస్తుతే ॥ 31
పశూనాం పతయే చైవ, భూతానాం పతయే నమః, ।
ప్రణవే, ఋగ్యజుఃసామ్నే, స్వధాయై చ, సుధాయ చ, ॥ 32
వషట్కారతమాయైవ, తుభ్యమంతాత్మనే నమః ।
స్రష్టే, ధాత్రే, తథా హోత్రే, హర్త్రే చ, క్షపణాయ చ, ॥ 33
భూతభవ్యభవాయైవ, తుభ్యం, కాలాత్మనే నమః ।
వసవేచైవ, సాధ్యాయ, రుద్రాదిత్యాశ్వినాయ చ, ॥ 34
విశ్వాయ మరుతే చైవ, తుభ్యం దేవాత్మనే నమః, ।
అగ్నిసోమర్త్విగిజ్యాయ, పశుమంత్రౌషధాయ చ, ॥ 35
దక్షిణావభృథాయైవ, తుభ్యం యజ్ఞాత్మనే నమః ।
తపసే చైవ, సత్యాయ, త్యాగాయ చ, శమాయ చ ॥ 36
అహింసా యాఽ ప్యలోభాయ, సువేశా, యాఽ తిశాయచ ।
సర్వభూతాత్మభూతాయ, తుభ్యం యోగాత్మనే నమః ॥ 37
పృథివ్యై చాంతరిక్షాయ, దివాయ చ, మహాయ చ ।
జనస్తపాయ, సత్యాయ, తుభ్యం లోకాత్మనే నమః ॥ 38

అవ్యక్తా, యాఽథ మహతే, భూతాయై, వేంద్రియాయ చ, ।
తన్మాత్రాయ, మహాంతాయ, తుభ్యం తత్త్వాత్మనే నమః ॥ 39

నిత్యాయ చార్థలింగాయ, సూక్ష్మాయ, చేతనాయ చ ।
శుద్ధాయ, విభవై చైవ, తుభ్యం నిత్యాత్మనే నమః ॥ 40

నమస్తే త్రిషు లోకేషు స్వరాంతేషు భవాదిషు ।
సత్యాంతేషు మహాంతేషు చతుర్షు చ నమోఽస్తుతే ॥ 41

నమః స్తోత్రే మయాహ్యస్మిన్ సదసద్వ్యాహృతం విభో ।
మద్భక్త ఇతి బ్రాహ్మణ్య సర్వం తత్ క్షంతు మర్హసి ॥ 42

## శంకర త్రిశతి నామావళి

ఓం శితికంఠాయ నమః
ఓం సురారూపాయ నమః
ఓం రిరిహాణాయ నమః
ఓం లోపాయ నమః
ఓం వత్సరాయ నమః
ఓం జగత్పతే నమః
ఓం కపర్దినే నమః
ఓం ఊర్ధ్వరోమ్నే నమః
ఓం హయాయ నమః
ఓం కరణాయ నమః 10
ఓం సంస్కృతాయ నమః
ఓం సుతీర్థాయ నమః
ఓం దేవదేవాయ నమః
ఓం రంహసే నమః
ఓం ఉష్ణీషిణే నమః
ఓం సువక్త్రాయ నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం మీఢుషే నమః
ఓం వసురేతాయ నమః
ఓం రుద్రాయ నమః 20
ఓం తపసే నమః
ఓం చీరవాససే నమః
ఓం హ్రస్వాయ నమః
ఓం ముక్తకేశాయ నమః
ఓం సేనాన్యే నమః
ఓం రోహితాయ నమః
ఓం కవయే నమః
ఓం రాజవృద్ధాయ నమః
ఓం తక్షక క్రీడనాయ నమః
ఓం గిరిశాయ నమః 30
ఓం అర్కనేత్రాయ నమః
ఓం యతినే నమః
ఓం జాంబవాయ నమః
ఓం సహస్రబాహవే నమః

ఓం సహస్రామలచక్షుషే నమః
ఓం సహస్ర కుక్షయే నమః
ఓం సహస్ర చరణాయ నమః
ఓం సహస్ర శిరసే నమః
ఓం బహురూపాయ నమః
ఓం వేధసే నమః 40
ఓం భవాయ నమః
ఓం విశ్వరూపాయ నమః
ఓం శ్వేతాయ నమః
ఓం పురుషాయ నమః
ఓం నిషంగిణే నమః
ఓం కవచినే నమః
ఓం సూక్ష్మాయ నమః
ఓం క్షపణాయ నమః
ఓం తామ్రాయ నమః
ఓం భీమాయ నమః 50
ఓం ఉగ్రాయ నమః
ఓం శివాయ నమః
ఓం బభ్రవే నమః
ఓం పిశంగాయ నమః
ఓం పింగళాయ నమః
ఓం అరుణాయ నమః
ఓం మహాదేవాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం విశ్వరూపాయ నమః
ఓం శివాయ నమః 60
ఓం హిరణ్యాయ నమః

ఓం శ్రిష్టాయ నమః
ఓం శ్రేష్ఠాయ నమః
ఓం మధ్యమాయ నమః
ఓం పినాకినే నమః
ఓం ఇషుమతే నమః
ఓం చిత్రాయ నమః
ఓం రోహితాయ నమః
ఓం దుందుభ్యాయ నమః
ఓం ఏకపాదాయ నమః 70
ఓం అర్వాయ నమః
ఓం బుద్ధయే నమః
ఓం మృగవ్యాధాయ నమః
ఓం సర్వాయ నమః
ఓం స్థాణవే నమః
ఓం భీషణాయ నమః
ఓం బహురూపాయ నమః
ఓం ఉగ్రాయ నమః
ఓం త్రినేత్రాయ నమః
ఓం ఈశ్వరాయ నమః 80
ఓం కపిలాయ నమః
ఓం ఏకవీరాయ నమః
ఓం మృత్యవే నమః
ఓం త్ర్యంబకాయ నమః
ఓం వాస్తోష్పతే నమః
ఓం పినాకాయ నమః
ఓం శంకరాయ నమః
ఓం శివాయ నమః

ఓం ఆరణ్యాయ నమః
ఓం గృహస్థాయ నమః 90
ఓం యతినే నమః
ఓం బ్రహ్మచారిణే నమః
ఓం సాంఖ్యాయ నమః
ఓం యోగాయ నమః
ఓం ధ్యానినే నమః
ఓం దీక్షితాయ నమః
ఓం అంతర్హితాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం మాన్యాయ నమః
ఓం మాలినే నమః 100
ఓం బుద్ధాయ నమః
ఓం శుద్ధాయ నమః
ఓం ముక్తయే నమః
ఓం కేవలాయ నమః
ఓం రోధసే నమః
ఓం చేకితానాయ నమః
ఓం బ్రహ్మిష్ఠాయ నమః
ఓం మహర్షయే నమః
ఓం చతుష్పాదాయ నమః
ఓం మేధ్యాయ నమః 110
ఓం ధర్మిణే నమః
ఓం శీఘ్రాయ నమః
ఓం శిఖండినే నమః
ఓం కపాలాయ నమః
ఓం దంష్ట్రిణే నమః

ఓం విశ్వమేధసే నమః
ఓం అప్రతీఘాతాయ నమః
ఓం దీప్తాయ నమః
ఓం భాస్కరాయ నమః
ఓం సుమేధసే నమః 120
ఓం క్వరాయ నమః
ఓం వికృతాయ నమః
ఓం బీభత్సాయ నమః
ఓం శివాయ నమః
ఓం సౌమ్యాయ నమః
ఓం పుణ్యాయ నమః
ఓం ధార్మికాయ నమః
ఓం శుభాయ నమః
ఓం అపథ్యాయ నమః
ఓం మృతాంగాయ నమః 130
ఓం నిత్యాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం సాధ్యాయ నమః
ఓం శరభాయ నమః
ఓం శూలినే నమః
ఓం త్రిచక్షుషే నమః
ఓం సోమపాయైె నమః
ఓం ఆజ్యపాయైె నమః
ఓం ధూమపాయైె నమః
ఓం ఓష్మపాయైె నమః 140
ఓం శుచియే నమః
ఓం రేరిహాణాయ నమః

ఓం సద్యోజాతాయ నమః
ఓం మృత్యవే నమః
ఓం పిశితాశాయ నమః
ఓం ఖర్వాయ నమః
ఓం మేథాతు నమః
ఓం వైద్యుతాయ నమః
ఓం వ్యాశ్రితాయ నమః
ఓం శ్రవిష్ఠాయ నమః 150
ఓం భారతాయ నమః
ఓం అంతరిక్షాయ నమః
ఓం క్షమాయ నమః
ఓం సహమానాయ నమః
ఓం సత్యాయ నమః
ఓం తపనాయ నమః
ఓం త్రిపురఘ్నాయ నమః
ఓం దీప్తాయ నమః
ఓం చక్రాయ నమః
ఓం రోమశాయ నమః 160
ఓం తిగ్మాయుధాయ నమః
ఓం మేధ్యాయ నమః
ఓం సిద్ధాయ నమః
ఓం పులస్తయే నమః
ఓం రోచమానాయ నమః
ఓం ఖండాయ నమః
ఓం స్ఫీతాయ నమః
ఓం ఋషభాయ నమః
ఓం భోగినే నమః

ఓం పుంజమానాయ నమః 170
ఓం శాంతాయ నమః
ఓం ఊర్ధ్వరేతసే నమః
ఓం అఘఘ్నోయ నమః
ఓం సుఖఘ్నోయ నమః
ఓం మృత్యువే నమః
ఓం యజ్ఞియాయ నమః
ఓం కృశానవే నమః
ఓం ప్రచేతాయ నమః
ఓం వహ్నయే నమః
ఓం కిశలాయ నమః 180
ఓం సికత్యాయ నమః
ఓం ప్రసన్నాయ నమః
ఓం వరేణ్యాయ నమః
ఓం చక్షుషే నమః
ఓం క్షిప్రగవే నమః
ఓం సుధన్వాయ నమః
ఓం ప్రమేధ్యాయ నమః
ఓం పివాయ నమః
ఓం రక్షోఘ్నాయ నమః
ఓం పశుఘ్నాయ నమః 190
ఓం విఘ్నాయ నమః
ఓం శయనాయ నమః
ఓం విభ్రాంతాయ నమః
ఓం మహంతాయ నమః
ఓం అంతయే నమః
ఓం దుర్గమాయ నమః

ఓం దక్షాయ నమః
ఓం జఘన్యాయ నమః
ఓం లోకానామీశ్వరాయ నమః
ఓం అనామయాయ నమః 200
ఓం ఊర్ధ్వాయ నమః
ఓం సంహత్యాధిష్ఠితాయ నమః
ఓం హిరణ్యబాహవే నమః
ఓం సత్యాయ నమః
ఓం శమనాయ నమః
ఓం అసికల్యాయ నమః
ఓం మాఘాయ నమః
ఓం రీరిణ్యాయ నమః
ఓం ఏకచక్షుషే నమః
ఓం శ్రేష్ఠాయ నమః 210
ఓం వామదేవాయ నమః
ఓం ఈశానాయ నమః
ఓం ధీమతే నమః
ఓం మహాకల్పాయ నమః
ఓం దీప్తాయ నమః
ఓం రోచనాయ నమః
ఓం హసాయ నమః
ఓం వృతధన్వనే నమః
ఓం కవచినే నమః
ఓం రథినే నమః 220
ఓం వరూథినే నమః
ఓం భృగునాథాయ నమః
ఓం శుక్రాయ నమః
ఓం వహ్నిరిష్ఠాయ నమః
ఓం ధీమతే నమః
ఓం అఘాయ నమః
ఓం అఘశంసాయ నమః
ఓం విప్రియాయ నమః
ఓం ప్రియాయ నమః
ఓం దిగ్వాసాయ నమః 230
ఓం కృత్తివాసాయ నమః
ఓం భగఘ్నాయ నమః
ఓం పశూనాంపతయే నమః
ఓం ప్రణవే నమః
ఓం ఋగ్యజుస్సామ్నే నమః
ఓం స్వధాయై నమః
ఓం సుధాయై నమః
ఓం వషట్కారతమాయై నమః
ఓం తుభ్యం నమః 240
ఓం అంతాత్మనే నమః
ఓం స్రష్టే నమః
ఓం ధాత్రే నమః
ఓం హోత్రే నమః
ఓం హర్త్రే నమః
ఓం క్షపణాయ నమః
ఓం భూతాయ నమః
ఓం భవ్యాయ నమః
ఓం భవాయ నమః
ఓం కాలాత్మనే నమః 250
ఓం వసవే నమః

ఓం సాధ్యాయ నమః
ఓం రుద్రాయ నమః
ఓం ఆదిత్యాయ నమః
ఓం అశ్వినాయ నమః
ఓం విశ్వాయ నమః
ఓం మరుతే నమః
ఓం దేవాత్మనే నమః
ఓం అగ్నయే నమః
ఓం సోమాయ నమః 260
ఓం ఋత్విజే నమః
ఓం ఐజ్యాయ నమః
ఓం పశుమంత్రేషధాయ నమః
ఓం దక్షిణాయ నమః
ఓం అవభృదాయ నమః
ఓం యజ్ఞాత్మనే నమః
ఓం తపసే నమః
ఓం సత్యాయ నమః
ఓం త్యాగాయ నమః
ఓం శమాయ నమః 270
ఓం అహింసాయ నమః
ఓం అలోభాయ నమః
ఓం సువేశాయ నమః
ఓం అతిశయాయ నమః
ఓం సర్వభూతాత్మభూతాయ నమః
ఓం యోగాత్మనే నమః
ఓం పృథివ్యై నమః
ఓం అంతరిక్షాయ నమః
ఓం దివాయ నమః
ఓం మహాయ నమః
ఓం జనస్తపాయ నమః 280
ఓం సత్యాయ నమః
ఓం లోకాత్మనే నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం మహతే నమః
ఓం భూతాయ నమః
ఓం ఇంద్రియాయ నమః
ఓం తన్మాత్రాయ నమః
ఓం మహాంతాయ నమః
ఓం తత్త్వాత్మనే నమః 290
ఓం నిత్యాయ నమః
ఓం అర్ధలింగాయ నమః
ఓం సూక్ష్మాయ నమః
ఓం చేతనాయ నమః
ఓం శుద్ధాయ నమః
ఓం విభవే నమః
ఓం నిత్యాత్మనే నమః
ఓం త్రిలోకాయ నమః
ఓం సర్వాంతర్యామినే నమః
ఓం భవాధ్యాయై నమః 300
ఓం సత్యాంతాయై నమః
ఓం మహాంతాయై నమః
ఓం చతుర్విధపురుషార్థాయై నమః 303

ఆ విధంగా శుక్రాచార్యుడు పరమేశ్వరుణ్ణి స్తుతించగా, ఆయన ఎంతో ప్రేమగా అతడి శరీరాన్ని నిమిరి ఆశీర్వదించి అక్కణ్ణుంచి అంతర్ధానమయ్యాడు. శుక్రాచార్యుడు తన మనోరథం నెరవేరిందని ఎంతో సంతోషించి అక్కడే ఉన్న జయంతిని చూసి ఆమెతో సుందరీ! ఎవరు నీవు? ఇన్నాళ్ళుగా నాకెంతో సేవ చేసావు. నీకేదైనా కోరిక వుంటే చెప్పు. అది ఎంత కష్టమైనదైనా తీరుస్తాను అని మృదువుగా పలికాడు. ఆయన మాటలు విన్న జయంతి ఎంతో వినయంగా "స్వామీ! మీరే నాకు దైవం. మీతో కలిసి జీవించాలనే నేను మీ దగ్గరకి వచ్చాను. మిమ్మల్ని సేవిస్తున్నాను. దయచేసి నాకు మీతో సహజీవనం గడిపే భాగ్యాన్ని ప్రసాదించండి" అని కోరింది.

జయంతి సౌందర్యానికి ముగ్ధుడైపోయిన శుక్రాచార్యుడు మాయకమ్మి ఆమెని వెంటబెట్టుకుని తన ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ వారిద్దరూ ఆనందంగా కాలం గడపటం ప్రారంభించారు. జయంతి వ్యామోహంలో ఉన్న శుక్రాచార్యుడు తన విధిని మర్చిపోయాడు. అక్కడ అసురులందరికీ తమ గురువు తపస్సు ముగించుకుని ఆశ్రమానికి వచ్చాడన్న విషయం తెలిసింది. వెంటనే అందరూ హుటాహుటిన శుక్రాచార్యుడి దగ్గరకి బయలుదేరారు. అక్కడికి వచ్చిన అసురులకి ఎంతో ఆశ్చర్యం, ఆవేదనా రెండూ కలిగాయి. కుటీరం లోపల తమ గురువు జయంతితో కలిసి ఉండటాన్ని చూసి సహించలేకపోయారు. ఇక తామక్కడ ఉండటం సరికాదని భావించి నెమ్మదిగా వెనక్కి వెళ్ళిపోయారు.

శుక్రాచార్యుడు యథావిధిగా జయంతితో సంసారం చేస్తున్నాడు. అదే సమయంలో దేవగురువు బృహస్పతి శుక్రాచార్యుడి వేషంలో అసురుల దగ్గరకి వెళ్ళాడు. శిష్యులారా! మీ అందరి క్షేమం కోసం నేను తిరిగి వచ్చాను. మీకు నేను నేర్చిన విద్యలన్నీ నేర్పుతాను. ఇకనుంచీ మీ దగ్గరే నేనూ నివసిస్తాను అని చెప్పి వారికి ఆనాటి నుంచీ హితబోధలు చేయసాగాడు.

శుక్రుడు జయంతిల సంసారం క్రమంగా పదిసంవత్సరాల పాటు కొనసాగింది. ఒకనాడు శుక్రుడి అనుగ్రహంతో జయంతికి సద్యోగర్భం ద్వారా

దేవయాని అనే కుమార్తె జన్మించింది. అలా కొన్నాళ్ళు గడిచాక శుక్రుడికి తన శిష్యులైన అసురులు గుర్తుకొచ్చారు. వెంటనే వారిని చూడాలనుకున్నాడు. జయంతిని పిలిచి "దేవీ! నేను నా శిష్యులైన అసురుల్ని చూసి వస్తాను జాగ్రత్తగా ఉండు" అని చెప్పి తన శిష్యుల దగ్గరకి వెళ్ళాడు. ఆశ్చర్యంగా శుక్రుడు వారి దగ్గరకి వెళ్ళే సరికి అక్కడ తనలాగే ఉన్న శుక్రుడు వారికి గురువుగా పాఠాలు బోధిస్తున్నాడు. ఈ దృశ్యం శుక్రుడికి ఎంతో వింతని కలిగించింది. ఒక్క క్షణం దివ్య దృష్టినుపయోగించి, ఆ మాయాశుక్రుడు దేవగురువైన బృహస్పతేనని గ్రహించాడు. వెంటనే తన శిష్యులైన అసురులతో "ప్రియ శిష్యులారా! నేనే మీ గురువు శుక్రాచార్యుణ్ణి. ఇప్పటిదాకా మీకు బోధిస్తున్న ఇతడు దేవగురువు బృహస్పతి మిమ్మల్ని వంచించి తన వలలో వేసుకున్నాడు. మీరిక నిజం తెలుసుకోండి" అని అన్నాడు. ఆ మాటలు విన్న శుక్రుడి రూపంలో వున్న బృహస్పతి. ఏమాత్రం కంగారుపడకుండా అసురులుతో "శిష్యులారా! వీడెవడో మాయావి. బహుశా ఆ బృహస్పతే ఇలా వచ్చి మిమ్మల్ని నన్ను విడదీయాలని చూస్తున్నాడు. నేనే మీ నిజమైన గురువుని" అని స్థిరంగా చెప్పాడు.

ఇద్దరు శుక్రుల్ని చూసిన అసురులకి అదంతా వింతగా అనిపించింది. ఇద్దర్నీ బాగా పరిశీలించి చూసారు. ఏమాత్రం తేడా లేదు. ఇద్దరూ ఒక్కలాగానే ఉన్నారు. వీరిలో నిజమైన గురువుని ఎలా గ్రహించాలి? అని ఆలోచించారు. కొద్దిసేపటికి వారొక స్థిర నిర్ణయానికి వచ్చారు. "మనం పది సంవత్సరాల నుంచి ఈ గురువు ద్వారానే విద్యలు నేర్చుకున్నాం. ఇప్పుడు ఉన్నట్టుండి ఎవడో శుక్రుడి రూపంలో వచ్చి తానే గురువునంటున్నాడు. అతడు చెప్పేదే అసత్యమై ఉంటుంది. మన అసలు గురువు ఇన్నాళ్ళూ మనతో ఉన్నవాడే " అని స్థిరంగా భావించి కోపంగా కళ్ళెర్రజేసి, అసలైన శుక్రాచార్యుడితో ఓయీ! నీవెవరో మాయగాడిలా ఉన్నావు. వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళిపో. మాతోపాటున్న ఈయనే మా గురువు" అని కఠినంగా హెచ్చరించారు.

అసురుల హెచ్చరిక విన్న శుక్రాచార్యుడికి వారిమీద ఎంతో కోపం వచ్చింది. "ఓరీ మూర్ఖులారా! మీరు నిజం తెలుసుకోక నన్నవమానించారు.

అందుకు తగిన పరాభవాన్ని పొందుతారు” అని వారిని శపించి తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

ఆ విధంగా బృహస్పతి తన మాయోపాయంతో శుక్రుడిచేత ఆయన శిష్యుల్ని ఆయనే శపించేలా చేసాడు. తన పథకం ఫలించినందుకు బృహస్పతి ఆనందించి, శుక్రుడి శిష్యులందర్నీ భ్రష్టుల్ని చేసి వెంటనే అక్కడి నుంచి అంతర్ధానమయ్యాడు. ఒక్కసారిగా దానవుల కళ్ళు తెరుచుకున్నాయి. తాము అంతకాలం మాయావి చేతిలో దారుణంగా మోసపోయామని గ్రహించారు. ఇక చేసేదేమీ లేక తమ రాజైన ప్రహ్లాదుణ్ణి వెంటబెట్టుకుని తిరిగి శుక్రాచార్యుడి ఆశ్రమానికి వెళ్ళారు. అందరూ ఆయన ముందు తలదించుకుని అపరాధ భావంతో నుంచున్నారు. శుక్రుడు బైటికి వచ్చి అక్కడ కొచ్చిన అసురులందర్నీ చూసి శిష్యులారా! ఇప్పటికి మీకు జ్ఞానం కలిగిందా! నేనెంత చెప్పినా నా మాట వినకుండా నన్ను అవమానించారు. ఇప్పుడిక్కడికి ఏముఖం పెట్టుకుని వచ్చారు? అని ప్రశ్నించాడు.

గురువు మాటలు విన్న ప్రహ్లాదుడు వినయంగా గురుదేవా! మేమంతా మోసపోయాం. దయచేసి మమ్మల్ని క్షమించండి. మా అవివేకాన్ని మన్నించండి. ఇక మేం చేయాల్సిన కర్తవ్యాన్ని బోధించండి. మీరు మమ్మల్ని మన్నించకపోతే ఇక మేమంతా పాతాళానికి పోవటం తప్ప మరో దారిలేదు అని పలికాడు. శుక్రుడు ఆ మాటలకి శాంతించాడు. అసుర రాజా! మీరేమీ అధైర్యపడకండి. నేను శంకరుడి వల్ల ఎన్నో దివ్యశక్తుల్ని, దివ్యజ్ఞానాన్ని పొందాను. ఇప్పుడు మనకి తగిన కాలం వచ్చింది. ఇన్నాళ్ళూ త్రిలోకాధిపత్యం పొందిన దేవతలు మన చేతిలో పరాభవం చెందుతారు. తిరిగి మనకి త్రిలోకాధిపత్యం రాబోతోంది. ఈ విషయం నాకు స్వయంగా పరమేశ్వరుడే చెప్పాడు.

ఓ ప్రహ్లాదా! రాబోయే కాలంలో నీ పౌత్రుడైన బలిచక్రవర్తి త్రిలోకాధిపతి అవుతాడు. సావర్ణి మన్వంతరంలో అతడా ఆధిపత్యాన్ని స్వీకరిస్తాడు. ఇదిగో షండామార్కులనే నా ఇద్దరు శిష్యులు బుద్ధిలో బృహస్పతి లాంటివారు,

మహాపరాక్రమవంతులు. వీరు మీకు సంపూర్ణ సహాయసహకారాలందిస్తారు. మీకు పూర్తిగా విజయం బలిచక్రవర్తి కాలంలోనే లభిస్తుంది. అప్పటిదాకా వేచిచూడాల్సిందే. ఈ మధ్య వచ్చేవన్నీ తాత్కాలిక విజయాలు. జరిగేదాన్ని నేను ఆపలేను కదా! “అని చెప్పి చండామార్కుల్ని వారికి అప్పగించాడు.

ప్రహ్లాదుడు చండామార్కుల్ని ముందుంచుకుని దేవతలతో యుద్ధం ప్రారంభించాడు. తిరిగి దేవాసురల మధ్య వందసంవత్సరాలు పోరాటం కొనసాగింది. చివరికి దానవుల చేతిలో దేవతలు ఓడిపోయారు. ఓడిన దేవతలంతా కలిసి సమాలోచన చేసి “అసురుల విజయానికి కారణం చండా మార్కులు గనుక, వారిద్దర్నీ తమ పక్షంలోకి తీసుకు వస్తే తిరిగి మనం జయించవచ్చని” భావించారు. వెంటనే ఒక యజ్ఞాన్ని ప్రారంభించి ఆ యాగానికి చండామార్కుల్ని ఆహ్వానించారు. అతిథులుగా వచ్చిన వారిద్దర్నీ మంచిమాటలతో లోబర్చుకుని తమ పక్షంలో చేరాలా ఒప్పించారు. తిరిగి దేవదానవుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. మహాబల సంపన్నులు, తపోధనులైన చండామార్కులు తమ పక్షంలో లేకపోవటంతో ఈసారి అసురులు దేవతల చేతిలో ఓడిపోయారు.

ఆ విధంగా శుక్రాచార్యుడి శాపప్రభావంతో దేవతలచేత పరాభవించబడ్డ అసురులు. చేసేదేంలేక ప్రహ్లాదుడితో సహా పాతాళానికి వెళ్ళిపోయారు. ఆ తరువాత భృగుశాపకారణంగా శ్రీమహావిష్ణువు దుష్ట శిక్షణ, శిష్టరక్షణ, ధర్మస్థాపన చేసేందుకు భూమిమీద అవతరించాడు.

## నారాయణుడి అవతారాలు

పూర్వం ప్రహ్లాదుడితో కలిసిలేని అసురులందరూ భూలోకంలో మానవుల చేతిలో చంపబడతారని బ్రహ్మదేవుడు చెప్పాడు. ఆయన మాట నిజం చేయటం కోసం చాక్షువ మన్వంతరంలో నారాయణుడు అవతరించాడు. ఆ కాలంలో యజ్ఞకుండం నుంచి వరాహమూర్తిగా అవతరించి భూమి నుద్ధరించాడు. యజ్ఞం నుంచి ఆవిర్భవించిన కారణంగా ఆయన యజ్ఞ వరాహమూర్తిగా ప్రసిద్ధిచెందాడు. ఆ తరువాత శ్రీహరి హిరణ్యకశిపుణ్ణి

సంహరించటం కోసం నరసింహావతారాన్ని ధరించాడు. ఏడోయుగంలో బలిచక్రవర్తి విజృంభించి ముల్లోకాల్నీ ఆక్రమించగా అతన్ని అదుపుచేయటానికి వామనావతారాన్నెత్తాడు.

బలిచక్రవర్తి త్రైలోక్యవిజయాన్ని పురస్కరించుకుని ఒక మహాయాగాన్ని చేస్తుండగా, ఆ యాగానికి వామనుడి రూపంలో ఉన్న నారాయణుడు వెళ్ళాడు. అతిథిగా వచ్చిన ఆ వటువుని చూసి బలిసంతోషించి వరం కోరుకోమన్నాడు. అప్పుడా వామనుడు బలీ! నీవు త్రైలోక్యాధిపతివి. నీ నుంచి నేను కేవలం మూడడుగుల నేలని ఆశిస్తున్నానని అన్నాడు. సంతోషంగా ఇస్తున్నాను స్వీకరించండి అని పలికాడు బలి. వెంటనే వామనుడు త్రివిక్రముడై మహాతేజస్సుతో వెలిగిపోతూ ఒక పాదంతో భూమండలాన్నంతా ఆక్రమించాడు, మరో పాదంతో ఆకాశాన్నంతా ఆక్రమించి తన మూడోపాదాన్ని బలిశిరస్సుపై ఉంచాడు. ఆ విధంగా వామనుడి వల్ల తిరిగి అసురులంతా పాతాళాన్ని చేరారు. తరువాత స్వర్గాన్ని ఇంద్రుడికిచ్చి తిరిగి మానవుల్లో అవతరించాడు. యజ్ఞవరాహ నారసింహ వామన అనే మూడు అవతారాలు శ్రీమహావిష్ణువు ధరించిన శుభమైన రూపాలు.

ఇక భృగుశాపాన్ననుసరించి ఆయన భూలోకంలో దత్తాత్రేయుడిగా, మార్కండేయుడిగా, మాంధాతగా, పరశురాముడిగా, శ్రీరాముడిగా, వేదవ్యాసుడిగా, శ్రీకృష్ణుడుగా అవతరించాడు. ఈ అన్ని అవతారాలలో విశిష్టమైనది శ్రీకృష్ణావతారం. యోగాత్ముడైన శ్రీకృష్ణుడు యోగమాయతో మానవశరీరాన్ని ధరించి సకల ప్రాణుల్నీ మోహింపచేసాడు. తన అవతారం పరిసమాప్తమయ్యేంతలో భూలోకంలో రాజులుగా జన్మించిన అసురుల్ని ఎంతో మందిని వధించి భూభారాన్ని తగ్గించాడు. ఆ తరువాత ద్వాపరం నశించి కలియుగం రాగా అధర్మం పెరిగిపోయి అంతా మ్లేచ్ఛమయమవుతుంది. అప్పుడు శ్రీహరి కల్కిగా అవతరించి దుర్మార్గులందర్నీ సంహరించి, తిరిగి ధర్మాన్ని నెలకొల్పుతాడు. ఈ విధంగా మహావిష్ణువు ఆయాకాలాల్ని బట్టి ఆయా కార్యాల్ని ఉద్దేశించి ముల్లోకాలలో వివిధ అవతారాల్ని ధరిస్తుంటాడు.

# ఊర్ధ్వలోకాలు

సృష్టిలో మొత్తం పద్నాలుగు లోకాలున్నాయి. వీటిలో ఏడులోకాల్ని కృతాలని, మరో ఏడులోకాల్ని అకృతాలని అంటారు. పృథివి, అంతరిక్షం, దివ్యం, మహస్సు అనే లోకాలు నాలుగూ 'అర్ణవకాలు' అని చెప్పబడతాయి. ఈ నాలుగు లోకాలు వృద్ధి-క్షయాలతో కూడుకుని ఉంటాయి. ఇక జనోలోకం, తపోలోకం సత్యలోకం అనే మూడు ఐంతికాలు అని వ్యవహరించబడతాయి. ఇందులో ప్రళయకాలం దాకా ప్రాణులు జీవించే వుంటారు. ఇవికాక వ్యక్తంగా ఉండే 1.భూలోకం 2.భువర్లోకం 3.సువర్లోకం 4.మహర్లోకం 5.జనలోకం 6.తపోలోకం 7.సత్యలోకం అనే ఏడు లోకాలు ఊర్ధ్వలోకాలు. పూర్వం బ్రహ్మదేవుడు 'భూః' అని సంకల్పించగానే భూలోకం ఏర్పడింది. 'భువః' అని సంకల్పించగా భువర్లోకం. దాని నుంచి అంతరిక్షం ఏర్పడ్డాయి. 'స్వః' అని అనుకోగానే స్వర్గం ఏర్పడింది.

భూమికి అధిపతి అగ్ని. అందువల్ల భూలోకానికి అగ్నిదేవుడు అధిపతిగా ఉంటాడు. అలాగే భువర్లోకానికి అధిపతిగా వాయువు, దినానికి అధిపతిగా సూర్యుడు ఉంటారు. అందుకే సూర్యుణ్ణి దివస్పతి అంటారు. తరువాతది మహర్లోకం అక్కడ క్షయములేని దేవతలుంటారు. ఇక జనోలోకం ఇందులో స్వాయంభువాది మనువులు - ప్రజలు జన్మించటంవల్ల ఇది జనోలోకంగా ప్రసిద్ధిచెందింది. తరువాతది తపోలోకం ఇక్కడ బ్రహ్మమానసపుత్రులైన సనక సనందనాది మహర్షులు. ఊర్ధ్వరేతస్కులైన ఋభువులాంటివారు ఉంటారు. సత్యం అంటే బ్రహ్మ బ్రహ్మ నివసించేలోకమే సత్యలోకం.

సూర్యుడి నుంచి భూమి మధ్య వరకూ ఉన్న ప్రాంతాన్ని అంతరిక్షం అంటారు. అలాగే సూర్యుడి నుంచి ధ్రువుడి వరకు ఉన్న ప్రాంతాన్ని స్వర్గలోకం లేక 'దివం' అంటారు.

**గ్రహాలు - ఊర్ధ్వలోకాలు వాటి దూరాలు :** భూలోకం నుంచి లక్ష యోజనాల దూరంలో సూర్యుడుంటాడు. ఆ సూర్యుడి నుంచి వేయియోజనాలకి

పైన చంద్రుడు, ఆ చంద్రుడికన్నా పైన ఒక లక్షయోజనాల దూరంలో సకల నక్షత్రాలు కొలువుంటాయి. ఎంతో దివ్యంగా ప్రకాశించే ఆ నక్షత్రమండలం కన్నా రెండు లక్షల యోజనాలకి పైన మేరువుంటాడు.

నక్షత్రమండలానికి దిగువ భాగంలో బుధుడు సంచరిస్తాడు. బుధుడికి పైన శుక్రుడు, అతడికిపైన కుజుడు, ఆపైన బృహస్పతి, అతడి పైన శనైశ్చరుడు కొలువుంటారు. వీరందరికన్నా పైన లక్షయోజనాల విస్తీర్ణంలో సప్తర్షి మండలం దివ్యంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ ప్రాంతానికి సమీపంలోనే ఉత్తాన పాదుడి పుత్రుడైన ధ్రువుడు తారలా ప్రకాశిస్తుంటాడు.

ధ్రువుడికి ఊర్ధ్వభాగంలో మహర్లోకముంది. అది ధ్రువుడినుంచి ఒక కోటి యోజనాల దూరంలో నెలకొంది. అక్కడ వుండే వారంతా కల్పవాసులు. మహర్లోకం నుంచి రెండుకోట్లయోజనాల దూరంలో జనోలోకముంది. అక్కడ బ్రహ్మపుత్రులైన దక్షాది ప్రజాపతులు నివాసముంటారు. జనోలోకానికి నాలుగురెట్లు అధికదూరంలో తపోలోకముంది. అక్కడ వైరాజులనబడే దేవతలు నివసిస్తుంటారు. తపోలోకానికన్నా పైన ఆరింతల దూరంలో సత్యలోకం నెలకొంది. ఆ లోకాన్ని చేరినవాడు ఇక తిరిగిరాడు. నిరంతరం బ్రహ్మనే ఉపాసిస్తూ ఉంటాడు. సత్యలోకానికి పైన నాలుగుకోట్ల అరవై అయిదులక్షల యోజనాల దూరంలో బ్రహ్మలోకం ఉంది.

## శివపుర వైభవం

భూలోకం నుంచి బ్రహ్మలోకం 13 కోట్ల 15 లక్షల యోజనాల దూరంలో ఉందని చెబుతారు. అలాంటి బ్రహ్మలోకాని కన్నా పైన 1 కోటీ 50 లక్షల యోజనాల విస్తీర్ణంలో భాగవతాండం అనగా బ్రహ్మాండం విస్తరించింది. బ్రహ్మలోకానికీ బ్రహ్మాండానికి మధ్యలో ఒక దివ్యమైన పురం ఉంది. అదే శివపురం. అది ఈశ్వరుడి మనోమయస్థానం. దివ్యతేజస్సుతో ఆకారాన్ని ధరించిన సర్వేశ్వరుడి నివాసం ఆ శివపురం. జన్మభయం కలిగిన వారికది రక్షణ స్థానం.

దివ్యమైన ఆ శివపురం మొత్తం ఒక లక్షయోజనాల దూరం వ్యాపించింది. మధ్యాహ్న సూర్యుడిలా ప్రకాశించే బంగారు కోటగోడలతో అది నిర్మించబడింది. సూర్యకాంతితో విరాజిల్లుతూ, ముత్యాలహారాలతో అలంకరించబడిన నాలుగు బంగారు ద్వారాలు ఆ నగరానికున్నాయి. అది ఆకాశంలో నెలకొన్నపురం. ఎంతో రమ్యమైనది, దివ్యమైనది. నిరంతర ముధురమైన ఘంటారావాలతో ధ్వనించబడేది. అక్కడ మృత్యువు కాలుపెట్టలేదు. అక్కడుండేవారికి తాపం, ముసలితనం, శ్రమ అనేవేవీ ఉండవు. ఆ పురానికి సాటి మరేమీ లేదు. పది దిక్కులతో ఆ శివపురం విస్తరించి ఉంది.

ఆ శివపురంలో వృషభధ్వజుడైన శివుడి తేజస్సు వ్యాపించి ఉంటుంది. ఆయన మనోభావంతోనే అక్కడ బంగారు మయమైన భూమి ఏర్పర్చబడింది. రత్నాలతో నిండిన ఇసుకతో ఆ భూమి దివ్యంగా ప్రకాశిస్తోంది. అక్కడున్న వనాల్లోని సరోవరాలతో అందమైన పద్మాలు ప్రకాశిస్తున్నాయి. వాటిలో కొన్ని శరత్కాల చంద్రుడిలా తెల్లటికాంతితో, మరికొన్ని బాలసూర్యుడిలా ఎర్రటి కాంతితో వెలుగొందుతున్నాయి. ఇంకొన్ని సగం తెలుపు, సగం ఎరుపురంగు కలిగి బంగారుమయంగా ఉన్నాయి. ఆ పద్మాలు ఒక్కక్కొటీ రథచక్రాలంత ఉన్నాయి. కొన్ని సరోవరాలలో వున్న పద్మాలు దివ్యమైన సుగంధాలు వెదజల్లుతూ ఉన్నాయి. అలాగే వాటిలో కొన్ని నల్లగా, కొన్ని పూర్తి బంగారం రంగుతో, ఒక్కొక్కటి పెద్ద గొడుగంత ప్రమాణంలో అందంగా వికసించాయి.

ఆ దివ్యపురంలో కమలాలతో నిండిన అందమైన నదులు ప్రవహిస్తున్నాయి. వాటిలో ప్రసిద్ధమైనవి, వరా, వరేణ్యా వరదా, వరార్హా, వరవర్ణినీ, వరమా, వరభద్రా అనేవి. మహాతేజోవంతమైన శివపురమహిమని బ్రహ్మర్షులుగానీ, దేవతలుగానీ, అసురులు గానీ, పితరులు గానీ, సంపూర్ణంగా తెలుసుకోలేరు. జితేంద్రియులై ఏకాగ్రతతో యోగవృత్తిని అవలంబించిన వారే ఆ దివ్యనగరాన్ని చూడగలరు.

ఆ శివపురం మధ్యలో ఎంతో గొప్పగా మేరుపర్వతంలా ప్రకాశించేది, బంగారుమయమైనది, పవిత్రమైన వేయికిరణాలతో సూర్యుడిలా వెలిగేది అయిన

అందమైన భవనం ఉన్నది. సాటి లేని రత్నాలతో ఆ భవనం అలంకరించబడింది. చంద్రుడితో సమానకాంతి గల స్ఫటికమణులతో, సోముడితో సమానకాంతి గల చంద్రకాంతమణులతో వైఢూర్యాలతో, బాల సూర్యకాంతమణులతో, అగ్ని నుంచి పుట్టిన బంగారంతో, వెండితో చేయబడిన స్తంభాలతో ఆ భవనం విశాలంగా సౌకర్యంగా ఉన్నది. ఆ స్తంభాలన్నీ ఎంతో ధృఢమైన వజ్రమణులతో కూర్చబడిఉన్నాయి. చంద్రకిరణకాంతులతో విరాజిల్లే పతకాలు ఆ భవనం మీద అలంకరించబడి ఉన్నాయి.

ఆ దివ్య భవనం నిత్యం మధురమైన ఘంటారావాలతో శోభిస్తోంది. అక్కడ కిన్నరులు గానం చేస్తూ ప్రతిరోజూ ఒక ఉత్సవాన్ని నిర్వహిస్తున్నారు. హిమశిఖరాలతో, మేరు శిఖరాలతో, బంగారు పుష్పాలతో, బంగారు ధ్వజాలతో ఆ దివ్యభవనం విరాజిల్లుతోంది. అక్కడ త్ర్యంబకుడైన పరమేశ్వరుడు కొలువుంటాడు. ఆయన్ని శ్రీ, లక్ష్మి, మాయ, కీర్తి, శోభ సరస్వతి దేవి అనే ఎంతోమంది దేవతలు ఆశ్రయించి ఉంటారు. మహాత్ములైన నూరుకోట్లమంది దేవతలు, తమని తాము విభాగించుకుని, ఏమాత్రం ఏమరుపాటు లేకుండా భగవంతుడైన శివుణ్ణి సంతోషపెడుతూ ఉంటారు. ఇంకా ఎంతోమంది అందమైన పరిచారికలు కమలాలలాంటి కళ్ళతో ప్రకాశిస్తూ తమ హావభావ విన్యాసాలతో అక్కడున్న గణాల్ని అలరిస్తూ ఉంటారు.

ఆ శివపురంలో ఉన్న స్త్రీలలో కొందరు పొట్టివారు కొందరు అందమైన శరీరంతో వుండేవారు, కొందరు గుర్రం ముఖాలతో పొట్టిభుజాలతో, వికారమైన నేత్రాలతో ఉన్నారు. మరి కొందరు ఉన్నతమైన స్తనాలతో అందమైన కళ్ళతో సంచరిస్తున్నారు. కొందరు స్త్రీలైతే కామరూప శక్తిని కలిగి చిత్రవిచిత్ర రూపాల్ని ధరిస్తూ విహరిస్తున్నారు. ఈ విధంగా ఎన్నో వేషాలు ధరించిన స్త్రీలు శివుడు నివసించే భవనంలో నివసిస్తూ ఆయనకి ఎన్నోరకాలుగా సేవలు చేస్తున్నారు.

సర్వాలంకార సంశోభితమైన శివభవనంలో నందీశ్వరుడితో, విశ్వరూపులైన గణాలతో, రుద్రగణాలతో, అగ్నితో సమానంగా ప్రకాశిస్తూ

భయంకరమైన కోరలతో వివిధ రకాల ముఖాలతో ఉన్న ప్రమథగణాలతో నిత్యం పరమేశ్వరుడు సేవించబడుతూ ఉంటాడు.

సర్వర్తు కుసుమాం మాలాం జిఘ్రమాణోరసిస్థితామ్ ।
నీలోత్పలదళ శ్యామం పృథు తామ్రాయతేక్షణమ్ ॥
ఈషత్కలాలలంబోష్ఠం తీక్ష్ణదంష్ట్రా గణాంచితమ్ ।
షడూర్ధ్వనేత్రం దుష్ప్రేక్ష్యం రుచిరం చీరవాససమ్।
అహవేష్వపరిక్లిష్టం దేవానామరి నాశనమ్ ।
బాహునా బాహుమావేశ్య పార్శ్వే సవ్యేంఽఉతరే స్థితమ్ ॥

*(శ్లో॥267-269, అధ్యా-39)*

అన్ని ఋతువుల్లో పూసే పుష్పాలని ఆ పరమేశ్వరుడు నిత్యం వాసన చూస్తుంటాడు. నల్లకలువలాగా నల్లగా ప్రకాశించేవాడు, విశాలంగా ఎర్రగా వుండే కళ్ళతో వెలుగొందేవాడు, చూడశక్యంకానివాడు, నారచీర ధరించినవాడు, అందగాడు, యుద్ధాలు చేసినప్పటికీ ఏమాత్రం అలసిపోనివాడు, దేవతల శత్రువుల్ని నశింపచేసేవాడు, ఎడమభాగంలో చేతిలో చేతిని మధ్యలో చొప్పించినవాడు అయిన పరమేశ్వరుడు నిత్యం పూజించబడుతుంటాడు.

ఆ పరమేశ్వరుడి ఎడమ అరచేతిలో మహాభయంకరమైనది, బలంలో సాటిలేనిది, ఎంతో తేజస్సు కలిగినది, చిత్రవిచిత్రమైన పరి రంగులతో వెలుగొందేది, విద్యుత్తుతో ప్రకాశించేది, వ్యర్థంకానిది, శత్రువులందర్నీ నశింపచేసేది, జ్వాలలతో మండుతూ ఉండేది, శివకాంతితో తేజరిల్లేది అయిన త్రిశూలం ప్రకాశిస్తు ఉంది.

హోమకుండంలో ఉన్న అగ్ని శిఖలాగా ఆ పరమేశ్వరుడి కత్తి (ఖడ్గం) తేజోమయంగా, దివ్యకాంతుల్ని వెదజల్లుతూ వుంటుంది. అలాగే ఓజస్సుల్లో గొప్పవాడైన చంద్రుడు కూడా ఆయన తలమీద అలంకారంగా విరాజిల్లుతున్నాడు. మహేశ్వరుడి ముందు బంగారంతో అందంగా రూపొందించి శుద్ధమైన జలంతో నిండిన కమండలం వుంది.

ఈశ్వరుడికి సమీపంలో ఎత్తైన పెద్ద మూపురంతో శరత్కాలమేఘంలా తెల్లగా ప్రకాశించే వృషభరాజం కొలువుంది. అది స్వామివారి వాహనం. ఆ పక్కనే మహావీర్యవంతుడు, ఎర్రని వస్త్రాలు ధరించినవాడు, శ్రీమంతుడు, కమలాలలాంటి కళ్ళతో ప్రకాశించేవాడు అయిన శివుడి కుమారుడు స్కందుడు ఉన్నాడు. ఆ స్కందుడికి శాఖుండు, విశాఖుడు, నైగమేయుడు, చాష్టవంతుడు అనే నలుగురు పరివారంగా ఉన్నారు. వీరంతా నెమలి వాహనుడైన కుమారస్వామిని నిరంతరం సేవిస్తూ ఉంటారు. ఆ కుమారస్వామి సర్పాలనే ఆట వస్తువులతో ఆడుకుంటూ ఉంటాడు. ఇంకా అక్కడ బ్రహ్మావాదులైన బ్రాహ్మణులు, రహస్యమైన స్వాధ్యాయనం, తపస్సు చేసుకుంటూ నివసిస్తున్నారు.

దేవదేవుడైన పరమేశ్వరుణ్ణి తమ భక్తి ప్రపత్తులతో మెప్పించి, ఆయన నివసించే శివపురంలో నివాస స్థానాన్ని పొందినవారు ఎంతో ధన్యులు. వారు ఎలా వుంటారంటే? – శివ లోకాన్ని పొందిన పుణ్యాత్ములు ధీమంతులు, హ్రీ (లజ్జా)మంతులు. శాంతంలో శౌర్యంతో కూడినవారు. ఎలాంటి లోభగుణం లేనివారు. మధ్యాహారులు, సూక్ష్మతత్త్వాన్ని గ్రహించినవారు. నిత్యం ఆత్మలోనే రమించేవారు. ఇంద్రియాల్ని శీతోష్ణాల్ని జయించినవారు. ఎంతో ఉత్సాహవంతులు, సౌమ్యులు. ఎలాంటి మత్సరంలేనివారు. సర్వప్రాణులభావంలో ఉండేవారు, ఇతర వ్యాపారాలేవీ లేనివారు, వ్యాకులపడనివారు, కర్మతో, మనసుతో, మాటతో, విశుద్ధమైన అంతరాత్మతో నిత్యం ఈశ్వరుణ్ణీ త్రికరణ శుద్ధిగా ఆరాధిస్తూ వుండేవారు. ఇలాంటి మహాభక్తులే నాశనంలేని శాశ్వత శివపదాన్ని పొందారు. వారిలో కొందరు తమ భక్తి ప్రపత్తులతో ఉత్తమోత్తమమైన శివరూప సాదృశ్యాన్ని (సారూప్యాన్ని) పొందారు.

శివలోకంలో నివసించే శివభక్తులు అందరూ అగ్నిముఖులు. విశ్వరూపులు. జటాజూటాలు కలిగినవారు. నీలకంఠులు. వాడిగా ఉండే కోరలతో మూడు కళ్ళతో ప్రకాశిస్తుంటారు. అందరూ అర్ధచంద్రరేఖను ధరించినవారు. వారందరికీ పదిభుజాలుంటాయి. బాలార్క సూర్యుడితో సమానులైన వారు పచ్చనివస్త్రాలు ధరించి, పినాకం అనే ధనుస్సుని చేతపట్టినవారు.

అక్కడున్న అందరికీ తెల్లని దున్నపోతులు వాహనంగా ఉన్నాయి. వారంతా 'శ్రీ' తో కూడి కుండలాలతో, ముత్యాలహారాలతో అలంకరించ బడినవారు. తేజస్సులో అందరు దేవతల్నీ మించిపోయారు. వారంతా సర్వజ్ఞులు. సర్వాన్నీ చూడగలిగినవారు. జరామృత్యువులు లేక ఎన్నో సుఖభోగాలు అనుభవిస్తూ సంచరిస్తుంటారు. స్వేచ్ఛాగమన సిద్ధిని కలిగిన వారు ఎన్నో కోట్ల సంఖ్యతో ఏకాదశరుద్రుల రూపాల్లో విహరిస్తూఉన్నారు. ఇలా వీరంతా సర్వాత్మనా ఈశ్వరస్వరూపాలుగా కొలువబడుతున్నారు. వీరందరితో కలిసి భక్తజన సులభుడైన పరమేశ్వరుడు పార్వతీదేవితో ఆనందంగా ఆ శివపురంలో నివసిస్తున్నాడు.

## శివలోకప్రాప్తి

స ఏష ఓతః ప్రోతశ్చ బహిరంతశ్చ నిశ్చయాత్ ।
ఏరోహి భగవాన్నాథ అభావీ శాంత కృద్ద్విజాః ॥
తతస్తయే ఋషయః సర్వే దివాకర సమప్రభాః ।
స్వం స్వమాశ్రమ సంవాసమారోప్యాగ్నిం తథాత్మని ॥
కర్మణా మనసావాచా విశుద్ధేనాంతరాత్మనా ।
అనన్యమనసోభూత్వా ప్రపద్యంతే మహేశ్వరమ్ ॥
వ్ర తోపవాసనిరతాః సర్వభూతదయాపరాః ।
యోగం హ్యనుపమం దివ్యం ప్రాప్తం తైః శ్చిన్నసంశయైః ॥
ప్రపద్య పరయా భక్త్యా జ్ఞానయుక్తే చేతసా ।
తైర్లభ్యం రుద్రసాలోక్యం శాశ్వతం పదమవ్యయం ॥
యఃపఠేత్ తపసాయుక్తో వాయుప్రోక్తా మిమాంస్తుతిం ।
బ్రాహ్మణః క్షత్రియోవాపి వైశ్యోవా స్వక్రియా పరః ॥
లభతే రుద్రసాలోక్యం భక్తి మాన్విగతజ్వరః ।
అమద్యపశ్చయః శూద్రో భవభక్తో జితేంద్రియః ॥

*(శ్లో॥347-353,అధ్యా-40)*

భగవంతుడు ఒక్కడే. ఆయనే అందరికీ నాథుడు. భావాతీతుడు, శాంతిని ప్రసాదించేవాడు. అలాంటి భగవంతుణ్ణి సూర్యుడితో సమానకాంతి కలిగిన ఋషులందరూ తమ ఆత్మలో తమ తమ ఆశ్రమాలలో నెలకొన్న అగ్నిలో ఆరోపించుకోవాలి. ఆ విధంగా చేసి కర్మతో, మనసుతో, మాటతో, అంతరాత్మతో మహేశ్వరుణ్ణి ధ్యానించేవారు మాత్రమే ఆయన్ని పొందుతారు. వ్రతాలు ఉపవాసాలూ నిర్వహిస్తూ సకల ప్రాణుల మీదా దయని చూపుతూ, అన్ని రకాల సంశయాల్నీ పోగొట్టుకున్నవారు సాటిలేని దివ్యయోగాన్ని పొందుతారు. అలా దివ్యయోగాన్ని పొందినవారు, దానితోపాటు పరమభక్తిని, జ్ఞానంతోకూడిన మనసుని, రుద్రసాలోక్యాన్ని, అవ్యయమైన శాశ్వతమైన రుద్రపదాన్నీ కూడా పొందుతారు.

శివపురం గురించి శివలోక ప్రాప్తిగురించి వాయుదేవుడు చెప్పిన ఈ వృత్తాంతాన్ని ఎవరైతే శ్రద్ధగా పఠిస్తారో వారు బ్రాహ్మణుడైనా, క్షత్రియుడైనా, వైశ్యుడైనా, శూద్రుడైనా తప్పకుండా శివలోకాన్ని చేరుకుంటాడు. వారిలో ఎవరైనా శివయోగ క్రియాసక్తులైతే అలాంటివారు సాక్షాత్తు రుద్రసాలోక్యాన్నే పొందుతారు. అలాంటి మహాశివభక్తులు మహాభూతప్రళయం వరకూ ఎదురులేక సర్వకామరూపమైన స్థానాన్ని గానీ, గాణపత్యాన్ని గానీ పొందుతారు.

## అష్టాదశపురాణాలలోని శ్లోకాలు

చతుర్దశసహస్రం చ మాత్స్యం ప్రోక్తమతిస్ఫుటమ్ ।
తత్సంఖ్యకం భవిష్యం చ ప్రోక్తం పంచదశాధికమ్ ॥ 1

మార్కండేయం మహారమ్యం ప్రోక్తం నవసహస్రకమ్ ।
కథితం బ్రహ్మవైవర్తమష్టాదశసహస్రకమ్ ॥ 2

శతోత్తరం చ బ్రహ్మాండం సూర్యసంఖ్యాసహస్రకమ్ ।
అథ భాగవతం దివ్యమష్టాదశసహస్రకమ్ ॥ 3

సహస్రాణి దశైవోక్తం పురాణం బ్రహ్మనామకమ్ ।
అయుతశ్లోకఘటితం పురాణం వామనాభిధమ్ ॥ 4

తథైవాయుతసంఖ్యాతం షట్‌శతాధికమ్ ।
త్రయోవింశతి సాహస్రమనిలం తద్గతం శుభమ్ ॥ 5

త్రయోవింశతి సాహస్రం నారదీయముదాహృతమ్ ।
ఏకోనవింశసాహస్రం వైనతేయముదాహృతమ్ ॥ 6

సహస్రపంచపంచాశత్ప్రోక్తం పాద్మం సువిస్తరమ్ ।
సప్తదశసహస్రం తు కూర్మం ప్రోక్తం మనోహరమ్ ॥ 7

చతుర్వింశతిసాహస్రం సౌకరం పరమాద్భుతమ్ ।
ఏకాశీతి సహస్రాణి స్కాందముక్తం సువిస్తరమ్ ॥ 8

ఏవమష్టాదశోక్తాని పురాణాని బృహంతి చ ।
పురాణేష్వేషు బహవో ధర్మాస్తే వినిరూపితాః ॥ 9

*(శ్లో॥3-11, అధ్యా-40)*

## పురాణాలు శ్లోకాల సంఖ్య

అష్టాదశపురాణాలలో విష్ణు, లింగపురాణాలు తప్ప మిగిలిన 16 పురాణాలలో ఉన్న శ్లోకాల సంఖ్య వాయుపురాణం 42వ అధ్యాయంలో ఇలా చెప్పబడింది.

| పురాణం | శ్లోకాలు | పురాణం | శ్లోకాలు |
|---|---|---|---|
| 1. మత్స్యపురాణం - | 14000 | 10. వాయుపురాణం - | 23,000 |
| 2. భవిష్యపురాణం - | 14015 | 11. నారద పురాణం - | 23,000 |
| 3. మార్కండేయపురాణం - | 9000 | 12. గరుడ పురాణం - | 19,000 |
| 4. బ్రహ్మవైవర్త పురాణం - | 18000 | 13. పద్మపురాణం - | 55,000 |
| 5. బ్రహ్మాండ పురాణం - | 12,100 | 14. కూర్మపురాణం - | 17,000 |
| 6. భాగవత పురాణం - | 18000 | 15. వరాహపురాణం - | 24,000 |
| 7. బ్రహ్మపురాణం - | 10,000 | 16. స్కాందపురాణం - | 81,000 |
| 8. వామనపురాణం - | 10,000 | 17. విష్ణుపురాణం - | 23,000 |
| 9. అగ్ని పురాణం - | 10,600 | 18. లింగపురాణం - | 11,000 |

ఈ పురాణాలన్నిటిలో ఎన్నో ధర్మాలు విశేషంగా నిరూపించబడ్డాయి. వీటిలో రాగుల, విరాగుల, యతుల, బ్రహ్మచారుల, గృహస్థుల, వనస్థుల అలాగే స్త్రీ మరియు శూద్రుల ధర్మాలు సవివరంగా చెప్పబడ్డాయి. వీటితో పాటు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య జాతులు మరియు సంకర జాతుల ధర్మాలు, గంగాది పుణ్యనదుల ప్రాశస్త్యాలు, యజ్ఞాలు, వ్రతాలు, తపస్సులు, యోగ, ధ్యాన విశేషాలు, సాఖ్య, యోగ పద్ధతులు, భాగవతధర్మం, భక్తి, జ్ఞాన, వైరాగ్యమార్గాలు, మంత్ర తంత్ర విశేషాలు, వాస్తుశిల్ప, నిర్మాణశాస్త్రాలు, ఖగోళ జ్యోతిషాలు, బ్రాహ్మణ శైవ, వైష్ణవ, సౌర, శాక్తేయ, గాణాపత్యాదిమతాలు, వివిధ రాజవంశాల, మనువుల చరిత్రలు. ఋషులు, మునుల వృత్తాంతాలు దేవదానవ సంగ్రామాలు లాంటి ఎన్నో ఎన్నెన్నో విషయాలు చెప్పబడ్డాయి.

## వ్యాసమహర్షికి వేదపురుష దర్శనం

ఒకనాడు వేదవ్యాస మహర్షి తన మనసులో ఇలా చింతించాడు. వర్ణాశ్రమ ధర్మాల గురించి నేను చక్కగా చెప్పాను. వేదవిరోధంలేని ఎన్నో రకాల ముక్తిమార్గాలు ప్రబోధించాను. శ్రుతియుక్తమైన విచారంతో పరబ్రహ్మ స్వరూపాన్ని నిరూపించాను.. అక్షరమైన తనకు ఆత్మ రూపంగా ఉన్నవాడు, పరమానంద స్వరూపుడు ఆనందమే ఆకారంగా కలిగినవాడు, గోపికాస్త్రీ సమూహం మధ్యలో నివసించేవాడు, రాధాదేవితో విలాసంగా క్రీడించేవాడు అయిన శ్రీకృష్ణుడే పరమపురుషుడని వేదవాక్కులద్వారా తెలియబడేవాడు ఆయనేనని ఆ వేదాల ద్వారానే తెలుసుకున్నాను. అయితే గోలోకవాసి అయిన ఆ శ్రీకృష్ణుడు అక్షరం కంటే పరుడుగా చెప్పబడుతున్నాడు. అసలు అతనికంటే పరుడైన వేదాలచేత గానం చేయబడేవాడెవడు? యథార్థంగా వేదవచనాల ద్వారా ఉద్దేశించబడిన నావెవడు? అన్న సంశయాల్ని పొంది ఎంతో కాలం వీరు గురించి బాగా ఆలోచించాడు. అయితే ఆయనకి సమాధానం గోచరించలేదు.

వేదం సాక్షాత్తు నారాయణ స్వరూపం. అయితే ఎంత విచారించినా వ్యాసుల వారికి వేదార్థ నిశ్చయజ్ఞానం కలగలేదు. ఆయనకెంతో బాధ కలిగింది.

ఇప్పుడెక్కడికి పోను? ఎవర్ని అడగను? అని ఆలోచించి, మేరుపర్వతం మీద ఉన్న ఒక గుహలోకి చేరి తపస్సు చేయటం ప్రారంభించాడు. ఆ గుహలో ఆహారాన్ని, చిత్తాన్ని, ఆసనాన్ని, జయించి ఏకాగ్రచిత్తంతో నాలుగు వేదాల్ని స్మరించాడు. అలా వేదాల్ని స్మరిస్తూ 300 సంవత్సరాలు తపోదీక్షలోనే కాలంగడిపాడు వ్యాసమహర్షి. చివరికి ఆయన తపస్సు ఫలించి నాలుగువేదాలూ ఆయనకి దర్శనమిచ్చాయి. వేదాలన్నీ పురుషుల రూపంలో ఆవిర్భవించాయి.

ఆ విధంగా ఆవిర్భవించిన వేదపురుషులు, పద్మాలలాంటి కళ్ళతో ప్రకాశిస్తూ జడల్ని మకుటంగా ధరించారు. దర్భముడులు గల పద్మాలలాంటి చేతులు కలిగి లేడి చర్మాలతో అలంకరించిన భుజాలతో ఉన్నారు. వారు పదహారు స్వరాల (అచ్చులు) తో నిండిన ముఖాలుగలవారు. వారి హృదయంతో ఓంకారం వుంది. వారి చేతుల వ్రేళ్ళు (కఖగఘఙ్ఞ-చఛజఝఞ) 'క' వర్గ 'చ' వర్గలు. వారికుడిపాదం (పఫబభమ) అనే 'ప'వర్గ కాగా ఎడమపాదం (తథదధన) 'త' వర్గగా వుంది. కుక్షిద్వయాత్మకమైన అంతవర్ణాలు (యరలవ-శషసహ) ధరించినవారు, నాభి నిద్రగా, కాంతాలు పృష్ఠం (వీపు)గా, 'మ'కారాన్ని ఉదరంగా, య ర ల వ ల్ని ఊర్ధ్వంగా లేచిన వెంట్రుకలుగా కలిగి వున్నారు.

అగ్నిలా ప్రకాశించే ఆ వేదపురుషులకి భూమి కంఠంగా వుంది. భృతాలు భుజంగా అంతస్థాలైన య ర ల వ లు సంధిస్థానంగా వున్నాయి. వారంతా వైఖరీ వాక్కులతో విజృంభించినవారు. అలాంటి వేదపురుషుల హృదయకమలంలో కల్పితమైన మధురానగరాన్ని దర్శించాడు వ్యాసులవారు. ఆ మధురానగరం భగవంతుడైన శ్రీకృష్ణుడు స్వయంగా అవతరించిన దివ్య స్థలం.

వేదపురుషుల కనుబొమలమధ్య వ్యాసుడు కాశీనగరాన్ని చూసాడు. వారి ములాధారంలో మాయానగరాన్ని (హరిద్వారం), లింగప్రదేశంలో కాంచీనగరాన్ని, నాభిబొడ్డు ప్రాంతంలో అవంతీనగరాన్ని, కంఠ భాగంలో ద్వారకాపట్టణాన్ని, ప్రాణంలో ప్రయాగక్షేత్రాన్ని, వారికి కుడిఎడమభాగాల్లో గంగా-యమునా నదుల్ని, మధ్యలో సరస్వతీనదిని ఆ వేదపురుషుల ముఖంలో

గయాక్షేత్రాన్ని, చెక్కిళ్ళ పైభాగంలో ప్రభాస తీర్థాన్ని, వారి బ్రహ్మరంధ్రస్థానంలో బదరికాశ్రమాన్ని చూసాడు.

ఆ వేదపురుషుల రెండు కళ్ళలో పౌంద్రవర్ధన నేపాలపీఠాల్ని, ఫాలభాగంలో పూర్ణగిరి పీఠాన్ని, కంఠంలో మధురాపీఠాన్ని, కటిస్థలంలో కాంచీపీఠాన్ని, స్తనభాగంలో జాలంధర పీఠాన్ని, చెవుల ప్రదేశంలో భృగుపీఠాన్ని, ముక్కుపుటాలలో అయోధ్యని, బ్రహ్మరంధ్రంలో బాహ్యాపీఠాన్ని, పాపటప్రదేశంలో శైవపీఠాన్ని, వారి నాలుక చివర శక్తిపీఠాన్ని, హృదయకమలంలో వైష్ణవపీఠాన్ని, దివ్యమైన వారి నేత్రాలలో సౌరపీఠాన్ని, వారి నీడలో బౌద్ధపీఠాన్ని స్పష్టంగా దర్శించాడు వేదవ్యాసుడు.

వేదపురుషుల శరీర భాగాలలో క్షేత్రాల్ని నదుల్ని పీఠాల్నేకాక వివిధ రకాల యాగాల్ని కూడా వ్యాసులవారు ఇలా దర్శించారు. వారి కంఠప్రదేశంలో సౌత్రామణియాగాన్ని, వారి హృదయం మీద పశుబంధయాగాన్ని, నడుము భాగంలో వాజపేయ యాగాన్ని, ముఖభాగంలో అగ్ని హోత్రయాగాన్ని, కటిప్రదేశంలో అశ్వమేధయాగాన్ని, కడుపుమీద నరమేధాన్ని, వారితలమీద రాజసూయ యాగాన్ని, క్రిందిపెదవి మీద అవసథ్యయాగాన్ని, పైపెదవి మీద దక్షిణాగ్నిని, వారినోటిలోపల గార్హపత్యాగ్నిని, చెవులలో హవ్యాన్ని దర్శించాడు.

ఈ విధంగా పురాణాలతో, సంహితలతో, తంత్రాలతో ఉపాసించ బడుతున్న వేదపురుషుల్ని చూసి వ్యాసమహర్షి ఎంతో ఆశ్చర్యపోయి ఒక్కసారిగా తాను నల్లనివాడయ్యాడు.

తన తపస్సు ఫలించి దర్శనమిచ్చిన వేదపురుషుల్ని చూసి వ్యాసమహర్షి ఎంతో ఆనందించి నేనెంతో ధన్యుడనయ్యాను అని అంటూ వారికి వినయపూర్వకంగా నమస్కరించాడు. " ఓ వేదపురుషులారా! మీ దర్శనంతో నా జన్మ ధన్యమైంది. లౌకిక అలౌకిక విషయాలుగానీ, భూత, భవిష్యత్ విషయాలుకానీ మీకు తెలియనివేవీ కావు. నాదొక సందేహం జీవులు జ్ఞానాన్ని ముందుగా పొంది తద్వారా తరువాత మోక్షాన్ని పొందుతారు కదా! బ్రహ్మైక్యం

చెందటమే మోక్షం. అది సచ్చిదానందరూపం. అదిశుద్ధమైనది గుణాలులేనిది, చలించనిది ఆ మోక్షం గురించి తెలిస్తే చేసింది, చేయంది అంతా సమాప్తమై పోతుంది. గాఢాంధకారం వ్యాపించిన లోకంలో సూర్యుడు తన దివ్య తేజస్సుతో వెలుగుతూనే ఉంటాడు. ఆయన ఎప్పటికీ నశించడు కానీ ఆయన వెలుగుకి అంధకారం నశిస్తూనే ఉంటుంది. అలాగే వికారాలు నశిస్తాయి గానీ నిర్వికారం ఎప్పటికీ నశించదు. మొదట జీవేశ్వరాకారంతో, విశ్వాకారంతో భాసించిన సత్యబ్రహ్మజ్ఞానం ప్రలీనంకాగా అది ఒకే ఒక కూటస్థుడైన పురుషుడుగా వుంటుందని మీ వల్లనే (వేదాల చేత) నేను తెలుసుకున్నాను. అయితే అంతకన్నా పరమైనది ఏదైనా ఉన్నదా? లేదా? దయచేసి చెప్పండి" అని వారిని ప్రార్థించాడు.

వేదవ్యాసుడి సంశయానికి సమాధానంగా వేదపురుషులు "వ్యాసా! నీ సంశయం చాలా గొప్పది. శరీరం ధరించిన వారందరి ఆత్మ విష్ణువు. నీవు జన్మలేని వాడవైనప్పటికీ జన్మని పొంది లోకానుగ్రహాన్ని కోరుకుంటున్నావు. పురాణాల్లో ఇతిహాసాల్లో బ్రహ్మసూత్రాల్లో ఎన్నో విధాలుగా అన్ని కారణాలకీ కారణమైన అక్షర పరబ్రహ్మ గురించి చెప్పబడింది. పూలకు గంధంలాగా, ఈ ఆత్మకి-ఆత్మగా ఉన్న రూపమే ఆ పరబ్రహ్మరూపం అని తెలుసుకో. ఆ పరబ్రహ్మ అక్షరం కన్నా పరంగా ఉన్న కేవలానంద రస స్వరూపం. శబ్దాతీతమైన ఆ పరబ్రహ్మ గురించి, శబ్దాత్మకులమైన మేము (వేదపురుషులు) వివరించటానికి అశక్తులం' అని వేదపురుషులు వ్యాసుడు అడిగిన సందేహానికి తగిన సమాధానం చెప్పలేక తమ అశక్తతని తెలియచేసారు.

## గయాతీర్థ మహిమ

భూలోకంలో వున్న సకల తీర్థాలలో ఉత్తమమైనది శ్రాద్ధాదికర్మలకి దివ్యతీర్థంగా వున్నది గయాతీర్థం. ఇది మహాపుణ్యక్షేత్రం. పూర్వం గయాసురుడు బ్రహ్మగురించి తపస్సుచేసి ఎన్నో వరాలు పొందాడు. తరువాత బ్రహ్మ కోరగా ఆయన యజ్ఞం ఆచరించటానికి తన శరీరాన్ని ఇచ్చాడు. యజ్ఞం నిర్వహించేడప్పుడు శరీరం కదలకుండా ధర్ముడు ఒక శిలని అతడి తలమీద

నిలిపాడు. సకల దేవతలు కలిసి గయాసురుడి శరీరం మీద బ్రహ్మ యజ్ఞం చేయటం ప్రారంభించాడు. దేవతలందరితో పాటు గయాసురుడు నిశ్చలంగా ఉండటం కోసం సాక్షాత్తు శ్రీమహావిష్ణువు గదాధరుడై అతడిపై నిల్చున్నాడు. అప్పుడు బ్రహ్మ నిరాటంకంగా తన యాగాన్ని కొనసాగించి, చివరికి యాగం ముగిసాక గయాసురుడు కోరిన వరాలన్నీ ప్రసాదించాడు. ఆనాటి నుంచి గయాసురుడి పేరుమీదగా ఆ క్షేత్రానికి గయాతీర్థం అనేపేరు ఏర్పడింది.

నరకం వల్ల భయం పొందిన పితరులు గయను చేరుకున్న తమ పుత్రుల్ని చూసి సంతోషిస్తారు. ఎందుకంటేవారు గయలో తమకోసం శ్రాద్ధవిధిని నిర్వహిస్తే తమకి ఉత్తమలోకాలు కలుగుతాయని గయలో అన్నదానం చేస్తే చేసిన వాడి పితరులకి ఆహారం అక్షయంగా అందుతుంది. గయాక్షేత్రంలో మూడు పక్షాలు అనగా 45 రోజులు నివసించేవాడి ఏడుతరాల వారూ తరిస్తారు.

మహాకల్పకృతం పాపం గయాం ప్రాప్య వినశ్యతి ।
పిండం దద్యాచ్ఛ పిత్రాదేరాత్మనోఽ పి తిలైర్వినా ॥
బ్రహ్మహత్యా సురాపానస్తేయం గుర్వంగనాగమః ।
పాపం తత్సంగజం సర్వం గయాశ్రాద్ధా ద్వినశ్యతి॥

*(శ్లో॥ 11-12, అధ్యా-43)*

గయాక్షేత్రాన్ని దర్శిస్తే మహాకల్పం నుంచీ చేసిన పాపాలుకూడా నశిస్తాయి. ఆ దివ్య తీర్థంలో పితరులకి పిండప్రదానం తప్పక చేయాలి. గయాక్షేత్రంలో శ్రాద్ధాన్ని పెడితే బ్రహ్మ హత్య, సురాపానం, దొంగతనం, గురుపత్నీ గమనం, వీటి సంగం వల్ల కలిగి సర్వపాపాలూ నశిస్తాయి.

బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం గోగృహేమరణం తథా ।
వాసః పుంసాంకురుక్షేత్రౌ ముక్తిరేషా చతుర్విధా ॥ *(శ్లో॥14, అధ్యా-43)*

బ్రహ్మజ్ఞానం పొందటం, గయలో శ్రాద్ధం పెట్టటం, గోశాలలో మరణించటం, కురుక్షేత్రంలో నివసించటం ఈ నాలుగూ పురుషులకి నాలుగు విధాలైన ముక్తిమార్గాలు.

గయాక్షేత్రం ఐదుక్రోసుల విస్తీర్ణంతో ఉంటుంది. ముల్లోకాల్లో వున్న సకల తీర్థాలూ గయలోనే ఉన్నాయి. అలాంటి గయాతీర్థంలో శ్రాద్ధాన్ని చేసినవాడు తమ పూర్వీకులందర్నీ ఉద్ధరించిన వాడవుతాడు. గయలో ప్రతిప్రాంతం తీర్థ స్థలమే. సూర్యుడు మీన, మేష, కన్యా, ధనూ, కుంభ రాశుల్లో ఉన్నప్పుడు అలాగే మకర రాశిలో సూర్యచంద్ర గ్రహణాలు జరుగుతున్నప్పుడు గయాశ్రాద్ధం చేస్తే సకల పుణ్యాలూ లభిస్తాయి.

## దక్షుడు చెప్పిన శివనామాలు

ఓం దేవాయ(తే ) నమః, ఓం దేవేశాయనమః, ఓం దేవాది బలసూదనాయనమః, ఓం దేవేంద్రాయ నమః, ఓం అమర శ్రేష్టాయ నమః, ఓం దేవదానవ పూజితాయ నమః, ఓం సహస్రాక్షాయ నమః, ఓం విరూపాక్షాయ నమః, ఓం త్ర్యక్షాయ నమః, ఓం సర్వతః పాణి పాదాయ నమః, ఓం సర్వతోఽ క్షిశిరోముఖాయ నమః, ఓం లోకే సర్వతః శ్రుతిమతే నమః, ఓం సర్వానావృత్య తిష్ఠతే నమః, ఓం శంకుకర్ణాయ నమః, ఓం మహాకర్ణాయ నమః, ఓం కుంభకర్ణాయనమః, ఓం అర్ణవాలాయ నమః, ఓం గజేంద్ర కర్ణాయ నమః, ఓం గోకర్ణాయ నమః, ఓం పాణి కర్ణాయ తే నమః, ఓం శతోదరాయ నమః, శతావర్తాయ నమః, ఓం శతజిహ్వాయ నమః, ఓం శతాననాయ నమః, ఓం త్రిసంధ్యాసు గాయత్రీ జపగీతాయ నమః, ఓం దేవదానవ గోప్త్రే నమః, ఓం బ్రహ్మణే నమః, ఓం శతక్రతవే నమః, ఒం మహామూర్తయే నమః, ఓం సముద్రాంబుధరాయనమః, ఓం గవా గోష్ఠఇవ సర్వ దేవతానాం నివాసాయనమః,

ఓం సోమశరీరాయనమః, ఓం అగ్ని శరీరాయనమః, ఓం వరుణ శరీరాయ నమః, ఓం ఆదిత్య శరీరాయనమః, ఓం విష్ణు శరీరాయనమః, ఓం బ్రహ్మ శరీరాయనమః, ఓం బృహస్పతి శరీరాయనమః, ఓం క్రియా స్వరూపాయ నమః, ఓం కార్యాయ నమః, ఓం కారణాయ నమః, ఓం కర్త్రే నమః, ఓం కరణాయనమః, ఓం అసతే నమః, ఓం సదేసదే నమః, ఓం ప్రభవాప్యయాయ నమః, ఓం భవాయ నమః, ఓం శర్వాయ నమః, ఓం రుద్రాయ నమః, ఓం వరదాయ నమః, ఓం పశూనాం పతయే నమః, ఓం అంధక ఘాతినే నమః, ఓం త్రిజటాయ నమః, ఓం త్రిశీర్షాయ నమః, ఓం త్రిశూల వర ధారిణే నమః, ఓం త్ర్యంబకాయ నమః, ఓం

త్రినేత్రాయనమః, ఓం త్రిపురఘ్నాయ నమః, ఓం చండాయనమః, ఓం ముండాయ నమః ఓం ప్రచండాయ నమః, ఓం ధరాయ నమః, ఓం డిండి మాసక్త కర్ణాయ నమః, ఓం దండినే నమః, ఓం సమకర్ణాయ నమః, ఓం దండి మండాయ నమః, ఓం అర్థదండ కేశాయ నమః, ఓం నిష్ఠాయ నమః, ఓం వికృతాయ నమః, ఓం విలోహితాయనమః, ఓం ధూమ్రాయ నమః, ఓం నీలగ్రీవాయ తే నమః, ఓం అప్రతిరూపాయ నమః, ఓం శివాయ తే నమః, ఓం సూర్యాయ నమః, ఓం సూర్వధ్వజపతాకినే నమః ఓం ప్రమథనాథాయ నమః, ఓం వృషస్కంధాయ నమః, ఓం ధన్వినే నమః, ఓం హిరణ్య గర్భాయ నమః, ఓం హిరణ్య కవచాయనమః, ఓం హిరణ్యకృతచూడాయ నమః, ఓం సత్రఘాతాయ నమః, ఓం దండాయనమః, ఓం వర్ణపాన పుటాయనమః, ఓం స్తుతాయ నమః, ఓం స్తుత్యాయ నమః, ఓం స్తూయమానాయ నమః, ఓం సర్వాయనమః, ఓం అభక్ష్య భక్ష్యాయ నమః, ఓం సర్వభూతాన్తరాత్మనే నమః, ఓం హోత్రాయ నమః, ఓం మన్త్రాయ నమః, ఓం శుక్ల ధ్వజపతాకినే నమః, ఓం నమాయ నమః, ఓం నమ్యాయ నమః, ఓం కిలికిలాయ నమః, ఓం శయమానాయ నమః, ఓం శయితాయనమః, ఓం ఉత్థితాయ నమః

ఓం స్థితాయ నమః, ఓం చలమానాయనమః, ఓం ముద్రాయ నమః, ఓం కుటిలాయనమః, ఓం ముఖవాదిత్రకారిణే నమః, ఓం నాట్యోపహారలుబ్ధాయ నమః, ఓం గీత వాద్యరతాయ నమః, ఓం నర్తనశీలాయ నమః, ఓం జ్యేష్ఠాయ నమః, ఓం శ్రేష్ఠాయ నమః, ఓం బలపూర్వాయనమః, ఓం ప్రమథనాయనమః, ఓం కలనాయ నమః, ఓం కల్పాయనమః, ఓం క్షయాయ నమః, ఓం ఉపక్షయామ నమః, ఓం భీమదుందుభిహాసాయ నమః, ఓం భీమసేన ప్రియాయ నమః, ఓం ఉగ్రాయ నమః, ఓం దశబాహవే నమః, ఓం కపాలహస్తాయ నమః, ఓం చితాభస్మప్రియాయ నమః, ఓం విభీషణాయ నమః, ఓం భీష్మాయ నమః, ఓం భీష్మవ్రతధరాయ నమః, ఓం వికృతవక్షాయ నమః, ఓం ఖడ్గ జిహ్వాగ్రదంష్ట్రిణే నమః, ఓం పక్వాయ మాంస లుబ్ధాయ నమః, ఓం తుంబవీణా ప్రియాయ నమః, ఓం వృషాయనమః, ఓం వృష్యాయ నమః, ఓం వృష్ణయే నమః, ఓం వృషణాయనమః, ఓం కటింకటాయనమః, ఓం చండాయ నమః, ఓం సావయవాయ నమః, ఓం వరకృష్ణాయ నమః, ఓం వరాయ నమః, ఓం వరదాయ నమః, ఓం వరగంధమాల్య వస్త్రాయనమః,

ఓం వరాతివరయే నమః, ఓం వర్షాయ నమః, ఓం వాతాయ నమః, ఓం ఛాయాయై నమః, ఓం ఆతపాయనమః, ఓం రక్త విరక్తాయ నమః, ఓం శోభనాయ నమః, ఓం అక్షమాలినే నమః, ఓం సంభిన్నాయనమః, ఓం విభిన్నాయన నమః, ఓం వివిక్త వికటాయ నమః, ఓం అఘోరరూపరూపాయ నమః, ఓం ఘోరఘోరతరాయ నమః, ఓం శివాయ నమః, ఓం శాన్తాతరాయ నమః, ఓం శాన్తతరాయనమః, ఓం ఏకపదే నమః, ఓం బహునేత్రాయనమః, ఓం ఏకశీర్షే నమః, ఓం కృద్ధాయ నమః, ఓం లబ్ధాయ నమః, ఓం సంవిభాగ ప్రియాయ నమః, ఓం పంచమాలార్చితాంగాయ నమః, ఓం పాశుపతాయ నమః, ఓం చండాయ నమః, ఓం ఘంటాయనమః, ఓం ఘంటాజగ్ధరంధ్రిణే నమః, ఓం సహస్రశతఘంటాయనమః, ఓం ఘంటామాల ప్రియాయనమః, ఓం ప్రాణదండాయ నమః, ఓం త్యాగాయనమః, ఓం హిలిహిలాయ నమః, ఓం హుంహూంకారాయనమః, ఓం పారాయ నమః, ఓం హూం హూంకార ప్రియాయ నమః, ఓం శంభవే నమః, ఓం నిత్యం గిరి వృక్షకలాయ నమః, ఓం గర్భమాంస శృగాలాయ నమః, ఓం తారణాయనమః, ఓం తరాయ నమః,

ఓం యజ్ఞాధిపతయే నమః, ఓం ద్రుతాయనమః, ఓం ఉపద్రుతాయనమః, ఓం యజ్ఞవాహాయనమః, ఓం దానాయనమః, ఓం తప్యాయ నమః, ఓం తపనాయనమః, ఓం తటాయనమః, ఓం భవ్యాయ నమః, ఓం తడితాం పతయే నమః, ఓం అన్నదాయ నమః, ఓం అన్నపతయే నమః, ఓం అన్నభవాయ నమః, ఓం సహస్ర శీర్షే నమః, ఓం సహస్రచరణాయ నమః, ఓం సహస్రాద్యత శూలాయనమః, ఓం సహస్ర నయనాయనమః, ఓం బాలరూపాయనమః, ఓం బాలరూపధరాయ నమః, ఓం బాలానాం చైవగోప్త్రే నమః, ఓంబాల క్రీడనకాయ నమః, ఓం శుద్ధాయ నమః, ఓం బుద్ధాయనమః, ఓం క్షోభణాయ నమః, ఓం క్షతాయనమః, ఓం తరంగాంకిత కేశాయ నమః, ఓం ముక్తకేశాయ నమః, ఓం షట్కర్మనిష్ఠాయ నమః, ఓం త్రికర్మనిరతాయ నమః, ఓం వర్ణాశ్రమాణాం విధివత్ పృథక్కర్మ ప్రవర్తినే నమః, ఓం ఘోష్యాయనమః, ఓం కలకలాయనమః, ఓం శ్వేత పింగళ నేత్రాయనమః, ఓం కృష్ణరక్తేక్షణాయనమః, ఓం ధర్మార్థ కామమోక్షాయ నమః, ఓం క్రథాయనమః, ఓం క్రథనాయనమః, ఓం సాంఖ్యాయనమః, ఓం సాంఖ్యము ఖ్యాయ నమః, ఓం యోగాధిపతయే నమః, ఓం రథ్యవిరథ్యాయ నమః, ఓం చతుష్పథరతాయ నమః,

ఓం కృష్ణాజినోత్తరీయాయనమః, ఓం వ్యాళయజ్ఞోపవీతినే నమః, ఓం ఈశానాయ నమః, ఓం వజ్రసంహాయ నమః, ఓం హరికేశాయ నమః, ఓం అవివేకైక నాథాయ నమః, ఓం వ్యక్తావ్యక్తాయ నమః, ఓం కామాయ నమః, ఓం కామదాయ నమః, ఓం కామఘ్నాయ నమః, ఓం ధృష్టాయ నమః, ఓం దృప్తనిషూదనాయ నమః, ఓం సర్వాయ నమః, ఓం సర్వదాయ నమః, ఓం సంధ్యారాగాయ నమః, ఓం మహాబలాయ నమః, ఓం మహాబాహవే నమః, ఓం మహాసత్త్వాయ నమః, ఓం మహాద్యుతయే నమః, ఓం మహామేఘవరప్రేక్షాయ నమః, ఓం మహాకాలాయ నమః, ఓం స్థూలాయనమః, ఓం జీర్ణాంగాయ నమః, ఓం జటినేనమః, ఓం వల్కలాజినధారిణే నమః, ఓం దీప్తసూర్యాగ్ని జటినే నమః, ఓం వల్కలాజినవాససే నమః, ఓం సహస్ర సూర్య ప్రతిమాయనమః, ఓం తపోనిత్యా నమః, ఓం ఉన్మాదనాయ నమః, ఓం శతావర్తగంగాతో యార్ద్ర జాయ నమః, ఓం చంద్రా వర్తాయనమః, ఓం మేఘావర్తాయ నమః, ఓం అన్న కర్త్రేనమః, ఓం అన్నదాయ నమః, ఓం అన్నస్రష్టే నమః, ఓం అన్నపక్త్రే నమః, ఓం పక్వచుక పచేనమః, ఓం జరాయుజేనమః, ఓం అండజాయ నమః, ఓం స్వేదజాయ నమః, ఓం ఉద్భిజ్జాయనమః, ఓం దేవాయ నమః,

ఓం దేవేశాయ నమః, ఓం చతుర్విధ భూతగ్రామాయ నమః, ఓం చరాచర బ్రహ్మణే నమః, ఓం ప్రతిహర్త్రే నమః, ఓం విదుషాం బ్రహ్మణే నమః, ఓం బ్రహ్మ విదాం పరాయనమః, ఓం సత్త్వస్య పరమయోనయే నమః, ఓం అబ్నిధయే నమః, ఓం వాయు నిధయే నమః, ఓం జ్యోతిర్నిధయే నమః, ఓం రుగ్రూపాయనమః, ఓం సామరూపాయ నమః, ఓం ఓంకార రూపాయ నమః, ఓం హవిర్హావినే నమః, ఓం హూవాం వాచాహుతయై నమః, ఓం సురశ్రేష్ఠాయనమః, ఓం బ్రహ్మవాదిభిః, సామభిర్గీయమానాయ నమః, ఓం యజుర్మయాయనమః, ఓం ఋజ్మయాయ నమః, ఓం సామమయాయ నమః, ఓం అధర్వమయాయ నమః, ఓం బ్రహ్మ విద్భిః కల్పోని షదాంగణైః పఠ్యమానాయ నమః, ఓం బ్రాహ్మణాత్మనే నమః, ఓం క్షత్రియాత్మనే నమః, ఓం వైశ్యాత్మనే నమః, ఓం శూద్రాత్మనే నమః, ఓం వర్ణావరాత్మనే నమః, ఓం మేఘసంఘాత్మనే నమః, ఓం విశ్వస్త్రై నమః, ఓం స్తనితాయనమః, ఓం గర్జితాయనమః, ఓం సంవత్సరాయనమః, ఓం ఋత్వాత్మనే నమః, ఓం మాసాయ నమః, ఓం మాసార్ధాయ నమః, ఓం కలాత్మనేనమః, ఓం కాష్ఠాత్మనే నమః, ఓం నివేషాత్మనే నమః,

ఓం నక్షత్రాత్మనే నమః, ఓం యుగాత్మనే నమః, ఓం గ్రహాత్మనే నమః, ఓం వృషాణాం కకుదేనమః, ఓం గిరీణాం శిఖరాత్మనే నమః, ఓం మృగాణాం సింహాత్మనే నమః, ఓం పతతాం తార్ష్యాయనమః, ఓం భోగినామనన్తాయ నమః, ఓం ఉదధీనాం క్షీరోదాయ నమః, ఓం యంత్రాణాం ధనుషే నమః, ఓం ప్రహరణానాం వజ్రాయ నమః, ఓం వ్రతానానం సత్యాయ నమః, ఓం ద్వేషాయనమః, ఓం రాగాయ నమః, ఓం మోహాయనమః, ఓం క్షామాయ నమః, ఓం దమాయ నమః, ఓం శమాయ నమః, ఓం వ్యవసాయాయ నమః, ఓం ధృతయే నమః, ఓం లోభాయ నమః, ఓం కామాయ నమః, ఓం క్రోధాయ నమః, ఓం జయాయనమః, ఓం అజయాయ నమః, ఓం శరిణేనమః, ఓం చాపినే నమః, ఓం ఖట్వాంగినే నమః, ఓం ఝర్ఘరిణే నమః, ఓం ఛేత్రేనమః, ఓం ఛేత్రే నమః, ఓం నేత్రే నమః, ఓం అంతకాయ నమః, ఓం దశలక్షణసంయుక్త ధర్మాయ నమః, ఓం ఇంద్రాయ నమః, ఓం దశల లక్షణ సంయుక్తార్థాయ నమః, ఓం దశల లక్షణ సంయుక్త కామాయనమః, ఓం సముద్రాత్మనే నమః, ఓం సరిదాత్మనే నమః, ఓం పల్వలాత్మనే నమః, ఓం సరోరూపిణే నమః, ఓం లతాత్మనే నమః, ఓం వల్ల్యాత్మనే నమః, ఓం తృణాయ నమః, ఓం ఓషధ్యాయ నమః, ఓం పశ్యాత్మనే నమః, ఓం మృగాత్మనే నమః, ఓం పక్షిణే నమః,

ఓం ద్రవ్యకర్మ గుణారంభాయ నమః, ఓం కాలాయ నమః, ఓం పుష్పఫల ప్రదాయ నమః, ఓం ఆదయే నమః, ఓం అంతాయ నమః, ఓం మధ్యాయమ నమః, ఓం గాయత్ర్యోం కారాయనమః, ఓం కృష్ణాయనమః, ఓం నీలాయ నమః, ఓం పీతాయ నమః, ఓం అరుణాయ నమః, ఓం కద్రవే నమః, ఓం మేచకాయ నమః, సువర్ణ రేతసే నమః, ఓం విఖ్యాతాయ నమః, ఓం సుపర్ణాయ నమః, ఓం సువర్ణ నామ్నే నమః, ఓం సువర్ణ ప్రియాయ నమః, ఓం ఇంద్రాయనమః, ఓం యమాయ నమః, ఓం వరుణాయనమః, ఓం ధనదాయనమః, ఓం అనలాయనమః, ఓం ఉత్ఫుల్లాయనమః, ఓం చిత్రభానవే నమః, ఓం స్వర్భానవే నమః, ఓం హోత్రాయ నమః, ఓం హోత్రేనమః, ఓం హోమాయ నమః, ఓం హుతాయనమః, ఓం ప్రభవే నమః, ఓం సుపర్ణాయనమః, ఓం బ్రహ్మణేనమః, ఓం యజుషాం శతరుద్రియాయనమః, ఓం పవిత్రానాం పవిత్రాయనమః, ఓం మంగళానాం మంగళాయ నమః, ఓం గిరయే నమః, ఓం స్తోకాయనమః, ఓం వృక్షాయనమః, ఓం జీవాయ నమః,

ఓం పుర్గలాయనమః, ఓం సత్త్వాయనమః, ఓం రజసే నమః, ఓం తమసే నమః, ఓం ప్రజననాయ నమః, ఓం ప్రాణాయ నమః, ఓం అపానాయ నమః, ఓం సమానాయనమః, ఓం వ్యానాయ నమః, ఓం ఉన్మేషాయ నమః, ఓం నిమేషాయ నమః, ఓం జృంభితాయ నమః, ఓం క్షుతాయనమః, ఓం లోహితాంగాయ నమః, ఓం గదినే నమః, ఓం దంష్ట్రిణే నమః, ఓం మహావక్త్రాయ నమః, ఓం మహోదరాయనమః, ఓం శుచిరోమ్ణేనమః, ఓం హరిచ్ఛ్రశవేనమః, ఓం ఊర్ధ్వకేశాయ నమః, ఓం త్రిలోచనాయ నమః, ఓం గీతావాద్యనృత్యాంగాయ నమః, ఓం మత్స్యాయ నమః, ఓం జలినే నమః, ఓం జలాయ నమః, ఓం జల్యాయ నమః, ఓం జవాయ నమః, ఓం కాలాయ నమః, ఓం కలినే నమః, ఓం కలాయనమః, ఓం వికారాయ నమః, ఓం సుకాలాయ నమః, ఓం క(కా)లనాశనాయ నమః, ఓం మృత్యువే నమః, ఓం క్షయాయ నమః, ఓం క్షమాకరాయ నమః, ఓం అంతాయ నమః, ఓం అపాయకరాయ నమః, ఓం హరాయ నమః, ఓం సంవర్తకాయ నమః, ఓం అస్తహియనమః, ఓం సంవర్తక బలాహకాయ నమః, ఓం ఘటాయ నమః, ఓం ఘటికాయ నమః, ఓం ఘంటీకాయ నమః, ఓం చూడాలోలాయ నమః, ఓం బలాయ నమః, ఓం అబలాయ నమః, ఓం బ్రహ్మకాలాయ నమః, ఓం అగ్ని వక్త్రాయ నమః, ఓం దండినే నమః, ఓం ముండినే నమః, ఓం దండధృగ్రూపాయ నమః, ఓం చతుర్యుగాయ నమః, ఓం చతుర్వేదాయ నమః, ఓం చతుర్హోత్రాయ నమః, ఓం చుతుష్పథాయ నమః

ఓం చతురాశ్రమ వేత్త్రే నమః, ఓం చాతుర్వర్ణ్యకరాయనమః, ఓం క్షరాక్షర ప్రియాయనమః, ఓం ధూర్తాయనమః, ఓం అగణాయనమః, ఓం అగణ్యాయ నమః, ఓం గణాధిపాయ నమః, ఓం రుద్రాక్షమాల్యాంబర ధరాయనమః, ఓం గిరికాయనమః, ఓం గిరిక ప్రియాయనమః, ఓం శిల్పీశాయ నమః, ఓం శిల్పినాం శ్రేష్ఠాయనమః, ఓం సర్వశిల్పప్రవర్తకాయ నమః, ఓం భగనేత్రాంతకాయ నమః, ఓం చంద్రాయనమః, ఓం పూష్ణోదన్త వినాశనాయ నమః, ఓం గూఢావర్తాయనమః, ఓం గూఢాయనమః, ఓం గూఢప్రతినిషేవిత్రే నమః, ఓం తరణాయనమః, ఓం తారాకాయనమః, ఓం సర్వభూతసుతారణాయ నమః, ఓం ధాత్రేనమః, ఓం విధాత్రే నమః, ఓం సత్వానాం నిధాత్రే నమః, ఓం ధారణాయనమః, ఓం అధరాయనమః ఓం తపసే నమః,

ఓం బ్రహ్మణే నమః, ఓం సత్యాయనమః, ఓం బ్రహ్మచర్యాయ నమః, ఓం ఆర్జవాయనమః, ఓం భూతాత్మనేనమః, ఓం భూతకృతే నమః, భూతాయనమః, ఓం భూతభవ్యభవోద్భవాయ నమః, ఓం భూలోకాయనమః, ఓం భువర్లోకాయనమః, ఓం స్వర్లోకాయ నమః, ఓం ఇతాయనమః, ఓం ఉత్పత్తయే నమః, ఓం మహేశ్వరాయ నమః, ఓం ఈశానాయనమః, ఓం వీక్షణాయనమః, ఓం శాన్తాయనమః,

ఓం సర్వస్మైతే నమః, ఓం సర్వగాయ దేవాయ తే నమః, ఓం సర్వభూతపతయే భవతే నమః, ఓం సర్వభూతాంతరాత్మనే నమః, ఓం వివిధ దక్షిణైః యజ్ఞైః ఇజ్యమానాయతే నమః, ఓం సర్వస్య కర్త్రే తే నమః, ఓం స్వసూక్ష్మమాయా మోహకాయ తే నమః, ఓం శరణాగత ప్రసన్నాయ నమః, ఓం దేవదేవేశాయ నమః, ఓం మద్గతయే నమః, ఓం మత్ప్రతిష్ఠాయనమః, ఓం మదేకైక గతయే నమః

**దక్షుడు చెప్పిన ఈ శివనామాలు మహిమాన్వితమైనవి. ఈ నామాల్ని పఠిస్తూ శివపూజ చేసినట్లయితే శివానుగ్రహం సత్వరమే లభిస్తుంది.**

## వాయుపురాణం ఫలశ్రుతి

ధనంయశస్య మాయుష్యం పుణ్యం పాపప్రణాశనమ్ ।
కీర్తనం శ్రవణం చాస్య ధారణం చ విశేషతః ॥

వాయుపురాణాన్ని విన్నవాళ్ళు, శ్రద్ధగా పఠించినవాళ్ళు ఎంతో గొప్ప కీర్తి ప్రతిష్ఠల్ని ఆయురారోగ్యాల్నీ పొంది సకల పాపాల నుంచీ విముక్తులై పుణ్యఫలాల్ని పొందుతారు.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



